Acc. No: 23781

A. P. G. O. M. L. & R. I. Series 15




పరిష్కర్త

విద్వాన్, శిరోమణి శ్రీ అక్కిరాజు వేంకటేశ్వరశర్మ

రిటైర్డ్ సీనియర్ లెక్చరర్ – తెలుగు, సంస్కృతము

ఏ. సి. కాలేజి, గుంటూరు



జనరల్ ఎడిటర్

డా॥ వి. వి. యల్. నరసింహారావు, ఎం. ఏ., పిహెచ్. డి.,

డైరెక్టర్, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత

గ్రంథాలయ పరిశోధనాలయ శాఖ

ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ

ప్రాచ్యలిఖిత గ్రంథాలయం, పరిశోధనాలయము,

హైదరాబాద్-500 001

A.P.G.O.M.L. & R.I. Series 15.

TAARAKABRHAMA RAAJEEYAMU
By Chintalapudi Ellanarya

First Edition : MARCH 1985

No. of Copies : 200

Price : Rs. 34/—

894.8131
ELL

©
A. P. Govt. Oriental Manuscripts
Library & Research Institute,
Abids, Hyderabad 500 001.

Title Design : B.K. Chary

Printed at
MASTER ART PRINTERS
1-1-694/2/A, Gandhinagar,
Hyderabad 500 380.

# విషయసూచిక

Dr. V. V. L. Narasimha Rao, M.A., Ph.D.,
Director,
A.P.Govt. Oriental Mss. Library and
Research Institute,
Hyderabad,

# ప్రవేశిక

చింతలపూడి ఎల్లనార్యకవి రచించిన 'తారకబ్రహ్మరాజీయ' ప్రబంధము వస్తుగౌరవముచేతను, కవితావైభవముచేతను, మీదు మిక్కిలి రాయల ప్రబంధయుగమునకు సంబంధించిన సత్కావ్య మగుటచేతను, పయిగా నేటిదాక ముద్రణకు నోచుకొనక వ్రాతప్రతిగనే మరుగున పడియుండుటచేతను, దీనిని తొలుదొల్త ముద్రించి వెలుగులోనికి తెచ్చితి మన్న ఆనందము ఆంధ్రప్రదేశ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయ-పరిశోధనాలయమునకు దక్కినది.

ఈ ప్రబంధప్రచురణము నింతకుముందు ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ పురావస్తు ప్రదర్శనశాలల శాఖవారు తలపెట్టి, ప్రొఫెసర్ ఆర్ సుబ్రహ్మణ్యంగారి సంపాదకీయాంగ్ల పీఠికతో విద్వాన్ శిరోమణి శ్రీ అక్కిరాజు వేంకటేశ్వరశర్మగారి పరిష్కరణావతారికలతో కొంత దూరము పనిసాగించుట జరిగినది. కాని ఇట్టి ప్రాచీన ప్రబంధ ప్రచురణ మనునది ప్రాచ్యలిఖిత గ్రంథాలయ పరిశోధనాలయ పర్యవేక్షణలో జరిగిన బాగుగా నుండునని అప్పటి పురావస్తు ప్రదర్శనశాలల కమీషనర్ శ్రీ పి. సీతాపతి, ఐ ఎ.ఎస్.గారు అభిప్రాయ పడుటచేతను, అటుతర్వాత ఆ శాఖ డైరెక్టరు డా. వి. వి. కృష్ణశాస్త్రిగారు ఈ విషయమై నన్ను ప్రత్యేకముగా కోరియుండుటచేతను నేను వ్రాతప్రతులను పరిశీలించి మా సంస్థ పక్షమున దీనిని ప్రచురించుట కంగీకరించితిని. కనుక గ్రంథపరిష్కారమునందు పాటింపవలసిన నియమావళి గురించియు. అథసూచికల గురించియు, అనుబంధములగు గురించియు విపులముగా చర్చించి, స్పష్టమగు సూచనలతో పరిష్కర్తయగు శ్రీ వేంకటేశ్వరశర్మగారికి తిరిగి పని నప్పగించుట జరిగినది. శ్రీ శర్మగారీపని నెంత దక్షతతో నిర్వహించిరో తెలిసికొనుటకు పరిష్కృత గ్రంథమే ప్రత్యక్షసాక్ష్యము.

## వ్రాత ప్రతులు

ముద్రితగ్రంథమున కాధారభూతములైన వ్రాతప్రతులనుగూర్చి ముందుగా ముచ్చటింపవలెను. ఈ క్రింది వ్రాతప్రతు లీగ్రంథముద్రణ కుపకరించినవి.

1. 1925లో ప్రచురించిన మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయము వ్రాతప్రతుల త్రైవార్షిక పట్టిక మూడవ సంపుటము మూడవభాగమందు పేర్కొన్న 847 ఆర్. నంబరుగల తెలుగు తాళపత్రప్రతి.

2. అదే భాగమందు పేర్కొన్న 465 ఆర్. నంబరుగల కాగితపు వ్రాతప్రతి.

3. ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ పురావస్తు ప్రదర్శనశాలలశాఖవారి "80–48 నంబరుగల హైదరాబాదు తాళపత్రప్రతి''

4. అదేశాఖవారి 138/6, టి 2692 నంబరుగల 'కాకినాడ తాళపత్రప్రతి'

5. ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయమందలి 1691 – తెలుగు ఆర్. నంబరు, బి. 888 నంబరుగల కాగితపు వ్రాతప్రతి (పై వానిలో మొదటి దాని నకలు)

6. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయమందలి 58 నంబరుగల కాగితపు వ్రాతప్రతి (పై వానిలో మూడవదాని నకలు)

ఇందు మొదటిదగు తాళపత్రప్రతియందు తారకబ్రహ్మరాజీయములో నాలుగాశ్వాసములు మాత్రమే యున్నవి. నాలుగవ ఆశ్వాస మసమగ్రము. ఇది మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయమువారిచే 1917 -18 సం.లో శ్రీ నిడుదవోలు సుందరం పంతులు (శ్రీ వేంకటరావు గారి తండ్రి) గారి నుండి కొనబడినది. రెండవదగు కాగితపుప్రతియం దున్నవి రెండాశ్వాసములే. మూడవ దగు తాళపత్రప్రతియందు ప్రథమాశ్వాస ప్రారంభము కొంత శిథిలమైయున్నను, అయిదవ ఆశ్వాస ప్రారంభమున కొన్ని గద్యపద్యములు గలవు. నాలుగవదగు కాకినాడ ప్రతియందు మూడాశ్వాసములు మాత్రమే కలవు. మద్రాసు తాళపత్ర ప్రతికి పుత్రికయగు కాగితపు ప్రతి ఒకటియు (ఆర్.నం. తెలుగు అర్. 1691 బి. 888) ఆంధ్ర ప్రదేశ్ ఆర్కియాలజీ శాఖవారి తాళపత్ర ప్రతికి పుత్రిక యగు కాగితపు ప్రతియొకటియు (నం. 80- 48) ప్రస్తుతము ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయ పరిశోధనాలయమున గలవు. ఈ ప్రతుల యాధారములో ప్రస్తుత ముద్రితగ్రంథమునకు మాతృకగా ప్రొ. సుబ్రహ్మణ్యముగారి పర్యవేక్షణలో నొక వ్రాతప్రతి సిద్ధము చేయబడినది. కాని ఏ ప్రతినుండి ఏ పాఠము స్వీకరింపబడినదో అందు వివరముగా చెప్పవలసిన యక్కర యున్నను తాటియాకు ప్రతుల స్థితిగతులను బట్టి కాబోలు అది సాధ్యము కాలేదు. మద్రాసు ప్రతి వ్రాత తిన్ననిదైనను తప్పులెక్కువ, శైథిల్యము హెచ్చు. కాకినాడ ప్రతి వ్రాత చక్కనిది. పాఠముకూడ సాధువు. పత్రములు మాత్రము పొడిపొడియై రాలుచున్నవి. హైదరాబాదు ప్రతివ్రాత అగమ్యము. శైథిల్యముమాట చెప్పనక్కరలేదు. కనుక అన్ని ప్రతు లాధారముగా ఒక వ్రాత ప్రతి సమకూర్చుకొని, సాధుపాఠము నావిష్కరించుకొనుటే పరిష్కర్తలకు శరణ్యమైనది. (వ్రా) అని పేర్కొనబడిన వ్రాతప్రతియిదియే. ఇందు అవిష్కృత పాఠములు కొన్ని సాధువులు గాకపోవుట కవకాశము గలదు.

శ్రీశర్మగారు తా మనుసరించిన గ్రంథ పరిష్కరణ విధానమును వివరించుచు 'నా ఊహకు అందనివియు, నాదృష్టికి రానివియు' నగు పాఠములుండ వచ్చునని తమ చిత్త

శుద్ధిని ప్రకటించుట గుర్తింపదగిన యంశము. ప్రాచీనకావ్య పరిష్కారములో నిట్టి చిత్తశుద్ధిని పరమావశ్యకము. ప్రకృత గ్రంథ పరిష్కార ప్రచురణ బాధ్యత ప్రాచ్యలిఖిత గ్రంథాలయ పరిశోధనాలయము వహించుటచే సాధారణ సంపాదకుడుగా ప్రత్యక్షర పరిశీలనముచేసి యెడనెడ వలసిన మార్పులు కొన్ని చేయక నాకును తప్పినది కాదు. అయినను గ్రంథము నిర్దుష్టమని చెప్పుట కష్టము. శిథిలప్రాయములైన గ్రంథముల పరిస్థితి యిట్లే యుండునని తజ్ఞు లెరుగనిదికాదు. తారకబ్రహ్మ రాజీయమునకు క్రొత్తవియగు వ్రాతప్రతులు మునుముందు కాలగర్భమునుండి మరికొన్ని వెలువడుచో గ్రంథము సమగ్రమై నిర్దుష్టమగు రూపము సంతరించుకొనవచ్చును. అంతవరకు లభ్యమైనంతమేర, పరిష్కృతమైనంత మేర కావ్యమందలి గుణమును మన్నించుటయే మనస్విత యనిపించుకొనును. లభ్యమైన ప్రతులలో కాకినాడ ప్రతియందు మూడాశ్వాసములు మాత్రమేయున్నను అందలి పాఠములు చాలవరకు నిర్దుష్టములు. వ్రాతయు మిక్కిలి చక్కనిది. అరసున్నలును గలవు. శకటరేఫయు గలదు. అప్రతిసకాలములో అందకపోవుటచే పరిష్కర్తయగు శ్రీ శర్మగారిపని దుష్కరమైనది. ప్రతి అందిన పిమ్మట శ్రీశర్మగారి సవరణలను మూలప్రతితో పోల్చిచూచి సాధు పాఠము నేను నిర్దేశింపవలసి వచ్చినది. అవతారికా భాగముతోపాటు ఈ క్రింది గద్యపద్యములలో కొన్ని సవరణ లనివార్యములైనవి.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ప్రథమాశ్వాసము | 70, | 98, | 104, | 109, | 113 | | |
| ద్వితీయాశ్వాసము | 62, | 116 | | | | | |
| తృతీయాశ్వాసము | 1, | 7, | 8, | 54, | 120 | | |
| చతుర్థాశ్వాసము | 3, | 10, | 22, | 31, | 42, | 85, | 109 |
| పంచమాశ్వాసము | 1, | 5, | 18, | 20 | | | |

నాలుగైదాశ్వాసములకు మద్రాసు హైదరాబాదు ప్రతులు ఆధారభూతములు. హైదరాబాదు ప్రతియందు పంచమాశ్వాసము 24వ గద్యము తర్వాతకూడ కొన్ని పంక్తులుకలవుగాని అవి అగమ్యముగా నుండుటచే నిష్ప్రయోజనమయ్యెను. పరిష్కర్తయగు శ్రీశర్మగారు సంస్కృత కావ్యముల కొన్నింటిని సమర్థముగ ననువదించిన సత్కవియు నగుటచే తారకబ్రహ్మ రాజీయమందలి లుప్తపాదములను కొన్నింటిని పూరించిరి పంచమాశ్వాసమందలి 20వ పద్యము నెత్తుగీతికి నాలుగవపాదమేకాక అయిదవపాదముకూడ పూరించిరి. పూరణము పరమ రమ్యము.'తారకబ్రహ్మ వలవిధాతా నమోస్తు!'అనునది ఆపూరణము.కాని పద్యరచనలో ఎల్లనార్యుడు నాల్గుపాదములుగల తావున ఒత్తిడిపడి అయిదవపాద మెచ్చటను వ్రాయలేదు. కనుక అది కవి సమ్మతముకాదని భావింపనైనది. పరిష్కరణలో ఆవశ్యక సంస్కరణకున్న ప్రాధాన్యము అధిక పూరణమున కుండదుకదా! ఏమైనను పురావస్తు శాఖవారిగ్రంథ పరిష్కార ప్రచురణ ప్రయత్న మారంభించిన నాటినుండి పరిష్కర్తలకు క్రమక్రమముగా మూలప్రతుల నన్నింటిని చూచుకొనునవకాశము గలిగినచో గ్రంథ పరిష్కార క్లేశము చాల వరకు తగ్గియుండెడిది. 'పరిష్కరణవిధాన'మను శీర్షిక క్రింద శ్రీశర్మగారు వివరించిన శ్రమ

క్లేశము లుండెడివి కావు. ముద్రణసమయములో నాకును నింత క్లేశ ముండెడిది కాదు. ప్రాచీన ప్రబంధమునకు ప్రథమ ముద్రణము కనుక ముద్రితగ్రంథము కంటబడగనే యెల్ల క్లేశములు మరపునకు వచ్చును.

## కవి, కావ్యము

తారకబ్రహ్మరాజీయ కర్తపేరు ఎల్లనార్యు డని ఈ గ్రంథమం దెచ్చటను లేదు. ఆశ్వాసాంత గద్యలోమాత్ర మిట్లున్నది.

> "ఇది శ్రీ మదనగోపాల చరణకమల సేవాధురీణ - సత్కళాపారీణ —
> కృష్ణభట్టారక పౌత్ర - చింతలపూడి కామయ ప్రభు సుపుత్ర —
> శుద్ధ సారస్వత విభవ రాధామాధవ ప్రణీతంబైన శ్రీ తారకబ్రహ్మరాజం
> బను మహాప్రబంధంబు———"

రాధామాధవు డనగా చింతలపూడి యెల్లనార్యుడు కావలెను. రాధామాధవ కృతి రచించి రాయలచే రాధామాధవ కవిగా గౌరవింపబడినవాడు చింతపూడి యెల్లనార్యుడే కనుకను, తాత తండ్రుల పేర్లుకూడ సంవదించినవి కనుకను ఆతడే యితడని స్పష్టపడినది.

తారకబ్రహ్మ రాజీయముకంటె ముందుగా వ్రాయబడిన 'రాధా మాధవ'కృతియందు—
'చెప్పెఁ జింతలపూడెల్లన రాధామాధవ' మనియు,
'రాధామాధవ యెల్లనార్య ప్రణీతంబైన రాధామాధవం' బనియు,
'చింతలపూడి యెల్లకవిశేఖరు కోమల కావ్యకన్య' యనియు —
ఆశ్వాసాంత పద్యగద్యములలో చెప్పబడియుండుట సువిదితము.

ఈ కవిదిగనే చెప్పబడు "విష్ణుమాయా నాటక" ప్రబంధమందలి గద్యమందును

'రాధామాధవ యెల్లనార్య ప్రణీతంబైన శ్రీ విష్ణు మాయానాటకం' బని కవి తనపేరు చెప్పుకొనినాడు.

కనుక "తారకబ్రహ్మ రాజీయ" మందు కవినామము చింతలపూడి యెల్లనార్యుడని చెప్పబడకున్నను కవి యతడే యని స్పష్టము.

కావ్యనామము "తారకబ్రహ్మ రాజమా? తారకబ్రహ్మ రాజీయమా?" అను ప్రశ్న లేకపోలేదు ఈ తెలుగు ప్రబంధమునకు మూలగ్రంథముగా ఎల్లనార్యునిచే పేర్కొనబడిన నారాయణాశ్రమ యతికృత సంస్కృత గ్రంథము 'తారకబ్రహ్మ రాజీయ'మని యొక తావున (1–12–మద్రాసు ప్రతి ననుసరించి, కాకినాడ ప్రతి ననుసరించి కాదు) 'తారక

బ్రహ్మరాజ' మని వేరొక తావున కనవచ్చుచున్నది. ఆశ్వాసాంత గద్యలలో సైతము 'తారక బ్రహ్మరాజ' మనియే చెప్పబడినది. ఒక్క చతుర్థాశ్వాసాంతమందలి గద్యలో మాత్రము (హైదరాబాదు పురావస్తు శాఖ ప్రతిననుసరించి) "తారక బ్రహ్మ రాజీయ"మని యున్నది. పండిత లోకములో రూఢియందు 'తారకబ్రహ్మ రాజీయ'మను పేరే ప్రాచుర్య మందినది. భోజరాజీయము, సాత్రాజితీయము మొదలగు పేర్ల సామ్యము ననుసరించి తారకబ్రహ్మ రాజీయ'మను పేరే ప్రహతమై ప్రబంధ నామ మట్లే స్థిరపడినది. తారకబ్రహ్మ (మంత్ర) రాజమునకు సంబంధించిన కథ కనుక 'తారకబ్రహ్మ రాజీయ' మనుటే యెల్ల విధముల సముచితము.

ఈ తెలుగు ప్రబంధమునకు మూలముగా చెప్పబడిన నారాయణాశ్రమ యతికృత 'తారకబ్రహ్మ రాజీయ'గ్రంథమును సంస్కృత వాఙ్మయ చరిత్రకారు లెవ్వరును పేర్కొనిన జాడలేదు. కాలాంతరమున నెన్నడేని ఆ గ్రంథము బయల్పడుచో ఈ తెలుగు ప్రబంధము నకు తల్లిపోలిక లేమాత్రము కలవో చెప్పవచ్చును. అందాక బిడ్డపోలికలే దొడ్డపోలికలు.

## చారిత్రక విశేషములు

'తారకబ్రహ్మ రాజీయము' వలన పెక్కు చారిత్రిక విశేషములు బహిర్గతమై స్థిర పడినవి. ఈ కారణము చేకూడ ఈ గ్రంథ ప్రశస్తి హెచ్చినది. ఎల్లనార్యుడు శ్రీకృష్ణదేవ రాయలచే రాధామాధవ కవిబిరుదము నందుకొన్నను తనకావ్య మేదియును ఆ మహామహున కంకితమిచ్చినట్లు లేదు తారకబ్రహ్మ రాజీయము శ్రీరామునకే అంకితము. అట్లు దీనిని రామాంకితము చేయించినవాడు నంజయ తిమ్మరుసు. నంజయ తిమ్మరుసు అచ్యుత దేవ రాయల మంత్రి. అచ్యుత దేవరాయల రాజ్యకాలము క్రీ. శ 1530 నుండి 1542 వరకుగల పండ్రెండేండ్లు కృష్ణరాయల పిమ్మట అతని అనుమతితో విజయనగర వజ్రసింహాసనము నధిష్ఠించినవాడు రాయల సవతి తమ్ముడగు అచ్యుతదేవరాయలే. ఈయనకు "ప్రతి సంవత్స రంబు శ్రీ వేంకటేశ్వరునకు సత్కావ్య ప్రబంధ వాక్పుష్పాంజలి సమర్పించు"సన్నియమము కలదు (1–19). ఈ నియమములో నంశముగనే తారకబ్రహ్మ రాజీయము శ్రీ రామాంకిత ముగా నంజయ తిమ్మరుసుమంత్రి ఎల్లనార్యునిచే వ్రాయింప బూనెను. ఈ మంత్రివరేణ్యుడు "వేదపురాణ శాస్త్రముఖ విద్యలకెల్ల గురుం'డనియు, 'బ్రహ్మవిద్యా దృఢబుద్ధి' యనియు, బహువిధ లిపిలేఖన దక్షుడనియు, 'సమస్త దేశభాషా విదు'డనియు ఎల్లనార్యుడే వివరించెను (1–18). ఈ కారణమువలననే ఈతడు అచ్యుత దేవరాయల యొద్ద మంత్రిరత్నము కాగలిగెను.

అచ్యుత దేవరాయల కాలమున రాజ ప్రతిష్ఠ కొంత తగ్గినను అచ్యుతరాయలు సామా న్యుడు గాడు. రాజనాథడిండిమకవి తన 'అచ్యుతరాయాభ్యుదయము'లో అచ్యుత రాయల దిగ్విజయములు వర్ణించెను. కుటుంబ కలహములు ఆయన ప్రతిష్ఠకు కొంత భంగము కలి

గించినవి. తన పట్టాభిషేకము నిర్విఘ్నముగ జరుపుకొనవలెననియే యిష్టదైవమగు తిరుపతి వేంకటేశ్వరుని సన్నిధిలో దానిని జరుపుకొనెను. పట్టాభిషేకము ముగించుకొని తిరిగి విజయ నగరము బయలుదేరెనో లేదో ఉత్కళమునుండి ప్రతాపరుద్ర గజపతియు బీజాపూరునుండి సుల్తాన్ ఆదిల్‌షా సేనయును రాయలపై తారసిల్లి భీకరరణము కావించిరి. ఈ యిరువురిని చిత్తుగా నోడించి ఉదారముగా విడిచిపుచ్చి, అశ్వగజబలములు కానుకగా స్వీకరించి, విజయము సాధించికొనిన ధీరుడు అచ్యుతదేవరాయలు. అటు తర్వాత రాయలు తన బావమరదియైన సలకరాజు చిన తిరుమలరాజు నాయకత్వమున సాళువ నరసింగరాయ నాయకుని తిరుగుబాటు నణచి, ద్రావిడ దేశమున తన అధికారమును సుస్థిరము కావించుకొనెను. నరసింగరాయ నాయకుడు కేరళమునకు పారిపోయి అచ్చట తనమిత్రుడైన తిరువడి (శి)ని కూర్చుకొని తెంకాశి పాలకుడైన పాండ్య ప్రభుని పదవీచ్యుతుని కావించెను. అచ్యుతరాయల ఆజ్ఞతో చిన తిరుమలరాజు తామ్రపర్ణి యొడ్డున తిరువడిని తలయెత్తకుండ నోడించి పాదాక్రాంతు నొనర్చు కొని గజబలమును కానుకగా గొనెను. అటు తర్వాతనే పాండ్యరాజు తన పుత్రికను అచ్యుత దేవరాయల కిచ్చి అతని నల్లుని గావించుకొని తాను రాజ్యమున పునః ప్రతిష్ఠితు డయ్యెను. ఈ యంశములు తారకబ్రహ్మ రాజీయమున ప్రస్తావింపబడుట విశేషము. చూడుడు

> "తిరువశి (డి) గెల్చి పాండ్య నరదేవునిఁ బట్టము గట్టి యుత్కళే
> శ్వరుఁ గరుణించి మ్రొక్కిన సవాయికిఁ దా నభయం బొసంగి పెం
> పరుదగఁ గీర్తి చేకొనిన యచ్యుతరాయల మంత్రిరత్నమై
> తిరముగ నున్న నంజవిభు తిమ్మరుసుం దగుఁ బ్రస్తుతింపఁగన్" (1–17)

ఈ పద్యమందలి 'తిరుపశి'కి 'తిరువడి' యనియు, 'తిరుపతి' యనియు పాఠాంతర ములు గలవు. ఉద్దిష్టపాఠము 'తిరువడి'. డిండిమకవి 'అచ్యుతరాయాభ్యుదయము'లో పేర్కొనిన చేరరాజగు 'తిరువడి' యితడే. ఇతనిని గెలిచియే అచ్యుతరాయల సేనాని సలకరాజపుత్రుడు పాండ్యనరదేవునికి పట్టము గట్టెను. ఉత్కళేశ్వరుడనగా ప్రతాపరుద్ర గజపతి. సవాయి అనగా బీజాపూరుసుల్తాను. 'సవాయి' యనుపేరు బీజాపూరునకు పర్యాయము. అచ్యుతదేవరాయలను నిర్జించుటకై కృష్ణయొడ్డున ససైన్యముగా మోహరించియున్న బీజాపూర్ సుల్తాన్ తనకు రాయలను నిర్జించుట కష్టమనితెలిసి, కృష్ణదాటిపోయి రాయలశిబిరములో అతనికి మ్రొక్కి శరణువేడగా రాయలు అతనికి అభయమిచ్చిన వృత్తాంతము ఇచ్చట పేర్కొన బడినది. అచ్యుత దేవరాయలచే కరుణింపబడిన ఉత్కళేశ్వరుడు ప్రతాపరుద్రగజపతి కుమారుడు కాడు. కృష్ణదేవరాయలకు గండపెండెరముతోపాటు తన కూతు నిచ్చిన ప్రతాప రుద్రగజపతియే. రాయల యనంతరము రాజకీయ పరిస్థితులలో నేర్పడిన అస్తవ్యస్తస్థితిని అనుకూలముగా గ్రహించి అచ్యుత దేవరాయలపై దండెత్తి వచ్చి అతనిచేతిలో ప్రతాపరుద్ర గజపతి యోడుటయు, పిమ్మట నతని కరుణకు పాత్రుడగుటయు ఇందు ప్రసక్తము.

ఇట్లీపద్యమునందు నాటి రాజకీయ పరిస్థితులు చక్కగా ప్రస్తావింపబడినట్లు చారిత్రిక పరిశోధకులైన శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారు* మొదలైనవారు గుర్తించిరి.

మొత్తముమీద తారకబ్రహ్మరాజీయము తత్త్వసాహితీ నిక్షేపములనే కాక చారిత్రిక నిక్షేపములను కూడ వెలికితీసిన సద్గ్రంథము. కేవల సాహిత్యదృష్టితో కవితాశైలిని భావనా ప్రౌఢిని పరిశీలింపదలచినచో మచ్చున కొండు రెండు పద్యములు.

## భావనా శైలులు

ప్రబంధమందలి అవాంతర కథలలో బ్రాహ్మణబ్రువుని కథ యొకటి. ఇతడు సుకుమార నిరంకుశ నిగమశర్మ్మంకు సహోదరుడు. మగనాలియగు బోయతను మరిగిన ఈ బ్రాహ్మణబ్రువుడు అన్నిటికి తెగించి ఆడిన మాటలు గుండెలోతులనుండి వెలి కురికినట్లు వ్రాసినాడు ఎల్లనార్యుడు. చూడుడు.

"పడతీ, యాడిన మాట తప్పుదునె? యీ బ్రాహ్మ్యంబు నాకేటికిన్?
విడుతుం గాక కులంబు; నిన్ విడుతునే? వే యున్నదే నాకు? ని
య్యేడ సీతో భుజియించెదన్ గలసి, పుష్పేష ప్రియోద్దీపనం
బడరన్ నీ మధురాధరామృతముతో హాలారసం బానెదన్" (2—140)

ఇది తృతీయ పురుషార్థ ప్రకోప లక్షణము వర్ణింపబట్టు.

ఇక భక్తితత్త్వము పరాయణము ముట్ట కవి రాఘవమేఘము నెంత ఉదాత్తముగ వర్ణించెనో తిలకింపుడు. శైలీభావము లొండొంటితో పోటీపడి తత్త్వ గంభీరముగ నడిచిన సందర్భము.

"ధృతి లీలావన విస్ఫుర ద్భవ దవార్చివ్యాప్తి చల్లార న
ప్రతిమానాస్మ దనేక జన్మ సుకృతప్రావృ డ్విలాసాగత
క్షితిజావృష్టి సమేత రాఘవ నృపశ్రేష్ఠామృతాంభోద మూ
ర్తితమై లక్ష్మణచాతకప్రియము వచ్చెన్ జూడ్కు లింపారఁగన్" (3-65)

తారకబ్రహ్మ తత్త్వమును ఆలంకారికమార్గమున ప్రౌఢముగా చెప్పిన సందర్భమిది. ఒక్కమాటలో చెప్పవలెనన్న తారకబ్రహ్మరాజీయము తత్త్వ సాహితీ నిక్షేపము.

---

*1. 'విజయనగరసామ్రాజ్యము,—తెలుగుభాషాసమితి—విజ్ఞానసర్వస్వము సంపు—3 పుట 395
*2 'అచ్యుతదేవరాయల విజయము' వాఙ్మయవ్యాసమంజరి
ఆంధ్ర సారస్వత పరిషత్ప్రచురణ. పుటలు 85—96

## తత్త్వ సాహితీ నిక్షేపము

భారతీయ సాహిత్యమునకు పరమార్థము చతుర్విధ పురుషార్థసిద్ధి. తారకబ్రహ్మ రాజీయమునకును పరమార్థ మదియే. ఆమాట యెల్ల నార్యుడే చెప్పెను 'సకలవేదోక్తంబును, సకల మంత్ర సారంబును, చతుర్విధ పురుషార్థ ప్రదర్శకంబుననగు శ్రీరామతారకబ్రహ్మ రాజీయంబు పరమ భాగవతోత్తముండు ప్రయాగక్షేత్రవాసి నారాయణాశ్రమి యను మహా యతీశ్వరుండు సంస్కృతంబున రచియించెను'' (1–12). రామతారకమంత్ర ప్రశస్తిని రమణీయముగ చాటుటకు పుట్టిన ప్రబంధ మిది. రామచరిత్రముకంటె నెక్కువ మహిమగలది రామతారకమంత్రము సంప్రదాయశ్లోకములలో దీని ప్రశస్తి వేనోళ్ల గానము చేయబడినది.

''జయతు జయతు మంత్రం జన్మసాఫల్య మంత్రమ్
జనన మరణ ఖేద క్లేశ విచ్ఛేద మంత్రమ్
సకల నిగమ మంత్రం సర్వశాస్త్రైక మంత్రమ్
రఘుపతి నిజమంత్రం రామరామేతి మంత్రమ్''

ఈ మంత్రము షడక్షరి, విధిగా ఓంకారపూర్వకము.

''ఓం శ్రీరామ రామ'' యని కాని, ''ఓం రామాయ నమః'' అని కాని మంత్రము నుచ్చరింతురు.

ఆదికవి వాల్మీకి నోట వెలువడినది సాక్షాద్రామాయణవేదము. ''వేదవేద్యే పరే పుంసి'' ఇత్యాది శ్లోకములు ఆభావమునే ఉద్ఘోషించుచున్నవి. మంత్రములలోకెల్ల 'గాయత్రి' శ్రేష్ఠ మయ్యెను, గాయత్రీ రామాయణాదుల ప్రశస్తి ననుసరించి రామతారకమంత్రమే శ్రేష్ఠ తమ మనిపించును. ప్రపంచ భాషలందలి వివిధ సాహిత్యములలో రామాయణకథ యెన్నెన్ని మలుపులు తిరిగి యెన్నెన్ని మహిమలు ప్రసరింప చేసినను ''తారకమంత్ర'' మహిమ మాత్రము చరాచరాత్మక సర్వ జగత్సంతారకమై వెలుగొందుచునే యున్నది. కావ్యములలో ధ్వన్యాత్మకమై, శ్రుతిపేయమై, అనునిత్యము రుచులు పెంచుచునేయున్నది.

తెలుగున 'తారకబ్రహ్మ రాజీయ' గ్రంథమేకాక మరికొన్ని కృతులు సైతము ఇట్టి శీర్షికలతో వెలువడియున్నవి.

1. అగుమంచి జగన్నాథకవి కృత 'తారక బ్రహ్మ మంత్ర మాహాత్మ్యము'.
2. కొటికలపూడి కోదండరామ కవికృత 'తారకబ్రహ్మ మాహాత్మ్యము'.
3. శ్రీ బ్రహ్మయోగి ప్రణీత 'తారకనామ రామాయణము'.

మొదటి రెండిటి తాళపత్ర ప్రతులు మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయ గ్రంథ పట్టికలో పేర్కొనబడినవి.

మూడవదియగు 'తారకనామరామాయణము' గేయకావ్యము. తాళపత్ర ప్రతి యాధారముగా శ్రీ పైడిపాటి జయరామరెడ్డి, ఎం. ఏ., ఎం. ఫిల్, దీనిని పరిష్కరించి, పరిశోధనాత్మక పీఠికతో ముద్రించిరి.

రామకథ వాల్మీకి నోట ఏశుభ ముహూర్తమున వెలువడెనో కాని ఎల్లజీవుల సంతరింపజేయుచు ఎన్నెన్ని సాహితీ స్వరూపములనో సంతరించుకొన్నది. సంప్రదాయ ప్రౌఢ పద్యమునుండి సర్వజన సంసేవ్య మధురగేయమువరకు రామకథ యెత్తని అవతారము లేదు.

అయినను మంత్రమహిమకు సాహిత్య మధురిమ తోడైన రమ్యరచనలు కొన్ని మాత్రమే. వానిలో పద్య ప్రబంధ రూపమున సిద్ధించిన రచన 'తారకబ్రహ్మ రాజీయము'. అసమగ్రమైనను ఆత్మానందహేతువగు రచన.

'సీతమ్మ మాయమ్మ శ్రీరాముడు మాయయ్య' అని యా పుణ్యదంపతులను జగత్పితరులనుగా భావించులోకులకు 'తారకబ్రహ్మరాజీయ' మందలి సీతారాముల అతిమాత్ర శృంగారము కొంత ఎబ్బెట్టుగా దోచినను పరమార్థమున తారకబ్రహ్మ మంత్రఫలము ప్రశమన భావస్ఫోరకమై శాంతమునే ప్రతిష్ఠించును. బ్రహ్మైక్యఫలము శాంతమునగాక అన్యమున నెట్లు సిద్ధించును? రామతారక బ్రహ్మైక్య ఫలమును సూచించు సత్ప్రబంధము 'తారక బ్రహ్మ రాజీయము'.

## కృతజ్ఞత

ఇట్టి సత్ప్రబంధము ప్రచురించు నవకాశము ప్రాచ్యలిఖిత గ్రంథాలయమునకు కలిగించిన రాష్ట్ర పురావస్తు శాఖ సంచాలకులు, డా. వి. వి. కృష్ణశాస్త్రిగారికిని, గ్రంథ పరిష్కార ప్రచురణల విషయమై చిరకాలము శ్రద్ధపూని సంపాదకీయాంగ్ల పీఠిక సంతరించిన ప్రొఫెసర్ ఆర్. సుబ్రహ్మణ్యము గారికిని హృదయపూర్వక కృతజ్ఞతలు. గ్రంథ పరిష్కరణావతారికారచనలు సమర్థతతో నిర్వహించిన విద్వాన్ శిరోమణి శ్రీ అక్కిరాజు వేంకటేశ్వర శర్మగారికి స్నేహపూర్వక నమస్సులు. గ్రంథ ముద్రణ సమయమున ప్రూవులు సరిచూచుటయే కాక అకారాది క్రమమున గద్యపద్యానుక్రమణికను తిరిగి యెత్తి వ్రాసిన మాసంస్థ యందలి యుద్యోగులు శ్రీ కొడవలి సత్యనారాయణ శ్రీ కోడూరి విఠల్ రెడ్డి గార్లకు అనేకాభినందనలు.

సద్గ్రంథ ప్రచురణకు సర్వదా సంపూర్ణ సహకార మందించుచు, ఈ గ్రంథాలయ పురోభివృద్ధి కెంతయో తోడ్పడుచున్న ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమునకు హార్దికనమస్సులు.

ఇట్లు

మార్చి 1985

(సం) వానిలి వేంకటలక్ష్మీ నరసింహారావు

Prof. R. SUBRAHMANYAM,
M.A., Ph.D., F.R.A.S. (London)

# PREFACE

The author of this work 'Tarakabrahmarajiyamu' was one Chintalapudi Yellanarya. He belonged to the Srivatsa gotra and Apastamba sutra. His father was Kamayamatya and grand - father Krishnabhattaraka. His surname 'Chintalapudi' is a gramanama (Village name) and we have atleast a dozen villages of the same name in Telugu country and that renders it difficult to fix precisely the village to which he belonged.

Prof. N. Venkatarao and Sri E.V. Raghavachari believed that he was one of the eight literary stalwarts (Diggajas) that adorned the court of Krishnadevaraya and had the title 'Radha-Madhava-Kavi' bestowed on him by the Raya who was very much pleased with his erudition and poetic genius.

Ellanarya managed to get access to the court of the Raya through the good offices of one Timmarusayya, son of Nanjayya, the military accountant. In this work Ellana showers encomiums on Timmarusayya as a versatile scholar in vedas, puranas, and sastras, as an adept in writing and reading different scripts and speaking in all the languages spoken in the country and above all, a devout and trusted servant of the Raya. It was at his instance Ellanarya started composing the work 'Tarakabrahmarajiyamu' and dedicated it to Lord Ramachandra.

Yellanarya is also credited with the composition of another work *Vishnumaya Nataka,* though modern historians of Telugu literature, differ on the authenticity of this work. *Tarakabrahmarajiyamu* is based on a Sanskrit work attributed to Narayana Samyami a resident of Prayaga. Though it is essentially a work extolling the merit of chanting 'Tarakamantra', it is significant to the students of history for the side lights it throws on the contemporary society and life.

The exact date of this work is difficult to fix. We can definitely say that Ellana was one of those poets who flocked to the court of 'Andhra-Bhoja' i. e. Emperor Krishnadevaraya (1507-1529 A.D.) and continued to adorn the Vijayanagara court

during the reign of Raya's successor Achyuta. Number of anec dotes are current in Telugu country about how Ellana found access to the court and how Peddana the poet Laureate of Raya's court tested him before he was admitted into the literary court of the Raya. That was the period when Vaishnavism was gaining popularity in Vijayanagara due to its adoption by the members of the ruling family. No wonder Yellanarya chose a theme which was the dearest to the heart of the Rayas and other officers. Yellanarya actually mentions that he took up the task of composing 'Tarakabrahmarajiyamu' at the instance of Timmarusu the keeper of military accounts of the Raya's court. A detailed review of the contents which are of interest to the students of Telugu literature and philosophy is appended in the Telugu introduction. Here I confine myself to the historical references.

## THE HISTORICAL REFERENCE

In the 'Avatarika' or introduction to the Kavya, the author refers to Achyutaraya and the tradition of dedication of good *kavyas* every year to Lord Venkateswara at Tirupati.

Emperor Krishnaraya nominated Achyuta as his successor on Vijayanagara throne before his death, an arrangement which was not liked by his son-in-law Aliya Ramaraya. Saluva Narasingaraya nayaka alias Chellappa was entrusted with the duty of installing Achyuta on the throne. Achyuta who was released from his prison at Chandragiri had his coronation at Tirumala in the presence of his patron deity Lord Venkateswara first, when he was bathed in the water poured out of the conch in the hands of God Venkateswara and then proceeded towards the capital Hampi Vijayanagara. He had to face two foreign invasions, one by the Gajapati of Orissa and the other by the Sultan of Golkonda before he could entrench himself in the fort at Vijayanagara. Domestic intrigue led him to enter into an alliance with Ramaraya which strained his relations with the Pradhani Chellappa and the revolt of the latter. Achyuta succeeded in repelling the foreign invasion, crushing the internal revolt and to pay homage to Lord Venkateswara he visited Tirupati thrice. Achyuta's reign which ended with his death in 1542, was full of rebellions and inva-

sions, but all of them he faced with courage and was successful.

He was a Vaishnava by profession but was no sectarian. He patronized poets and religious teachers of all sects with equal respect and reverence.

At Tirupati we have number of records belonging to the reign of Achyuta registering rich gifts to the temple. On the 31st Jan. 1533 A. D. he paid a visit to the temple accompanied by his queen Varadaji Amman and his son Kumara Venkatadri. He is said to have performed on that occasion the Mahadanas 'Kapila-dhenu', 'Swarnameru'. etc. He also offered to Lord Venkateswara, *bahuvalayam*, a pair of *uchchippu* set with gems for the head, long string of pearls and other jewels. He conducted the *archana* himself while the *Archaka* recited the *Srinivasa Sahasranama*. During his second visit, perhaps in the year 1535 A. D., he instituted the new festivals '*Lakshmidevi Mahotsavam*' to be celebrated for five days for Lord Tiruvenkatamudaiyan and Alaimelmangai Nachchiyar and *Punarvasu Tirunal* for Raghunatha and Sita on each of the Punarvasu Nakshatra occurring in the year. He also built seven mandapas named after himself, his queen, his mother Obambika, father Narasanayaka and son Chikka Venkatadri. He also built buildings, excavated tanks, laid gardens, established charities and services in the temples to perpetuate their names. All these clearly show Achyuta's religious fervor and his special predilection towards Vishnu, particularly Ramavatara.

## A BRIEF SYNOPSIS OF "TARAKABRAHMARAJIYAMU"

This work 'Tarakabrahmarajiyamu' is divided into five sections and in each section special topics are highlighted. In the first asvasa, besides the avatarika or introduction, we have the topic- Parasara explaining the greatness of Tarakamantra to Vamadeva, Rama to wash off the sin of Brahma-hatya accrued to him by his killing of Ravana, constructed the temple of Ramalingeswara at setu, Agasthya teaching 'Rama Taraka Brahma Mahima' to Valakhilyas, extolling the superiority of Vishnu amongst the Hindu

triad and Vishnu giving Tarakamantra to Siva at Kasi or Banaras.

The second asvasa contains the information about the installation of images of Siva and Vishnu in Kasi; Manikarnika tirtha charitra, the reasons for one obtaining Moksha when one dies at Kasi, establishment of Vishnu's superiority over Siva by describing Sivabhaktas as Tamasas, and Vishnubhaktas as Satvikas in their Gunas, the merit of hearing 'Ramataraka-mantra' at the time of one's death illustrated by the story of the boya woman and brahman wretch etc.

The third asvasa deals with the story of how with the blessings of Rama a parrot started talking, presentation of Rama's story in dialogue, amorous actions of Sita & Rama at Chitrakuta, the anxiety of Devas and Agasthya explaining the greatness of Manmatha (cupid).

The fourth asvasa starts with the description of Tapas or austerities of Brihaspati to obtain boons from Lakshmi, the Devas utilising Surpanakha to prepara the ground for the future fight between Rama and Ravana, Ravana's abduction of Sita, friendship between Rama and Sugriva Hanuman locating Sita at Lanka, Rama's march against Ravana, Vibhishana obtaining asylum with Rama, the fight. Ravana's death, Rama's returning to Ayodhya along with Sita on pushpaka.

The fifth asvasa, which is incomplete and badly damaged, contains description of Rama's coronation, Sankara praising Ramachandra etc.

* * * * *

The book is essentially a work on Bhakti and Bhaktirasa has been well presented inpsite of certain extraneous elements introduced in the body of the text.

Publication of this text will be a valuable addition to the literary sources for the history of Vijayanagar.

(Sd.) R. SUBRAHMANYAM

విద్వాన్, శిరోమణి
శ్రీ అక్కిరాజు వేంకటేశ్వరశర్మ

# అవతారిక

## కావ్యనామ పరామర్శము

ఈ ప్రబంధము పేరు తారకబ్రహ్మరాజీయము.

తారయతి ఇతి తారకమ్. ఎల్లవారిని తరింపజేయునది గనుక దీనికి [శ్రీరామ మంత్రమునకు] తారకమని పేరు. శ్రీరామచంద్రుని పరబ్రహ్మ స్వరూపముగా భావించి రామబ్రహ్మమని పల్కుచుందురు. అట్లే శ్రీరామనామ జపపరమైన తారకమంత్రమునకు తారకబ్రహ్మమని ప్రసిద్ధి. తారకమే బ్రహ్మము - తారకబ్రహ్మము. మోక్షప్రదములగు మంత్రములం దీతారకబ్రహ్మము రాజువంటిది గనుక దీనికి తారకబ్రహ్మరాజము అని వ్యవహృతి. తారకబ్రహ్మరాజము (మంత్రము) యొక్క మహిమను దెల్పు కావ్య మగుటవలన తారకబ్రహ్మరాజీయము అని కవి నామనిర్దేశ మొనర్చెను. మరియు ఈ కావ్యము శ్రీరామ చంద్రునికే అంకితము.

సీ॥ "దురిత సంసారంబు తరియింపఁ జేయఁ గా
బ్రహ్మస్వరూపమై పఱగుకతన
తారకబ్రహ్మాభిధానమై శ్రీరామ
మంత్రోత్తమం బాగమముల వెలయు" [1–136]

అని కవి యీవిషయమునే ప్రతిపాదించెను. ఇది సమస్త మహా మంత్రములకును రాజువంటిదని అగస్త్యమహర్షి వాలఖిల్యాదిమునులకు ఆమంత్రముయొక్క రాజవైభవమును కవి వర్ణించెను.

సీ॥ ప్రణవంబు మణిమయ భద్రాసనం బాగ
మశ్రేణి నిత్యసామ్రాజ్యలక్ష్మి
యారూఢనారాయణాష్టాక్షరము శివ
పంచాక్షరమును నావ్తప్రధాన
రత్నముల్ చామరగ్రాహిణి గాయత్రి
యితర మంత్రములెల్ల భృత్యగణము
రాజతేజంబు శ్రీరామ ప్రభావంబు
సాధ్యంబు కామాది శత్రుకులము

గీ॥ ప్రతిదినోపాసకులు పరబ్రహ్మమునులు
తత్ప్రదేయార్థ మపవర్గ ధన్యపద మ
హాధిపత్యంబుగాఁ గ మూర్ధాభిషిక్త
మహిమ శ్రీతారకబ్రహ్మమంత్ర మొప్పు. [1–140]

ఈ మహామంత్రమునకు ఓంకారము సింహాసనము. సర్వవేదములు దీని సామ్రాజ్యము. శివపంచాక్షరీ నారాయణాష్టాక్షరీ మహామంత్రములు రెండును ఆప్తప్రధానులు. గాయత్రి చామరగ్రాహిణి. ఇతర మంత్రములు పరిచారకగణము. కామక్రోధాదులు జయింప దగిన శత్రువర్గము. పరమఋషులు కొలువులోనివారు. ముక్తిపదవియే వారి కిచ్చునట్టి జీతబత్తెములు. తారకబ్రహ్మరాజ మంత్రమే ఈ సామ్రాజ్యమునకు రాజు.

ఓంకార పూర్వకమైనప్పుడే యీ మంత్రము ఫలించునట.

"ముమూర్షో ర్మణికర్ణేతు మణికర్ణనివాసినః
అహం దిశామి తన్మంత్రం తారకబ్రహ్మవాచకమ్"

ఇచట మణికర్ణపదము ప్రత్యేకముగా తత్ప్రాముఖ్యమునుం దెల్పుచున్నను మొత్తము కాశీక్షేత్రమునకు బోధకమగును. కాశీక్షేత్రమున మరణించువారికి మరణసమయమున శివుడు తారకమంత్రమును ఉపదేశించెదనని శ్రీరామునికి వాగ్దానమొనర్చె నట,

కం॥ "మరికొందఱు శివపంచా
క్షరమును దారకంబుగాఁ జెప్పుదు రు
ర్వర నట్లైనియు శంభుని
పరమోక్తికి నప్రమాణభావము పుట్టున్." [1–139]

అని శ్రీరామమంత్రమే తారక మంత్రమని నిష్కర్షగా వచించెను.

గీ॥ "సప్తకోటి మహామంత్రజాలమునకు
రాజునారాయణాష్టాక్షరం బనందు్రి
సప్తకోటి మహామంత జాలమునకు
రాజు శివనామ పంచాక్షరంబ యంద్రు" [1–134]

ఇంత ప్రభావము వీని కెట్లు కల్గిన దంటిరేని యవి తారకబ్రహ్మ మంత్రోపాసన సాధకంబులు గనుక" అని శివకేశవ మంత్రములను రెంటిని తారకమంత్రోపాసనకు సాధకములుగా జెప్పి తారకమ త్రి ప్రాధాన్యమును చాటిచెప్పెను.

పూర్వము సేతువు [రామేశ్వరము] నందు లోపాముద్రా సహితుడైన అగస్త్యమహర్షి ముముక్షువులై తన నర్థించిన వాలఖిల్యాది మహర్షులకు ఈ తారకబ్రహ్మ మంత్రమును, తత్ప్రభావము ప్రసక్తానుప్రసక్తముగా తారకమంత్ర ప్రభావ ప్రతిపాదకములైన ఆయా కథలను దెల్పెనట.

ఆప్రకారముగానే ప్రయాగ క్షేత్రవాసియైన పరాశరమహర్షి తారకమంత్ర ప్రభావ మును దెలిసికొనుటకై వసిష్ఠమహర్షిచే పంపబడి తనచెంతకువచ్చిన వామదేవునకు ఆ తారక మంత్ర ప్రభావమును, తత్ప్రభావ ప్రతిపాదకములయిన కథలను బోధించెననికవి ఈ తారకబ్రహ్మరాజీయ కావ్య కథాగమనమునకు ద్వారమును కల్పించుకొనెను.

ఈ తారకబ్రహ్మరాజీయము ఐదాశ్వాసములు గల ప్రబంధము. ప్రథమాశ్వాసమున 156, ద్వితీయాశ్వాసమున 184, తృతీయాశ్వాసమున 134, చతుర్థాశ్వాసమున 130, పంచమా శ్వాసమున 24 గద్యపద్యములు కలవు. పంచమాశ్వాసములోని గద్యపద్య సంఖ్య ఇతరా శ్వాసము లందలి గద్యపద్యములలోని గద్యపద్య సంఖ్యతో ఇంచుమించుగా సరిసమానముగా నుండి యుండవచ్చును. కాని అవి నేను చూచిన ప్రతులందు వినష్టములు.

## కవి పరిచయము

ఈ తారకబ్రహ్మరాజీయ మను ప్రబంధమునకు రచయిత రాధామాధవ కవి బిరు దాంచితు డైన శ్రీ చింతలపూడి ఎల్లనార్యుడు. ఈతడు శ్రీవత్సగోత్రుడు. ఆపస్తంబ సూత్రుడు. కృష్ణ భట్టారకుని పౌత్రుడు. కామయామాత్యుని పుత్రుడు.

వీరి యింటి పేరు చింతలపూడి. చింతలపూడి గ్రామ వాస్తవ్యులైన కారణమున వీరి పూర్వుల కీయింటిపేరు వచ్చినది.

తెనుగు దేశములో పదునొకండు చింతలపూడి గ్రామము లున్నట్లు—తూర్పు గోదావరి జిల్లాలోని అమలాపురం తాలూకాలోనే 1. క్రొప చింతలపూడి 2. వన్నె చింతలపూడి 3. చింతలపూడి యను మూడు గ్రామము లున్నట్లు—వానిలో ఏదేని యొక చింతలపూడి ఈ కవి పూర్వ వంశీయుల గ్రామమై యుండవచ్చునని (సమగ్రాంధ్ర సాహిత్యము 7 సం॥ 229 పుట) శ్రీ ఆరుద్రగారు భావించిరి.

ఈ కవి శ్రీకృష్ణదేవరాయల వారి ఆస్థానమునందు అష్టదిగ్గజ కవులలో నొకడై యున్నాడని శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు శ్రీ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యుల వారు అభిప్రాయపడిరి.

అష్టదిగ్గజములలో నీతడును ఒక్కడా యను విషయమున అభిప్రాయభేద ముండిన నుండవచ్చును గాని ఈతడు కృష్ణరాయల ఆస్థానములో నున్నా డనుటయందు ఎవరికిని సందేహము లేదు. శ్రీకృష్ణదేవరాయలవారి రాజ్యపాలన కాలము క్రీ॥ శ॥ 1509—1530.

కృష్ణరాయలు నిర్యాణము చెందిన పిదప ఈయన సవతితల్లి యగు ఓబాంబిక పుత్రుడు అచ్యుతదేవరాయలు విద్యానగరమును పాలించిన కాలములోకూడ ఆయన ఆస్థాన మం దీ కవి యున్నాడు. అచ్యుత రాయల రాజ్యపాలన కాలము క్రీ॥ శ॥ 1530-1542.

ఎల్లనగారు తొలిసారి కృష్ణరాయల ఆస్థానమునకు వచ్చినప్పుడు ఆయన ప్రతిభా సామర్థ్యములను పరీక్షించుటకై రాయలు పెద్దనగారి నొక సమస్య నిండని యనగా పెద్దనగారు నగరు — తొగరు — తగరు — వగరు అనుపదములు ప్రాస స్థలమున చేర్చి రామాయణార్థము వచ్చునట్లు పద్యమును చెప్పవలసినదిగా కోరినారట. అప్పుడు ఎల్లన్న ఈ విధముగా ఆశువుగా పద్యమును చెప్పినాడట.

చం॥ నగరు పగాయె నింక విపినంబుల కేఁగుడు రాజ్యకాంక్షకుం
దగరు కుమారులార ! యని తల్లి వగన్ మిగులంగ దోఁపఁగాఁ
దొగరువ రక్ష కట్టి మదిఁదోఁపక గద్గద ఖిన్న కంఠియై
వగరుచుచున్నఁ జూచి రఘువంశవరేణ్యుఁడు తల్లి కిట్లనున్.

ఈ పద్యమును విన్న తరువాత ఈ విధముగానే భారతార్థము వచ్చునట్లు పద్యము చెప్పవలసినదని రాయలవారు కోరగా ఎల్లన ఈ విధముగా పద్యమును చెప్పినాడట.

తొగరుచి కన్నుదోయిఁ గదుఁదోఁపఁగఁ గర్ణుఁడు భీమసేనుపైఁ
దగరు ధరాధరంబు పయి దాకిన భంగిని దాఁకి నొచ్చి తా
వగరుచు నవ్వలన్ బరుగువారిన నచ్చటి రాజలోకముల్
నగరు సుయోధనాజ్ఞ మది నాటుటఁజేసి ధరాతలేశ్వరా !

రాయలవారు సంతసించి ఇదే విధముగా భాగవతపరముగాను పద్యమును వచింపు డని కోరగా ఎల్లన ఇట్లు చెప్పినాడట.

వగరుపుమాత్రమే పరుఁడు వశ్యుఁడుగాఁడు వభీసభిత్వ మె
వ్వఁగరుడవాహనుండు మునునాఁడటు డించుటయెల్ల నద్భవా !
తగరవికాక మోహపుఁశాతనులైన విడంగఁజూతురే
తొగరుచి యోషధీశునకుఁ దోపఁగఁజేయునె పీడనాడఁగన్.

ఈ పూరణమునుకూడ విని ప్రభువు పెద్దనాదికవుల ఆమోదముతో ఎల్లనగారికి సముచిత సత్కారములు చేసి తన ఆస్థానకవులలో ఈయనకును స్థానము కల్పించినారట ఈ ఎల్లన గారి రాధామాధవ కావ్యమును విన్న తరువాత ఆయనకు రాధామాధవకవి అను బిరుదము నిచ్చి సన్మానించినారట. ఈ విషయమును కవి తన కావ్యాదియందు ఇట్లు చెప్పుకొన్నాడు.

శా॥ రాధామాధవ మచ్యుతాంకితముగాఁ బ్రౌఢక్రియం జెప్పి త
న్మాధుర్యంబునఁ గృష్ణరాయవిభుఁ గర్ణాటేశు మెప్పించి నా
నాధాత్రీ ప్రతిమాన సత్కవులలోనన్ భూషణశ్రేణితో
రాధామాధవ నామమండిత జగత్ప్రఖ్యాత చారిత్రుఁడన్। [రాధా. 1–30]

అని రాధాసమేతుడగు మాధవుఁడు ఎల్లనగారికి స్వప్నమందు సాక్షాత్కరించి కవితా కల్పవల్లి అను మంత్రము నుపదేశించి రాధామాధవకృతిని రచించి తనకు అంకితముగా నొసగుమని కోరినట్లు చెప్పుకొన్నాడు.

'బోధించి యిష్ట దైవము
రాధాసతిఁగూడి సౌమ్య రమ్యాకృతి హృ
త్ప్రౌఢమునఁ దోఁచి కృష్ణుఁడు
రాధామాధవము చెప్పరా యని పలికెన్.' [రాధా. 1–26]

ఈ కవికి రాయలవారి ఆస్థానమందు కందాచారము లెక్కలు వ్రాసెడి ఉద్యోగి (ఛీఫ్ మిలిటరీ ఎక్కౌంటెంట్)గా నున్న నంజయగారి తిమ్మరుసయ్యతో పరిచయము కలిగి అది స్నేహముగా బలపడినది. ఈ తిమ్మరుసయ్య రాయలవారు గతించిన తరువాత అచ్యుత దేవరాయల కొలువులోకూడ నుండి అదే యుద్యోగమును నిర్వహించినాడు. ఈయన తండ్రి నంజయమంత్రి. తల్లి తిప్పాంబ. భార్య లింగాంబ. కుమారుడు నంజయ. ఈ తిమ్మరుసయ్యను గూర్చి ఎల్లనకవి తన తారకబ్రహ్మరాజీయములో ఇట్లు చెప్పుకొన్నాడు.

'వేద పురాణ శాస్త్రముల విద్యలకెల్ల గురుండు బ్రహ్మ వి
ద్యాదృఢ బుద్ధి నేర్పులిపులన్నియు వ్రాయు సమస్త దేశభా
షాదు లెఱుంగు స్వామిహితమైన ప్రయోజన మాచరించు నా
నా దిశలం బ్రసిద్ధుఁడగు నంజయతిమ్మనఁ బోల రెవ్వరున్.' [1–18]

ఈ తిమ్మరుసయ్య వేద పురాణ శాస్త్ర విద్యాపారంగతుడును బ్రహ్మ విద్యా విశారదుడును బహువిధ లేఖకుడును సమస్త దేశభాషాభిజ్ఞుండు నని ఈ పద్యమువలన తెలియుచున్నది. ఈయన ప్రేరణవల్లనే ఎల్లన తారకబ్రహ్మరాజీయ కావ్యమును శ్రీరామచంద్రున కంకితముగా నొసంగినాడట. ఈ విషయము ఈ పద్యమువల్ల తెలియుచున్నది.

'పరమ హితుఁడవు తారకబ్రహ్మరాజ
మను ప్రబంధంబు నీచెప్పినది మదాత్మ
నాయకుండగు శ్రీరఘునాయకునకు
నంకితము సేయవలయు నా కభిమతముగ.' [1–24]

ఈ కవి మూడవ కృతి విష్ణుమాయానాటకము అను ప్రబంధము. విష్ణుమాయవలన నారదుడు కొలనులో మునిగి స్త్రీగా మారిన కథ ఇందు కలదు. ఈ కృతికి కర్త రాధామాధవ కవి కాడని, దీని కర్త మడికి అనంతయ్య అని శ్రీ చాగంటి శేషయ్యగారి మతము. శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు వేదము వేంకటరాయశాస్త్రులవారు ఇది రాధామాధవ కవి కృతియే యని యభిప్రాయ పడినారు. శ్రీ ఆరుద్రగారు రెండు వాదములను పరామర్శించి యిది రాధామాధవ కవి కృతియేయని నిర్వచించినారు.

# కథా సంగ్రహము

పరాశరమునీంద్రుడు పవిత్ర క్షేత్రమైన ప్రయాగ యందలి త్రివేణీసంగమమందు మకర మాసమున స్నానమొనర్చి శిష్య సహస్రమునకు బ్రహ్మతత్త్వము నుపదేశించు చుండగా వసిష్ఠ శిష్యుఁడైన వామదేవుడు వచ్చి యిట్లనెను. 'మహానుభావా! మా గురువరేణ్యుఁడగు వసిష్ఠ మహర్షి నాకు తారకబ్రహ్మ మంత్రము నుపదేశించెను. తన్మంత్ర ప్రభావమును దెల్పుఁడని వారిని నేను ప్రార్థింపఁగా తా నపుడు సూర్యవంశీయుఁడైన దిలీపునకు బ్రహ్మజ్ఞానాత్మక రామాయణమును బోధించుచున్నందున తనకు వీలుకాదనియు, ప్రయాగక్షేత్రమున నున్న పరాశర మునీంద్రుని కడ కేగినచో నీ కాతఁడు తన్మంత్ర ప్రభావమును చక్కగా దెల్పుననియు నానతిచ్చెను. అందుకై నేను తమకడ కరుదెంచితిని''—అని పల్కెను.

అపుడు పరాశరుఁడు ప్రీతుఁడై వామదేవునకు తారకబ్రహ్మ మంత్ర ప్రభావము నిట్లు వివరించెను.

కాశీ విశ్వేశ్వరుని యానతిచే అగస్త్యుఁడు లోపాముద్రతో గలిసి కాశిని వీడివచ్చి విన్ధ్యాద్రి గర్వ మణచి దక్షిణదేశమందలి పుణ్యక్షేత్రములను సందర్శించుచు దక్షిణ సముద్ర తీరమందలి సేతువునకు వచ్చెను. కాశి నెడబాసి వచ్చినందుకు సంతాపపడెను.

కాశినుండి గంగకావళ్ళతో రామేశ్వర లింగాభిషేకార్థమై సేతువునకు విచ్చేసిన బ్రాహ్మణులతో గలిసి యగస్త్యుఁడు శివ లింగార్చనవేళ కెదురుచూచుచు నొక మఱ్ఱి చెట్టు క్రింద నుండగా నా వృక్ష శాఖలందు తల క్రిందుగా వ్రేలుచు తపము సలుపుచున్న వాలఖిల్యాది మహర్షులు క్రిందికి దిగివచ్చి యగస్త్యునికి నమస్కరించి యిట్లనిరి. ''మహర్షీ! పూర్వము శ్రీరామచంద్రుఁడు రావణవధానంతరము సీతాసహితుఁడై యిచటి కేతెంచి యీ పుణ్యక్షేత్రమున రామేశ్వరలింగమును ప్రతిష్ఠించెను. ఆ సమయమున మోక్షార్థులమై యిచట తపము సలుపుచున్న వాలఖిల్యులమగు మాకు కృతార్థత యెట్లు కల్గునని నారదమహర్షి శ్రీరాముని ప్రశ్నించెను.

అపుడు శ్రీరాముఁడు కొంతకాలమునకు వీరికోరిక యగస్త్య మహర్షివలన సిద్ధించునని పల్కి యయోధ్య కేగెను.

ఆ నాటినుండి మే మిచట తపము సల్పుచున్నాము. నేటికి తమ దర్శనము కల్గినది. మాకు ముక్తి మార్గము నుపదేశింపుడు'' అని వేడుకొనిరి.

అగస్త్యుఁ డందుల కామోదించి వారితో గూడి సముద్రమునను బ్రహ్మ కుండికా తీర్థమునను స్నానమొనర్చి సేతువుయొక్క మహిమను కీర్తించెను. 'రావణవధవలన కలిగిన బ్రహ్మహత్య తనను వెంటాడుచుండగా దానిని విశపించుకొనుటకై శ్రీరాముడు సేతువు

దగ్గర శివలింగమును ప్రతిష్ఠింపదలచి హనుమంతుని శివలింగమును దెమ్మని పంపించెను. హనుమంతుని రాక యాలస్యమైనందున ముహూర్తము మించిపోవునని సీతాకృతమైన సైకత లింగమును ప్రతిష్ఠించెను.

ఆంజనేయుఁడు లింగమును తీసికొనివచ్చి ప్రతిష్ఠితమైన సైకతలింగస్థానమున తాను తెచ్చిన లింగమును ప్రతిష్ఠించుటకై సైకత లింగమును తొలగించుటకై ప్రయత్నించి విఫలుఁడై భంగపాటు చెందెను. తుదకు శ్రీరాముఁడు ఆంజనేయుఁడు తెచ్చిన శివలింగమును గూడ సైకత లింగము ప్రక్కనే ప్రతిష్ఠించెను.' అని అగస్త్య మహర్షి లోపాముద్రకును వాలఖిల్యులకును శ్రీరామ ప్రతిష్ఠితమైన రామలింగేశ్వర వృత్తాంతమును దెల్పెను.

అటుపిమ్మట నా మహర్షి ముక్తి మంటపమున గూర్చుండి, వాలఖిల్యులకు కైవల్య ప్రాప్తికి ఉపాయము దెల్పెదనని తలంచి శ్రీరామ దేవతాత్మకమైన తారకబ్రహ్మ రాజమంత్ర మును తత్త్వభావమును వివరముగా వారికి బోధించి మీ రీ మంత్ర రాజమును కాశీక్షేత్రమున జపించి సిద్ధిని గాంచు డని వచించెను.

తారకమంత్ర సిద్ధికిని కాశీ క్షేత్రమునకును గల సంబంధమును గూర్చి వాలఖిల్యులు ప్రశ్నింపగా 'శివుఁడు భృగుమహర్షి శాపముచేత మోక్షప్రదాత కాజాలక చింతించుచు విష్ణువును కాశిలో సందర్శించి ఆయనవలన తారక మంత్రమును ఉపదేశముగా గ్రహించి, తాను గౌరీ దేవికి గూడ ఆ మంత్రమును ఉపదేశించెను.' అని వాలఖిల్యాదులకు అగస్త్య మహర్షి వివరించెను.

## ద్వితీయాశ్వాస కథ

విష్ణువు కాశియం దేల వసించెను ? శివు డచటి కేల వచ్చె నని వామదేవుఁ డడుగగా పరాశరుఁ డిట్లు వివరించెను.

ఆదికాలమున బ్రహ్మ యీ వనమునందు రాజసూయయాగ మొనర్చుచు తద్యజ్ఞ రక్షణార్థమై శ్రీ మహావిష్ణువును ప్రార్థించెను. విష్ణు వచటికి విచ్చేసి ఎల్లవారి కానందమును కలిగించెను. అందువలన కాశికి ఆనందవనము అను పేరు వచ్చెను. విష్ణువుచేత అవిముక్తము (విడువ బడనిది) అగుటవలన అవిముక్తక్షేత్ర మను పేరు కల్గెను. ప్రకాశించుచుండును గనుక దీనికి కాశి యని పేరు వచ్చెను.

తొల్లి శివుడు త్రిపురాసుర సంహారమొనర్చి యా పురములనుండి మూడు దివ్య మణులను దెచ్చి వానిలో నొకదానిని పార్వతీదేవి కొసగి తాను తక్కిన రెంటిని కర్ణాభరణ ములుగా దాల్చి తాండవము సేయుచుండగా ఒకటి జారి కాశియందు పడెను. దానిని గైకొనుటకై శివుఁడు కాశికి వచ్చి విష్ణుని సందర్శించెను. విష్ణువు శంకరుని సంభావించి నీమణి

పడిన యీ కుండమునకు మణికర్ణిక యని ప్రసిద్ధి కల్గును. కొంతకాలమునకు దీనిపై సురగంగా ప్రవాహంబు ప్రవహించును. ఈ కాశీక్షేత్రము పంచక్రోశమితమై పుణ్య క్షేత్రము లన్నింటిలో శ్రేష్ఠమైన దగును అని వచించెను.

అచటికి బ్రహ్మాది దేవతలు పార్వతియు ప్రమథులును విచ్చేసిరి. విష్ణువుయొక్క కోరికను మన్నించి పార్వతీశంకరులు విశాలాక్షీవిశ్వనాథులను నామములతో కాశీక్షేత్రమున వసించిరి. విష్ణువు శివునకు తారకమంత్రము నుపదేశించెను. శివుఁడా తారక మంత్రమును జపించుచు భక్తులకు ముక్తి నొసంగుచు లింగాకారమున కాశియందు వెలసెను. శంకరుని యందు గల ప్రేమతో విష్ణువు కూడ అచ్చటనే నిలిచెను.

తరువాత కొంత కాలమునకు భగీరథుఁడు భూలోకమునకు దివిజగంగను తీసికొని వచ్చెను. ఆ గంగానది మణికర్ణిక నొరసి ప్రవహించెను.

కాశియందు మరణించువారి స్థూలదేహ లింగదేహములను కాలభైరవుఁడు త్రిశూలములో పొడిచి పట్టును. దానిని భైరవ నరక మందురు. అది క్షణకాలము మాత్రమే యుండును. దానితో జీవుఁడు సర్వపాపవిముక్తుఁడై నారాయణుని దివ్యరూపమును దాల్చి తుదకు బ్రహ్మ తేజమున గలియును. కాశీ క్షేత్రము తారకమంత్రోపదేశమునకు తగిన క్షేత్రము' అని పెల విచ్చెను.

'హరి హరు లిర్వురును సమానులని కదా యందురు మరి హరి హరునకు గురువై తారక మంత్రము నుపదేశించుట యెట్లు?' అని వాలఖిల్యులు ప్రశ్నింపగా నగస్త్య మహర్షి యిట్లు వివరించెను.

'విష్ణువు సత్వగుణ స్వరూపుడు. శివుఁడు తమోగుణ స్వరూపుఁడు. కనుక విష్ణువు శివునకు ఉపదేష్ట కాగల్గెను.' అని యింకను విష్ణ్వాధిక్యమును బహువిధముల దెల్పెను. 'కాశిలో మృతి చెందువారికి మరణవేళ శివుడు చెవిలో తారక మంత్ర ముపదేశించును. వానికి మోక్షము లభించును.

అంతేకాదు, మరణ సమయమున రామనామమును వినుచు ప్రాణములు విడిచినవాడు సర్వపాప విముక్తుడై మోక్షమందును. దీనికి తార్కాణముగా నొక యితిహాసము కలదు. దానిని విను'డని యగస్త్యుఁడు వాలఖిల్యులకు ఆ కథ నిట్లు తెల్పెను.

## బోయత - బ్రాహ్మణ బ్రువుడు

'మహారాష్ట్ర దేశమునందు ఒక బోయపల్లె కలదు. ఆ బోయపల్లెలోని భార్య చక్కని చుక్క. కడు వన్నెలాడి. తీర్థయాత్రాపరుఁడును యువకుఁడును రూపవంతుఁడును విద్వాంసుడును అగు ఒక బ్రాహ్మణుఁడు కాశి కేగుచు త్రోవలో నా బోయపల్లెకు చేరి యా వన్నె

లాడిని జూచి మరులుగొనెను. పరస్త్రీ సంగమము పాపహేతువు కాదని పురాణములనుండి దృష్టాంతముల నెత్తి చూపి తన మనస్సుకు నచ్చ జెప్పుకొనెను. ఆ బ్రాహ్మణునియందా వన్నెలాడికిని వలపు గలిగెను. వారిరువురును ఒక దేవాలయమునందు రాత్రులు బహువిధ రతులతో సుఖించిరి. అట్లు కొన్నాళ్లు కడపి తుద కా భ్రష్ట బ్రాహ్మణుడు ఆ బోయతను దానికడ నున్న పెంపుడు రాచిల్కను గూడ తన వెంట నిడుకొని రహస్యముగా వెడలి పోయెను. ఆ చిలుక రామ రామ యని నిరతము పల్కుచుండును. ఆ బ్రాహ్మణుడా చిల్కకు రామసత్కథలను నేర్పెను. ఆ చిలుకచేత రాజ సభలలో రామ కథలు పలికించి ధనార్జన చేయవచ్చునని అతని ఆశయము. మహారాష్ట్ర దేశమునకు రాజధానియగు పుష్పవతియను పురమునకు బోయతతోను చిలుకతోను గూడి పోవుచు ఆ బ్రాహ్మణుడు త్రోవలో పలురకముల మద్య మాంసములను బోయతతో కలిసి యారగించెను. వారు పుష్పవతీపురమును జేరిరి. ఆ పురమున నొక యింట వసించుచు వారు విప్రులమని భార్యాభర్తలమని చెప్పుకొనుచుండిరి. సుఖముగా కాలము కడపుచుండిరి.

ఇచట ఆబోయత మగడైన బోయఱేఁడు తన బోయదండుతో గూడి తన గూడెమునకు తిరిగి వచ్చి తనకాంత పరదేశి విప్రునితో గూడి లేచిపోయిన జాడ తెలిసి వారిపై పగపూని వారిని చంపుటకై ఆయుధములను గైకొని మారువేషము దాల్చి వారు పోయిన జాడను దెలిసికొని తానును మారువేషము వేసికొని వారున్న పుష్పవతీపురమును జేరెను.

బ్రాహ్మణుఁడును అతని ప్రియురాలును బాగుగా నలంకరించుకొని చిలుక పంజరమును చేత బట్టుకొని రాజాస్థానమున ప్రవేశించి సభలోని వారు తమ రూప సంపదకు వెఱగుపడుచుండగా రాజుననుజ్ఞ వడసి యా చిలుకచేత నద్భుతముగా రామకథా ప్రసంగంబులు చేయించుచు సభ్య లోకమునెల్ల నానందజలధిలో నోలలాడించు చుండెను.

ఆసమయమున నా బోయఱేఁడు సభలో ప్రవేశించి వారిద్దరిని జూచి పెనుకోపమున తన కత్తికి వారి నెరగావించెను. రాజుకు సభా సదులకు వారి దుశ్చరిత్రము నెఱిగించెను. సభా సదులతోపాటు రాజు ధర్మధ్వజుఁడు ఆ క్రూరకర్మమును జూచిన పాపము పరిహృతమగుటకై రామనామము నుచ్చరించుచు ఆ బోయఱేని సాహసమునకు కోపించి వాని తలను భటులచే నఱికించెను. మరణ కాలమున రామనామ శ్రవణ ప్రభావముచేత మృతిచెందిన ఆ బ్రాహ్మణుఁడును బోయతయు బోయఱేఁడును సర్వపాప విముక్తులై శ్రీరామస్వరూపులై వైకుంఠమున కేగిరి."

## తృతీయాశ్వాస కథ

"చిలుకలు మానవులవలె నెట్లు పలుక నేర్చెను? మరియు నీ చిలుకలు రామనామమునే యుచ్చరించుటకు గల హేతువేమి?" అని వాలఖిల్యులు ప్రశ్నింపగా అగస్త్య మహర్షి వారి కీవిధముగా తద్వృత్తాంతమును వివరించెను.

'లోక రక్షణార్థము శ్రీ మహావిష్ణువు కౌసల్యా దశరథులకు పుత్రుఁడై భూలోకమున జన్మించెను. ఆదిశేషుఁడు లక్ష్మణుఁడుగాను శంఖచక్రములు భరత శత్రుఘ్నులుగాను అవతరించిరి.

దశరథుఁడు శ్రీరామునికి పట్టాభిషేకము సేయఁదలంపగా దశరథుని చిన్నరాణి కైక మంథరా బోధచేత దుర్బుద్ధియై దశరథుఁడు తనకు పూర్వ మిత్తు నన్న రెండు వరముల నడిగి రాముని అరణ్య వాసమునకు పంపెను. భరతునికి రాజ్యమును రెండవ వరముగా నడిగెను.

శ్రీరాముఁడు పితురాజ్ఞా పాలకుడై సీతాలక్ష్మణ సహితుడై యరణ్యముల కేగెను.

శ్రీరాముడు చిత్రకూటము చెంత సీతాలక్ష్మణ సహితుడై వనవాసము చేయుచున్న కాలమున వసంతోదయ మాయెను.

లలిత పల్లవకుసుమ శోభితమై వనము కడు రమణీయముగా నుండెను. సీతకు వినోదముగా నుండుటకును ప్రొద్దు పోకకును వనదేవత యొకతె యొక రాచిల్కను గొని వచ్చి యిచ్చెను. శ్రీరాముఁడు ఆ చిలుకను సీతకు ఇష్టసఖిగా నొసగి సీత కోరికను మన్నించి దానికి నేర్చిన పలుకులనెల్ల పలుక గల వరము ననుగ్రహించెను. సీత ఆ చిలుకకు 'రామ రామ' అని పలుకుటను నేర్పగలిగెను. శ్రీరాముని కరుణవలన నాటినుండి పలుకుల నేర్వ గలిగెను.

అంతేకాదు భారతీదేవి నెచ్చెలియైన చిలుకగూడ ముందు 'రామ రామ' యని పలికి పిదప వేదములను పఠియించుచుండును. అని పరాశరుడు వాలఖిల్యులకు చిలుక పలుకులు నేర్వ గల్గుటకు కారణమును వివరించుచు ఈ కథను చెప్పెను.

'శ్రీరాముఁడు సీతతో గూడి చిత్రకూట గిరి పరిసర భూములందు అభిమత క్రీడలం దేలుచు సంచరించుచు కన్నుల పండువుగా గాంచినవారై యచటి మహర్షులు రాముని దివ్య మనోహర రూపమును గాంచి తాముగూడ నారీ రూపమును దాల్చి శ్రీరాముని గూడి సుఖింప వలెనని మక్కువ పడిరి. ఆ ఋషులు శ్రీరాముని తమ మనోరథమును దీర్చుమని వేడుకొనగా శ్రీరాముఁడు వారి మనోరథమును శ్రీకృష్ణావతారమున దీర్తునని అపుడు మీరెల్లరు గోపికలై జన్మించి నాకు ప్రియ వల్లభలగుదురని సెలవిచ్చెను.

తరువాత భరతుఁడు వచ్చి శ్రీరాముని పాదుకలనుగొని అయోధ్యకు జని యా పాదుకలకు పట్టాభిషేక మొనర్చెను. ఆ చిత్ర కూటమున రాముఁడొక సంవత్సరకాలము వసించెను విరాధుఁడను రాక్షసుని వధించెను. అగస్త్యాశ్రమమున కేగి లోపాముద్రా సహితుఁడైన

అగస్త్యుని పూజించెను. అగస్త్యుడు శ్రీరామునకు అక్షయ బాణ తూణీరములను దివ్య చాప మును ఇచ్చెను.

ఆ పిదప శ్రీరాముఁడు వసంత ఋతువున సీతతోఁగూడి విశ్రుంఖలలీల వివిధ విహార ములను వివిధ రతి క్రీడలను జలుపుచు సాకేత సామ్రాజ్య లక్ష్మీ విలాసానుభవ సారస్యంబు నిరాకరించి సమస్త భోగములను సీతా సంభోగమునందే అనుభవించుచు వైకుంఠ దివ్య భవనమున శేష పర్యంకమున లక్ష్మీ సమేతుఁడై యుండు నాటికంటె పరమానందము నందుచు క్రీడించు చుండెను. ఇట్లు పన్నెండు సంవత్సరములు కడచెను.

అపు డింద్రాది దేవతలెల్లరు శ్రీరాముడు మైథిలీరతి పరవశుఁడై యున్నాడు. ఇక రావణ సంహార మెట్లగును? అని చింతా క్రాంతులైరి. బృహస్పతి మన్మథు డెంతటివానినైన వశీకృతునిగా జేయునుచు నింద్రునకు మన్మథుని జన్మకథను అతని ప్రభావమును వివరించి సీతను రావణుడు అపహరించు నట్లొనర్చినగాని శ్రీరాముడు రావణుని సంహరింపడనియు. అందుకు ఒక ఉపాయమును వచించెను. ఆ యుపాయమునకు దేవత లెల్లరును సంతసించిరి.

## చతుర్థాశ్వాసకథ

బృహస్పతి యింద్రాదులను వెంట నిడుకొని క్షీరసముద్రము చెంతకేగి లక్ష్మీదేవిని సంస్తవించెను. లక్ష్మీదేవి ప్రసన్నురాలై వారికి సాక్షాత్కరించెను. బృహస్పతి ఆమెవుగా నొక దండకముతో స్తుతించెను. దేవతలు రావణ బాధితులై స్వర్గపురమును వీడి పరితపించు చున్నారు. రావణుని దుశ్చర్యలు అంతకంతకు దుస్సహములగుచున్నవి. మాయాబలముచేత రావణుని ప్రేరేపించి అతడు సీతనెత్తుకొని పోవునట్లు చేసినచో అతడు సీత నెత్తుకొనిపోయి లంకలో బంధించును. అపుడు శ్రీరాముఁడు లంకపై దండెత్తి రావణుని వధించును. దీనికి తమ అనుగ్రహము కావలయునని బృహస్పతి లక్ష్మీదేవిని ప్రార్థించెను. లక్ష్మీదేవి అభిమత సిద్ధియగునట్లు వారి నాశీర్వదించి తారకబ్రహ్మమంత్రమును ఉపదేశించి వైకుంఠమున కేగెను.

అంతట శూర్పణఖ ఇంద్రాదులున్న వనమున కరుదేరగా వారామె సౌందర్యమును ప్రశంసించి 'నీకు తగిన పురుషుడు శ్రీరాముడే. అతనిని భర్తగా బడసి నీ సౌందర్యమును సఫల మొనర్చుకొను'మని యనిరి. అంతట శూర్పణఖ అతి సుందరమైన మానవనారీరూప మును దాల్చి శ్రీరాముని కడకేగి తన వలపును దెలిపి తన్నేలు కొమ్మనెను.

శ్రీరాముడు పరిహాసమునకై దానిని లక్ష్మణుని కడకంపగా లక్ష్మణుడు మరల దానిని శ్రీరాముడే నీకు తగిన పురుషుడని పంపెను. రాముఁడు తన్ను పరిగ్రహించుటకు సీత ప్రతిబంధముగానున్నదని యాగ్రహించిన శూర్పణఖ సీతను కబళించుటకై పోగా లక్ష్మ ణుడు దాని ముక్కు చెవులను గోసెను.

శూర్పణఖ ఖరదూషణాది రాక్షసులను రామలక్ష్మణుల పైకి యుద్ధమునకు తీసికొని వచ్చెను. శ్రీరాముడు వారిని యుద్ధమున వధించెను. శూర్పణఖ అంతట లంకకేగి సీతా సౌందర్యమును గొప్పగా వర్ణించి రావణున కామెపై మోహమును గల్గించి తనకు కల్గిన పరాభవమునకు సీతాపహరణమే ప్రతీకారమని పల్కెను.

రావణుడు సీతను గొనివచ్చి లంకయందు బందీగానుంచెను. శ్రీరాముడు సీతా వియోగమునకై దుఃఖించుచు లక్ష్మణ సహితుడై సీత నన్వేషించుటకై బయలుదేరి ఋష్యమూక పర్వతమందు సుగ్రీవు తో మైత్రిపొంది వాలిని వధించి కిష్కింధారాజ్యమున సుగ్రీవు నభిషేకించెను.

వర్షర్తువు కడచిన పిదప హనుమదాది కపివీరులను సుగ్రీవుడు సీతాన్వేషణకై పంపెను. శ్రీరాము డొసగిన అంగుళీయకమును గ్రహించి ఆంజనేయుడు సముద్రము నంఘింప దలంచినవాడై ఉత్సాహభరితుడై రాము డొసగిన అంగుళీయకమును పైకెగుర వేయగా నది బ్రహ్మలోకమున బడెను ఆంజనేయుడు బ్రహ్మలోకమున కేగి బ్రహ్మ సభ లోని వారినెల్ల తన తేజముచేత మెప్పించి అంగుళీయకమును తీసికొని భూలోకమునకు దిగి వచ్చి సముద్రమును లంఘించి లంకకేగి సీతకు గాంచి అంగుళీయకము నామె కర్పించి సీత యొసగిన చూడామణిని గ్రహించెను. లంకను దహించి తిరిగి శ్రీరాముని కడ కరుదెంచి సీతావార్త నెఱింగించెను.

శ్రీరాముడు వానరసేనతో గూడి సముద్రముపై సేతువు గట్టి లంకకేగి యుద్ధము నందు రాక్షస వీరులతోడ రావణుని వధించెను. అగ్ని పరిశుద్ధి గాంచిన సీతను పరిగ్రహించి రాక్షస వానర వీరులు వెంటరాగ సీతాలక్ష్మణ సహితుడై పుష్పక విమానారూఢుడై అయోధ్యకు వెడలెను.

ముందుగా హనుమంతు డేగి శ్రీరామాగమన వార్తను భరతునకు దెల్పెను. పిదప శ్రీరాముడు మహావైభవముతో అయోధ్యలో ప్రవేశించెను.

## పంచమాఖ్యాన కథ

పురమును ప్రవేశించిన పిదప అభిజిల్లగ్నమున శ్రీరాముని పట్టాభిషేకము వసిష్ఠ మహర్షి యాధ్వర్యమున వైభవోపేతముగా జరిగెను. ఆ మహోత్సవమున కింద్రాది దేవత లెల్లరు అరుదెంచిరి. మనుచక్రవర్తికి సూర్యుడొసగిన రత్నకిరీటమును శ్రీరాముని శిరముపై నుంచిరి. ఇంద్రుడు కకుత్స్థునకిచ్చిన ఇంద్రనీల కుండలములను అలంకరించిరి. భరతు డిష్వాకు పూజించిన పాదుకలను దొడిగిరి. కనక పీతాంబరముల కట్టబెట్టిరి. రత్నసింహాసనమున సీతారాములను గూర్చుండబెట్టి సకల నదనదీ సముద్ర జలములతో నభిషేకము చేసిరి. లక్ష్మణుడు ఛత్రము పట్టగా భరత శత్రుఘ్నులు తాళవృంతములు చేబూనిరి. సురలు పుష్పవర్షము గురిపించిరి. గంధర్వులు పాడిరి. అప్సరస లాడిరి. శివుడు తాండవ మాడెను. సీతారాములను శంకరుడు సంస్తుతించెను.

## కృతిపరామర్శ

తారకబ్రహ్మరాజీయ ప్రబంధమునకు మూలము ప్రయాగ క్షేత్ర వాసియైన నారాయణ సంయమి అను యతీశ్వరుని సంస్కృత గ్రంథము.

'యతివరేణ్యులు నారాయణాశ్రములు మ
హానుభావులు నుడివి రయ్యాగమాంత
పరిచితంబైన తారకబ్రహ్మరాజ
మఖిల సన్మంత్ర తారాఖ్యమైనదాని' [1–20]

అని ఎల్లనగారు మూలగ్రంథకర్తను — తత్కృతిని ప్రశంసించినారు.

కృతి అవతారికలో తన రచనను ప్రోత్సహించిన సంజయమంత్రికిని తనకును శ్రీకృష్ణరాయల తరువాత ఆశ్రయమొసంగిన అచ్యుతరాయలను గూర్చి ప్రతి సంవత్సరము శ్రీవేంకటేశ్వరునకు సత్కావ్య ప్రబంధ పుష్పాంజలులు సమర్పించుచు సుకృతంబులు నిర్వహించుకొనుచున్నవాడు అని ప్రశంసించాడు.

ఈ కవి తన కవితా మాధుర్యమును ఇట్లు తానే ఉగ్గడించుకొన్నాడు.

'రాధారుణాధరోరు ప
యోధరకాశ్మీర రసశుభోదయకవితా
మాధుర్య ధుర్యు నన్నున్
రాధామాధవుని సుకవిరత్నము బిలికెన్' [1–23]

ఈయన పూర్వ కవిస్తుతిలో సంస్కృతకవులైన వాల్మీకి వ్యాస కాళిదాస భవభూతి ప్రభృతుల నందరిని ప్రశంసించి ఆంధ్రకవులలో కవిత్రయము వారిని మాత్రమే ప్రశంసించినాడు. శ్రీనాథాదులను పేర్కొనలేదు.

ఈయన రచించిన మూడు కావ్యములును విష్ణుప్రభావ ప్రతిపాదకము లగుటను బట్టియు గద్యయందు శ్రీమదనగోపాలచరణ సేవాపారీణ'' అని తన్ను గూర్చి చెప్పుకొనుటను బట్టియు నీతడు విష్ణుభక్తి భరితుడని తెనియదగును.

ఈతడు శివునికంటె విష్ణువధికుడని వచించు సందర్భములనుకూడ ఈ కావ్యములో పొందుపరిచినాడు.

''సేవ్యుఁడవు గావు ముక్తివాంఛింప నీ ప్ర
సాదము నయోగ్యమగునని'' భృగుమహర్షి శివుని శపించినట్లును అందువలన శివుడు మోక్షప్రదాత కాజాలఁ డనియు విష్ణువు సత్వగుణ గరిష్ఠుడు గావున తామసప్రకృతియగు

శివునకు తారకమంత్రము నుపదేశించి శివునకు గురువాయె ననియు, విష్ణువే బ్రహ్మాండముల సృజింప బ్రహ్మలను సృజించి, తానే వానిని రక్షించి వాని మాయింప, వెక్కంద్రు రుద్రులను గల్పించెననియు ఈ గ్రంథమునందు వచించినాడు. ఇది యాతని గాఢమైన వైష్ణవ భక్తికి ఉదాహరణము.

భక్తిజ్ఞాన ప్రాధాన్యముగల యీ ప్రబంధమునందు సైతము ఈ కవి వెరవు దొరికిన చోట్ల నెల్ల శృంగారమును విశృంఖలముగానే వర్ణించినాడు బోయతో బ్రాహ్మణబ్రువుడు సాగించిన జారశృంగారము మేరమీరిన వారి ప్రవృత్తులకు తగినట్లే యున్నది. కనుక పాత్రౌచిత్య దృష్టితో చూచినప్పు డది సమర్థనీయమే యగును. కాని ఉదాత్తప్రకృతులను జగత్తునకు జననీ జనకులను ఆనదగిన సీతారాముల రతివర్ణనమునందు కూడ ఈయన విశృంఖలముగానే గంటమును నడిపినాడు. అది ఉచితముగా దోపదు.

'కామపూగుత్తులు వట్టికోయఁగఁ దాను
కుచములు పట్టు పూగుత్తులనుచు' [3—84]

అని కుచగ్రహణమును

'అమ్మహిపతి జానకీరమణి మంజుకుచద్వయ చక్రదంపతుల్
మహితనఖాంకనూతన సముద్యుతిచేఁ గడు నొప్పుచుండగాన్.' [3—95]

అని నఖక్షతములను తక్కిన సురత ప్రక్రియల నన్నిటినిగూడ తృప్తిగా చెప్పి చెప్పి తుదకు 'శ్రీరాముఁడు సాకేత సామ్రాజ్య లక్ష్మీ విలాసానుభవ సారస్యంబు నిరాకరించి సకలభోగంబుల సీతా సంభోగంబునంద యనుభవించుచు వైకుంఠదివ్యభవన శేషపర్యంక లక్ష్మీ సమేతుండై యుండు నాటికంటెఁ బరమానందంబునం గ్రీడింపుచు దండకారణ్యంబునం బంబ్రదెండెండ్లుఁడెను. అని సీతారాముల వనవాసకాలమును వారి విలాస విహారయాత్రగా వర్ణించినాడు.

ధ్వన్యాలోకకారుడు 'ఉత్తమ ప్రకృతే రాజాదే రుత్తమ ప్రకృతిభిః నాయికాభిః సహ గ్రామ్యసంభోగ వర్ణనం తత్పిత్రోః సంభోగవర్ణనమివ సుతరా మసభ్యం' అని ఉత్తమ ప్రకృతుల సురత వర్ణనమును నిరసించెను.

ఈ శృంగార వర్ణనకు ప్రయోజనము శ్రీరాముడు సీతా సౌందర్యలాలసుడై కామక్రీడలం దేలుచు అవతార ప్రయోజనమైన రావణ సంహార కార్యమును మరచినాడని దేవతలు చింతించి రామ రావణ కలహమును కల్పింపనెంచి శూర్పణఖను రామునికడకు పంపిరని చెప్పుటయే. యాదృచ్ఛికమైన శూర్పణఖా ప్రవేశము రామరావణ కలహ బీజముగా వాల్మీకి చిత్రించెను. అచ్చట దేవతల ప్రేరణము ప్రేషణమును లేవు. ఉదాత్తప్రకృతులైన సీతారాములను కాముకులుగా చిత్రింపవలసిన పనియులేదు ఈ కల్పన శ్రీ నారాయణ సంయమి

వ్రాసిన మూలగ్రంథమున నున్నదో లేక ఎల్లన్నగారే చేసిరో తెలియదు. శ్రీ నారాయణ సంయమీంద్రులు వ్రాసిన మూలగ్రంథమందే ఇది యంతయు నిట్లేయున్న యెడల మన ఎల్ల నార్యుడు దీనికెంత మాత్రము ఉత్తరవాది కాడుగదా! కథా సందర్భములందలి గుణదోషము లన్నియు ఆసంయమీంద్రులవే యగును.

రామరావణ కలహమునకు బీజారోపమన దగిన శూర్పణఖా ప్రవేశము విధివిలాస మునగాని యాదృచ్ఛికముగా గాని జరిగినట్లు చెప్పినచో కథాగతికాటంక మేమియు నుండదు కదా! వాల్మీకి రామాయణమున దేవతల ప్రేరణ లేకయే కదా శూర్పణఖ రామునికడకు వచ్చి నట్లున్నది!

శూర్పణఖా ప్రవేశమునకు దేవతల ప్రేరణను హేతువుగాను — ఆ దేవతల ప్రేరణకు శ్రీరాముని కర్తవ్య విస్మరణము హేతువుగాను — ఆ విస్మృతికి శ్రీరాముని కామప్రవృత్తిని హేతువుగాను చెప్పుట అంత సమంజసముగా తోచదు.

ఇట్లే దేవతలు శూర్పణఖా ప్రయోగరూపమైన తమ ఉపాయము సిద్ధించుటకై లక్ష్మీ దేవిని ప్రసన్నురాలినిగా జేసికొనుట — సుదీర్ఘమైన దండకముతో బృహస్పతి లక్ష్మిని స్తుతించుట — అను అంశములుకూడ ప్రధానకథతో చక్కగా ననుసంధానమును పొందలేదు. ఈ భాగము లేకున్నను కథాగమనమునకు లోటేమియు కాన్పింపదు.

రామకార్యము నతిత్వరగా సాధించుటకై సముద్రమును శీఘ్రముగా దాటవలసిన ఆంజ నేయుడు అంగుళీయకమును హుషారుగా బ్రహ్మలోకమున బడున బ్లైగురవైచి దానిని దెచ్చు కొనుటకై బ్రహ్మలోకమున కేగినట్లున్న కల్పనయు సందర్భౌచిత్యమునకు దూరముగా నున్నది. ఇట్టి స్వల్పములైన నెఱసులు కొన్నియున్నను ఈ కృతి కవితా సౌందర్యముచేత మహాప్రబంధ గౌరవమును దక్కించుకొన్నది. మచ్చునకొన్ని పద్యములను కనుగొనుడు.

పూర్వ సంధ్యా వర్ణనాత్మకమైన దీపద్యము

'అపుడు నీరెండ బసుపునీరాడి పసిడి
తమ్మినునుచాయ తెంబట్టు తనరఁగట్టి
కచభరంబునఁ బ్రొద్దు చెంగల్వ ముంచి
చెలువు మీఱంగ దినముఖశ్రీ తనర్చె'. [2—115]

లేయెండ యను పసుపు నీటితో స్నానమాడి పసిడితమ్మి పూచాయగల పట్టుపుటమునుగట్టి ఉదయారుణ బింబమును చెంగలువను సిగలో దాల్చి ఉదయ సాంధ్యశ్రీ చనుదెంచిన దనెడి యీ భావము కడురమణీయముకదా!

ప్రకృతి వర్ణనకు ప్రకృత కథలోని పాత్ర వర్ణనకు పొత్తు కలిపి సొంపుగా వర్ణించు నేర్పును ఈ కవికి కలదు.

సాయం సంధ్యావర్ణనతో బోయజవరాలి వర్ణనకు ఈ పద్యములో ఎంత చక్కగా పొత్తుకుదిర్చినాడో పరిశీలింపుడు.

సీ॥ బోయతజేగురు బొట్టుక్రొమ్మించునా
 వెలవంజకెంజాయ యిగురుకొనియె
తలవపూబోణి చన్నుల ప్రతికృతులనాఁ
 దమ్ములు ముకుళీకృతమ్ము లయ్యె
మ్లేచ్ఛవధూటి కన్మొఱఁగుల సిరులనాఁ
 జారునీలోత్పలచయము లయ్యె
శబరకామిని కచచ్ఛటల సోయగమొ నాఁ
 గప్పారు చీఁకటి క్రమ్ముకొనియె

తే గీ॥ నామహీసురు సంతాప మరుణభాను
కాంతిశిఖిపోలు నాద్విజాగ్రణి దివాంధ
మట్లు మఱమప్పె నావిప్రుఁ డంబుజాక్షి
రాకనెంచెఁజకోరంబు రాకవోలె. [2—?9]

బోయత నుదుటి జేగురుబొట్టువలె సాంధ్యకాంతి వ్యాపించుచున్నది. ఆమె చను మొగ్గలవలె పద్మములు మొగ్గలైనవి. నల్లగలువలు ఆమె కాటుక కన్నుల వన్నెలను వెలువరించుచున్నవి. చీకటి యామె వినీల కుంతలములవలె క్రమ్ముకొనుచున్నది. ఆ విప్రుని సంతాపము అస్తగతుడగుచున్న భానుని యరుణకాంతియను నగ్నివలె నున్నది. పగలెల్ల వంతనొందుచున్న విప్రుడు గూబవలె నున్నాడు. అతడు ఆ బోయతరాకను చకోరము రాకను [పున్నమి] గోరినట్లు కోరుచున్నాడు. ఇది చాల మనోజ్ఞమైన భావన.

చంద్రోదయ వర్ణనలోగూడ ప్రకృత కథలోని పాత్రతో పొత్తుగలిపి వర్ణించినతీరు మనోజ్ఞముగా నున్నది.

క॥ ఖండశశిచుక్కతో నా
ఖండలదిశ దోఁచె శబరకామినిమదుటన్
గొండిక ముత్యము బొట్టిడి
యుండుటగాఁ జూచి విప్రుఁ డుల్లం బలరన్. [2—112]

తూరుపుదిశ నుదుట నెలవంక పొడిచినది ఆనెలవంకపై సన్నని చుక్క తళుక్కు మని మెఱయుచున్నది. బ్రాహ్మణు డాసుందర దృశ్యమును గాంచినంతనే యాతని మదిలో తన ప్రియురాలగు భిల్లసుందరి నుదుట తీర్చిదిద్దిన కల్యాణతిలకపు ఆకృతిగల ముత్తెపు బొట్టు తళుక్కుమన్నదట

శూర్పణఖ సీతాదేవి సౌందర్యమును గాంచి తనలోతాను మెచ్చుకొనుచున్న సందర్భము నందలి యీ పద్యమును జూడుడు.

సీ॥ కనకగర్భుఁడుగానఁ గనకంబు మేనఁగా
నిలిపి మైనిగనిగ నిలిపినాఁడు
పద్మాసనుఁడుగానఁ బద్మంబు మొగమున
నిలిపి సౌరభ్యంబు నిలిపినాఁడు
వాణీశ్వరుఁడుగాన వాణిఁగంఠంబున
నిలిపి వీణను జేత నిలిపినాఁడు
హంసవాహుఁడుగాన హంసేంద్రయానంబు
నిలిపి యొయ్యారంబు నిలిపినాఁడు

తే.గీ॥ గాక స్రష్టకు నింకఁ దత్కార కైక
గుణము లున్నవె జానకీ కుచ నితంబ
కచ నఖాంకుర మృదులోరుకాండ ముఖ శు
భాంగ సౌభాగ్య విభవంబు లలరఁజేయ (4-53)

కుమ్మరి కుండలు చేయవలె నన్న అతనికడ మృత్తిక ఉండవలెను. స్వర్ణకారుడు స్వర్ణాభరణము చేయవలెనన్న అతనికడ సువర్ణము ఉండవలెను. అది లేనిచో నాత డా వస్తువును చేయజాలడు. అట్లే సృష్టికర్తయగు బ్రహ్మకుగూడ సౌందర్యమయములగు సీతాదేవి కరచరణాద్యవయవములను సృష్టించునపుడు ఆయా ఉపాదానకారణము లుండ వలెను.

బ్రహ్మదేవుడు హిరణ్యగర్భుడు గనుక హిరణ్యము (కనకము)తో సీతాదేవి శరీరమును సృష్టించినాడు. ఆమె శరీరము సువర్ణవిరచితము గనుక మెఱుగుపెట్టి మేని నిగనిగలు సమకూర్చినాడు. అతడు పద్మము ఆసనముగా గలవాడు. కనుక పద్మమునే సీతముఖ ముగా విరచించి పద్మగతమైన సౌరభమునుగూడ ఆమె ముఖమున సంతరించినాడు, అతడు వాణీపతిగనుక సీతాదేవి కంఠమున వాణిని నిలిపి ఆవాణిచేతిలో వీణను నిలిపినాడు. ఆమె కంఠములో సరస్వతి యున్నదని, ఆమె పలికిన వీణను మీటినట్లుండు నని భావము. అతడు హంసవాహనుడు గనుక సీతను హంసగమనగా జేసి హంసనడకలోని యొయ్యారమునుగూడ పొందుపరిచినాడు. కాని సీతాదేవి యొక్క అత్యంతమనోహరములైన కుచములను కచములను నితంబమును నఖములను ఊరువులను సృజించుటకు ఆయనకడ తత్తదుపాదాన కారణభూతములయిన పదార్థములు లేవు కదా! మరి యాతడు వాని నంత మనోజ్ఞముగా నెట్లు రూపొందించెనో గదా! ఇది ఆశ్చర్యకరము. అని హృదయంగమమైన భావమును కవి సరికొత్త తీరున ఈ పద్యమున పొందుపరిచినాడు.

ఈ కవి వనమందు విహరించుచున్న సీతారాముల శృంగారవిలాస క్రీడలను వర్ణించు సందర్భమందలి యీపద్యమునందుగల గడుసుపోకడను గమనింపుడు.

సీ॥ భామ పూగుత్తులఁ బట్టి కోయంగఁ దాఁ
  గుచములు వట్టు పూగుత్తు లనుచుఁ
చెలువ పూఁగొమ్మపైఁ దేంట్ల నొడియఁగఁ దా
  నలకజాలము తేఁటు లనుచు నొడియుఁ
గొమ్మ పూఁదేనియఁ గ్రోలంగఁ దాఁ బువ్వుఁ
  దేనియ యని మోవితేనె గ్రోలు
నతివ పూఁదావికి నలరుచునుండఁ దా
  నతివ మైతావికి నలరుచుండు

గీ॥ భ్రాంతినో ప్రేమనో రామభద్రనృపతి
కాంచు విభ్రాంతిఁ బ్రేమచేఁ గాని తత్ప
దార్థము లోలి నా సీత యవయవముల
నవ్విభుండును సర్వజ్ఞుఁ డరసిచూడ. (3-84)

వసంతోదయమున వనమునందు సీతకు ప్రియమైన పదార్థములు సీతయందు రామునకు ప్రియములైన పదార్థములు వనమునందు సీతకు లభించు పదార్థములు. కవితా ప్రపంచమున ఉపమానములు. సీతయందు శ్రీరామునకు లభించినవి ఉపమేయములు. శ్రీరాముడు రెంటియందలి తారతమ్యమును చక్కగా అరసి చూడ గలవాడు. కనుకనే అతడు సర్వజ్ఞుడు. సీతాదేవి కుచములతో పూగుత్తులును, ఆమె అలకజాలముతో తేటులును, ఆమె మోవితేనెతో పూదేనియయును, ఆమె మేనితావితో పూదావియు సాటిరావని తెలిసినవాడు. అందుచేతనే శ్రీరాముడు ఆ ఉపమాన వస్తువులకై ఉవ్విళ్ళూరక సీతయందుగల ఉపమేయ వస్తువులందే ఎక్కువ మక్కువను జూపినాడు. ఉపమానోపమేయ గతమైన సాదృశ్యముచే రామునకు భ్రాంతి కల్గినదా! లేక సీతయందలి ప్రేమాతిశయముచే అట్లాచరించెనా! ఏమో!

కందమును అందముగా నడిపించుటలో ఈ కవికిగల నైపుణ్యము అనల్పము. ఈ కృతియందు తక్కిన పద్యములకంటె కంద పద్యముల సంఖ్యయే యెక్కువ.

బోయత తన విటుడగు బ్రాహ్మణునితో 'మనము బోయ పల్లెలో నుండుట హానికరము. ఎచ్చటికైనను త్వరగా పోవుదము' అని తొందరపెట్టు సందర్భములోనిది ఈ పద్యము.

కం॥ వచ్చెను వేకువ విప్రుని
  మచ్చికతోఁ గౌఁగిలించి మాట నిజముగా

వచ్చితిఁ జూడుము పద మిఁక
నిచ్చట మన ముండవలవ దెచ్చటికైనన్. [2-128]

అని ఆమె ఆతనిని తరుముచున్నట్లే పద్యముకూడ వడివడిగా తరుముచున్నట్లు నడచినది.

కినుకను నటించుచు బోయత బ్రాహ్మణుని దెప్పిపొడుచు సందర్భమునందలి యీ పద్యములు గనుడు.

"క॥ నీవంకఁ దప్పు గలదే
నావంకనె కాక నిన్ను నమ్మి చెడితి నీ
భావం బెఱుఁగక వచ్చితిఁ
గావరమునఁజెఱచుకొంటిఁ గాపురమెల్లన్. [2-137]

క॥ కలిమియు బలిమియుఁ బ్రీతియుఁ
గలపెనిమిటి సిగ్గుపుచ్చి కనువేదురునన్
వలచి నిను గూడి వచ్చితి
నిలు వెలువడి తోడివార లెల్లను నవ్వన్". [2-138]

కమ్మని తెలుగు నుడికారపు సొంపులు లాలింపులు పై పద్యములందు కమ్మని తాలింపులవలె గుబాళించుచున్నవి.

తేటమాటలతో గూడి ఆటవెలదివలె హొయలుపరపించు ఈ ఆటవెలదిని జూడుడు.

ఆ॥వె॥ "తీర్థ మేల నాకు తిథియేల నిను బాసి
యెట్లు పోవువాఁడ నిందువదన
పాసిపొమ్మటంటి ప్రాణంబులే పాసి
పోవుఁగాక బొంది పోవఁ గలదె." [2—99]

ఈకవి కవితావిలాస మెట్టిదో ఒకింత తెలిసికొనుటకు మచ్చుగా నిచ్చిన ఈ పరిచయ వాక్యములు చాలును. పూర్తిగా కవితాస్రవంతిలో నోలలాడవలెనన్న కావ్య మున్నది.

## పరిష్కరణ విధానము

ఈ తారకబ్రహ్మరాజీయము యొక్క వ్రాతప్రతులను పరిశీలించి, ఆవశ్యకములైన తావులందు సాధు పాఠములను గుర్తించుటలోను లుప్త భాగములను పూరించుటలోను నేను పడిన శ్రమను క్లేశమును ఇచట ఒకింత వివరించుట అసమంజసము కాదని యను కొందును.

రెండు వ్రాత పతులలోను అనగా ప్రథమ పరిశీలనమున ఆధారమైన ప్రొ. రాయప్రోలు సుబ్రహ్మణ్యముగా రిచ్చిన వ్రాతప్రతిలోను. పునః పరిశీలనలో ఉపయోగపడిన

డా. వి. వి. యల్. నరసింహారావు గారు పంపిన వ్రాతప్రతిలోను పాఠము ఏక విధముగా నున్నప్పటికిని అచట అన్వయము కుదరదు అని తోచినప్పుడు ఒకు మార్పుచేసి సాధు పాఠమును నిర్ణయించుకొంటిని. ఉదాహరణము.

(1) "అభినవ పద్మ హాటకమయామృత పూర్ణ గదాగ్రహస్తయై. (1 ఆ. 3 పద్యము)

ఇది లక్ష్మీ స్తుతి. రెండు ప్రతులందును పాఠము ఏక విధముగానే యున్నది, ఈ సమాసము లక్ష్మీ దేవికి విశేషణము. ఇందు "గదా" అను అక్షరములు ప్రామాదికములు. అభినవమైన పద్మమును సువర్ణ మయమైన అమృత పూర్ణమైన గదను హస్తాగ్రములందు దాలి నది అని అర్థము వచ్చును. లక్ష్మీ దేవి గదను ధరించిన ట్లెచ్చటను కానము. మరియు గద అమృతపూర్ణ మెట్లగును ? ఇది కుదురదు. అందువలన "గదా" అను దానిని తొలగించి "ఘటా" అని సరిదిద్దితిని. అభినవమైన పద్మమును అమృతపూర్ణమైన ఘటమును అనగా కలశమును అగ్రహస్తములందు దాల్చినది అని అన్వయము కుదిరినది.

(2) మరియొకటి. శ్రీరామాయణమును శ్రీ
భారతమును శత భాస్వన్వయ వి
స్తారకరంబులు చేసిన
సూరులు వాల్మీకి పులినముల శేవింతున్. (1 ఆ. 8ప)
(ప్రథమ ప్రతిలోనిది.)

శ్రీరామాయణమును శ్రీ
భారతమును భాను శీతభాన్వన్వయ వి
స్తారకరంబుగఁ జేసిన
సూరుల వాల్మీకి పులినజుల సేవింతున్.

ద్వితీయ పాదమున భాను అను పదము లుప్తపూరణము. శతభాన్వన్వయ శీతభాన్వన్వయ అని, నాల్గవపాదమందు పులినముల అను దానిని పులినజుల అని సరిదిద్దితిని. రామాయణ మును భారతమును సూర్య చంద్ర వంశ విస్తారకరముగా రచించిన విద్వాంసులగు వ్యాస భట్టారకుని వాల్మీకిమహర్షిని సేవించెద నని భావము.

ఈ విధముగా పరిష్కరించిన పిదప పునః పరిశీలనలో రెండవ ప్రతిలోని పాఠముతో సరిచూచినప్పుడు ఈ పద్యము నేను సరిదిద్దినట్లే యున్నది. కాని "సీత భాస్వన్వయి విస్తారకరంబులు" అని యుండి పరిష్కరణము నపేక్షించుచున్నది.

మరి యొక ఉదాహరణము.

(3) కం॥ చిరాయుల కృప గ్రంథ
పాఠము వ్రాయుచును గీర్తి సంపాదించన్

ధీరగుణాఢ్యుఁడు కందా
సారవుఁ వన్ జెరుచు తిమ్మసచివుఁడు శిరులన్ (1 ఆ. 16 ప)

అని ప్రథమలిఖిత ప్రతిలోని పద్యము.

ఈ పద్యము తాళ పత్ర ప్రతిలో లేదు.

"చిరాయల" అను చోట ఛందోదోషము — మరియు అపశబ్దము. "గ్రంథా సారము'' అను పదము అనన్వితము. 'చెరుచు' అను పదము విపరీతార్థ బోధకము.

ఈ పద్యము నిట్లు సరి దిద్ది వ్రాసితిని.

ఆ రాయల కృపఁ గందా
సారను వ్రాయుచును గీర్తి సంపాదింపన్
ధీరగుణాఢ్యుఁడు కందా
సారమునం బెనుచుఁ దిమ్మసచివుఁడు సిరులన్.

పునః పరిశీలన సమయమున రెండవ వ్రాత ప్రతిలో పరిపోల్చి చూచితిని. అందును ''గ్రంథా సారము" అని ''జెరుచు'' అని యున్నదఁ. ''చిరాయల'' అను దోషము మాత్రము లేదు. తక్కిన దోషములు ఉభయత్ర సమానములే.

కృష్ణరాయలకొలువులో కందాచారమును (సైనిక సంబంధమైన ఆదాయవ్యయముల లెక్కలను) వ్రాయుచుండు ప్రధానాధికారియైన తిమ్మమంత్రి తన నైపుణ్యముచే కందా సారమునందు సిరులను అంత కంతకు పెంచుచుండును అని భావము.

4) మరియొక ఉదాహరణము

కు రాధాధ యో పయోధర
కాశ్మీర వర శుభోదయ కవితా
మాధుర్య ధుర్యునకు నన్నుం
రాధామాధవు సుకవిరత్నము బలికెన్. (1ఆ. 23ప)

తాళపత్ర గ్రంథమునం దీ పద్యము గల భాగము క్రిమి దష్టము. ఇందు ఛందో దోష ములు అక్షర దోషములు కలిసి సహవాసము చేయుచున్నవి. అన్వయ మెట్లు?

ఎంతో ఆలోచించి ఆలోచించి ఈ పద్యమును ఇట్లు మార్చి వ్రాసితిని.

క॥ రాధారుణాధరోరు ప
యోధర కాశ్మీర రసశుభోదయ కవితా
మాధుర్య ధుర్య నన్నున్
రాధామాధవుని సుకవిరత్నముఁ బలికెన్.

ఈ పద్యము రెండవ వ్రాత ప్రతిలో నిట్లున్నది. పునః పరిశీలనమున దీనిని చూచితిని.

రాధా ధరోరు యోధర
కాశ్మీర పరశుసోదయ కవితా మాధు
ర్యధుర్య సమ్మం రాధా
మాధవు సుకవి రత్నము బలికెన్॥

ఈ రెండవ ప్రతిలోని పద్యము కూడ దోష జుష్టమై పరిష్క రింప దగియున్నది.

మరియొక పద్యము

చ॥ సకల భయంబు పుట్టు మది జానకి యెటుల్ చంచరీకక
టక మత మదిన్ జూచి నిబిడస్థితి నేనును రామమూర్తినై
యకటి చరింతునోయని త్వదాకృతి రాముఁడు దాల్చు నిన్ను బా
యక పెరవేల నిత్యమిధునానుభవం బొడఁగూడు నెప్పుడున్. (1-29)

ఈ పద్యమునకు అన్వయము కుదురదు. ప్రథమద్వితీయ పాదములందు ఛందో దోషములు, అపశబ్దములు.

ఈ పద్యమును సరిదిద్దుటకు చాల శ్రమ పడితిని. తుదకిట్లు సవరించి వ్రాసితిని.

ఇది సీతాదేవికిని ఆమె చెలికిని జరిగిన సంవాద రూపమైన పద్యము.

చ॥ "సకియ! భయంబు పుట్టుమది" "జానకి! యేటికె?" "చంచరీక కీ
టక మత రీతిఁ జూచి నిబిడస్థితి నేనును రామమూర్తినై
యకట చరింతునోయని" "త్వదాకృతి రాముఁడు దాల్చు నిన్ను బా
యక వెఱపేల నిత్యమిథునానుభవం బొడఁగూడు నెప్పుడున్"

సీత తన చెలితో నిట్లనుచున్నది సఖీ! నా మనస్సునందు భయము కల్గుచున్నది. సఖి:- జానకీ! భయమెందుకు? జానకి:— "నేను నిరంతరము శ్రీరామచంద్రునే చూచుచు తలంచుచు భ్రమర కీట న్యాయమున తుదకు శ్రీరాముని యాకృతినే ధరింతునేమో! నేనును పురుషాకృతినే దాల్చినచో శ్రీరామునితోడ దాంపత్య సుఖమెట్లబ్బును? సఖి:— అమ్మా! శ్రీరామచంద్రుఁడును నీ వలెనే నిరంతరము నిన్ను గాంచుచు స్మరించుచు నీ రూపమునే పొందును. నీవు శ్రీరాముడ వగుదువు. రాముడు సీత యగును. మీ యిర్వురకును ఎప్పటివలెనే దాంపత్య సౌఖ్యము లభించును. అను పద్య భావము.

ఇంత మధురమైన కల్పన అపశబ్దముల తెర మఱుగున పడి యున్నది.

పునః పరిశీలనమున రెండవ వ్రాత ప్రతిలో జూడగా అందు రెండు పదములందు తప్ప తక్కిన పద్యమంతయు నేను సరిదిద్దినట్లుగానే యున్నది. ప్రథమ పాదమున "సకల

భయంబు'' అనియు తృతీయ పాదమున ''యకరి చరింతునోయని'' యున్నది. ఈ రెండు దోషములు తప్ప తక్కిన భాగము సరిగానే యున్నది.

కృత్యాద్యవస్థ యనుచుందురు. నేను పొందిన క్లేశము ఆదిమధ్యాంతములందు సర్వత్ర సమానముగానే యున్నది.

ఈ పద్యమును గనుగొనుడు.

(6) శా॥ ఆనందాశ్రును గజ్జ కంటకిత దేహత్వంబు దేవాని
జానిహ్మ దచరేంద్ర ము ఖ్యులను హర్ష స్వాంతుంజాయనా
ర్యానాథుండు ఏశాచ్ఛడ్ తాండవవిపులుండై గద్గద
ధ్వా...ం బొప్ప నుతింపగా.... గెనాధాత్రీశు శ్రీరాముని న్.

(5—18)

ఈ పద్యము ఐదవ ఆశ్వాసములోనిది. ఐదవ ఆశ్వాసము రెండవ వ్రాత ప్రతిలో లేదు.

ఈ పద్యము యొక్క నిజ స్వరూప మెట్లుండునా యని తలబ్రద్దలు కొట్టుకొని తుద కెట్లో యీ విధముగా సరిదిద్ది వ్రాసితిని.

శా॥ ఆనందాశ్రులు గారఁ గంటకిత దేహం బొప్పఁగా భారతీ
జానీంద్రాది సురప్రముఖ్యులను హర్షస్వాంతులం జేయ నా
ర్యానాథుండు ప్రశస్త తాండవ చణుండై కుత్తుకన్ గద్గద
ధ్వానం బొప్ప నుతింపఁగాఁ దొడఁగె నాధాత్రీశు శ్రీరాముని న్.

ఈ పద్యమును జూడుడు.

(7) సీ॥ జల మహేల్ల... కాసారముల్ .. కాసరము.... లచెఱ
మజాజి కోటర నాకు మధు విక్షువుల ఖష
పత్రకరంబుల బడలు నరచి
కమనీయ గిరి.... గభ.... మున్.... నెక్కొన్న
... ంబు.... గర్వమణచి

గీ॥ శాఖలు విరిచి....
కనుల వారించి వనము నిష్కంటకంబు
చేసి లక్ష్మణుఁ దధిపతి సీతతోడ
వలసినట్టులు క్రీడింప వలయు ననుచు. (8—80)

ఈ పద్య పూరణము దత్తపది వలె నుండును. (3 ఆ. 80ప) ప్రథమ పరిశీలనము నందు రెండవ వ్రాత ప్రతి సాహాయ్యము లేనందున నే నీ పద్యమునొక విధముగా పూరించితిని.

సీ॥ జలమహోల్లసిత కాసారముల్ కలచెడి
కాసరంబులను చీకాకు పరచి
వృక్షకోటరమధు భక్షకంబగు ఋక్ష
వ్రప్రకరంబుల బదలు పరచి
కమనీయ గిరిదరీ గర్భముల్ నెక్కొన్న
ఘాతుక మృగముల గర్వ మణచి

(మూడవ పాదమును పూరించుటకు ఆధారము లేనందున విడిచి పెట్టితిని)

తెరువుపడ్డిన శాఖల విరిచి తిరుగు
కపుల వారించి వనము నిష్కంటకముగ — అని పూరించితిని.

పునః పరిశీలనమున ఈ పద్యము రెండవ వ్రాత ప్రతిలో చక్కగా నున్నట్లు కనుగొంటిని. అది నా పూరణమునకు దగ్గరగా నున్నది.

సీ॥ జలరుహోల్లసిత కాసారముల్ గలచు కా
సరనమూహముల నోసరిలఁజేసి

మహితకోటర నాకు మధువిముఖుల రూక్ష వ్రాతకరంబుల బదలుపరచి సమధిక పుష్పకుంజ క్రాదములనుండు పుండరీకంబులు పొంకమణచి కమనియ్య గిరిదరి గర్భముల్ జేకొన్న కంఠీరవంబుల గర్వమణచి

గీ॥ వివిధఫల వృక్ష శాఖలు విరిచి తిరుగు
...రుల వారించి వనుల నిష్కంటకంబు
చేసె లక్ష్మణుఁ డధిపతి సీతతోడ
వలసినట్లుగఁ గ్రీడింప వలయుననుచు.

పునః పరిశీలనమునందు ఇందలి దోషములను సవరించి యీ పద్యమునే నా పరిష్కృత ప్రతిలో చేర్చితిని.

ద్వితీయ పాదమును 'మహిత కోటర నాకు మధు భక్షకంబగు
ఋక్షవ్రప్రకరంబు బడలుపఱిచి' అని దిద్దితిని. తృతీయ పాదమందలి క్రాద బదులు క్రోడ అని. గీతపద్యము రెండవ పాదమున ...'రుల' ముందు 'క' చేర్చి కరుల అని మాత్రము సవరించితిని. 'కమనియ్య' అను పదమును కమనీయ అని సవరించితిని. ఇట్టి

సరిదిద్ది యీ పద్యమునే స్వీకరించితిని. ప్రథమముననే యీ రెండవ ప్రతికూడ నాచెంత నుండి యుండునేని నాక్లేశము కొంత తగ్గియుండెడిది గదా యని యనుకొంటిని.

మూడవ ఆశ్వాసమునందలి ఎనుబది మూడవదగు సీసపద్యము వసంత వర్ణన సందర్భమందలిది. ఈ పద్యము ప్రథమ ప్రతియందు దాదాపు లుప్త ప్రాయమై యున్నది.

(8) సీ॥ లజ్జాపురాణ...స్ఫూర్తి...దిను...రెనధ...అనరాగ....
మం....మంజ్జునున్.

అని యీ తీరున నున్నది.

ద్వితీయ ప్రతియందు ఈ పద్యము ప్రథమ పాదము

'లజ్జా పూరణ దళ స్ఫూర్తిగా జారె
నధర పల్లవరాగ మతిశయిల్లె' అని యున్నది. దీనిని 'లజ్జ పురాణ దళస్ఫూర్తిగా జారె' అని సరిదిద్దితిని. ఆటవెలది పద్యములోని మొదటి రెండు పాదములు ప్రథమ ప్రతియందు లేవు. ద్వితీయ ప్రతియందు దోషజుష్టములై యీ దీరున నున్నవి.

ఆ॥వె॥ అవనిజాని వనరుహాళి లీల
రామ వైభవంబు లోక వర్ణితముగ
శుకరదాస్య సుభట కోలాహల
మదన సహిత మధు సమాగమమున (3. ఆ. 83 ప)

మొదటి మూడుపాదములు ఛందో దోషజుష్టములు. అర్థము బోధపడదు. దీని నిట్లు సరిదిద్ది వ్రాయుట జరిగినది.

అవనిజావనీరుహాళి లీలారామ
వైభవంబు లోక వర్ణితముగ
శుక పికాద్యనేక సుభట కోలాహల
మదన సహిత మధు సమాగమమున.

అవనిజ యొక్కయు అవనీరుహ శితో గూడిన లీలా + ఆరామము యొక్కయు వైభవము లోక వర్ణితమైనదని అన్వయము.

ఇట్లు ఉదాహరించుచు పోయినచో దాదాపు గ్రంథమంతయు ఉదాహరింపవలసి యుండును. ఒక్కొక్క పద్యము ఒక్కొక్క సమస్యా పూరణమై దత్తపదియై గంటల కొలది కాలమును కబళించినది. నే నేదో గొప్పగా సాధించితి నని తలంచుటలేదు. పడిన క్లేశమును మాత్రమే సహృదయులకు విన్నవించు చున్నాను.

నా ఊహకందనివి — నేను గుర్తింపనివి — నేను సరిగా ఊహింపలేక తప్పుగా ఊహించినవి కొన్ని ఉండియుండవచ్చును.

## నివేదనము

మఱొక్కమాట!

దాదాపు ఒక సంవత్సరము క్రిందట డాక్టర్ వి.వి.యల్. నరసింహారావుగారు నేను పరిష్కరించి యిచ్చిన తారకబ్రహ్మరాజీయము యొక్క వ్రాతప్రతిని దానితోపాటు తమ గ్రంథాలయమునందున్న ఆర్. నెం. తెలుగు. ఆర్. 1691 బి, 888 గల తారకబ్రహ్మ రాజీయము యొక్క వ్రాతప్రతి నొక దానిని నాకు పోస్టులో పంపుచు ఒకలేఖనుకూడ వ్రాసిరి.

"మీరు పరిష్కరించి వ్రాసి యిచ్చిన తారకబ్రహ్మరాజీయమును ముద్రణకు వీలగువట్లు విడివిడి కాగితముల మీద వ్రాసి, మీరు పరిష్కరించిన తావులందు మూలగ్రంథ మందలి పాఠములను మీరు పరిష్కరించిన పాఠములను అథస్సూచికలో తెలుపుచు మరియు ఆశ్వాసానుగుణముగా ఇందుగల గద్యపద్యముల వివరమును వాని సంఖ్యను దెలుపు పట్టికను అకారాది క్రమమున గద్యపద్యాన క్రమణికన గూడ చేర్చి పంపుడు. మీ శ్రమకు తగినంత యీయలేక పోయినను ఏదో కొంత పారితోషికము కూడ ఈయబడు"నని ఆలేఖలో వ్రాసిరి.

పారితోషికము మాట యెట్లున్నను శ్రీ నరసింహారావుగారు నాకు ఒకనాడు సహోపాధ్యాయులును అత్యంతము సన్నిహితులును అయిన కారణమున మరల ఈ గ్రంథమును రెండవమారు పరిశీలించుటకు పూనుకొంటిని.

డా. నరసింహారావుగారు పంపిన వ్రాతప్రతిని రెండవ వ్రాత ప్రతియని సౌలభ్యమునకై పేర్కొందును. దీనియందు చతుర్థాశ్వాసమునందు 35 నుండి 42 వరకుగల గద్యపద్యములును 87 నుండి 130 వరకుగల గద్య పద్యములును లేవు. ఐదవ ఆశ్వాసము పూర్తిగాలేదు.

ఈ వ్రాతప్రతికి మూలమైన తాళపత్రప్రతిని శ్రీ పట్నాల అప్పన్న అనువారు ఆత్మార్థము ఈ గ్రంథమును వ్రాసికొనెనట్లును అంగీరస జ్యేష్ఠశుద్ధ ఏకాదశి సోమవారము నాడు ముగించినట్లును కలదు. శ్రీరాయప్రోలువారి దగ్గర గల వ్రాతప్రతికి గూడ పట్నాల అప్పన్నగారి తాళపత్ర ప్రతియే మూలమని భావింపనగును.

డా నరసింహారావుగారు పంపిన వ్రాతప్రతి [రెండవది] ప్రథమ పరిశీలన సమయము ననే లభించియుండినయెడల అప్పుడు నేను పడిన శ్రమలో అరవ వంతు తగ్గియుండెడిదని అనిపించినది. మొదటి ప్రతికంటె ఈ రెండవ వ్రాతప్రతి కొంతలోకొంత మెఱుగు

గానే యున్నది. మొదటి ప్రతిలో లేనివి ఈ రెండవప్రతిలో కొన్నికొన్ని కనిపించినవి. మొదటి ప్రతిలో లేనందున నేను పూరించిన కొన్ని తావులు ఈ రెండవప్రతిలో యథాతథము గాను కొన్ని తావులందు అత్యంత సన్నిహితముగాను కనబడినవి. అట్లని ఈ రెండవ ప్రతిని నిర్దుష్టముగా నున్నదని భావింప వలను పడదు. లేఖక ప్రామాదికములైన దోషములు గానీ లుప్తభాగములుగానీ ఛందోవ్యాకరణ దోషములుగానీ మెండుగానే యున్నవి. ఈ విషయమును కొంత స్థలాంతరమున ప్రత్యేకముగా వివరించితిని.

మొదట నేను పరిష్కరించిన వ్రాతప్రతిని మరల ఈ రెండవ వ్రాతప్రతితో సరి చూచి ఆవశ్యకములయిన చోట్ల కొద్దిపాటి మార్పులు చేర్పులు చేసితిని. ఊహించి లుప్త భాగములను పూరించిన తావులందు వీలయినంతవరకు మూలగ్రంథముతో సరిపోవునట్లు పూర్వాపరములను కలయజూచి సమన్వయించుకొని పూరించితిని. కవి ఆశించిన భావమును సరిగా తీసికొనిరాఁ లెనని ప్రయత్నించితిని. ఈ ప్రయత్నమునందు నే నెంతవరకు కృతకృత్యుడనైతినో నే నెఱుగను, అది విద్వజ్జనైకవేద్యము,

ఛందస్సూచికయందు ఏయే ఆశ్వాసమునందు ఏయే పద్యములు వచనములు ఎన్నెన్ని కలవో తెలుపు పట్టికను వ్రాసితిని. అకారాది క్రమమున ఇందలి గద్య పద్యముల అను క్రమణికను చేర్చితిని,

నాకు లభించిన ఈ సాధన సంపత్తితో నా ఊహ కందినంతవరకు నా చేతయినంత వరకు శ్రమించి పరిశోధించి పరిష్కరించి శుద్ధప్రతిని వ్రాసితిని. లుప్తభాగములను చుక్కలుపెట్టి వదలిపెట్టుటవలన పద్యభావము దుర్బోధముగా నుండునని ఆ లుప్తభాగములను పూరించి అధస్సూచికలో ఆ వివరమును దెల్పితిని, పరిష్కరణము నపేక్షించు వ్రాతప్రతిలో నున్న పాఠమును దానిని పరిష్కరించిన పాఠమును అధస్సూచికయందు తెల్పితిని,

వ్రాతప్రతి పాఠమును దెల్పుటకు (వ్రా.) అని పరిష్కృత పాఠమును దెల్పుటకు (ప) అని సంకేతాక్షరములను వ్రాసితిని. ఆవశ్యకములనుకొన్న చోట్ల వివరముగానే వ్రాసితిని.

ఈ గ్రంథమును సంపూర్ణముగా నిర్దుష్టముగా పరిష్కరించితినని చెప్పజాలను. నా కంతటి అర్హతయును లేదు. నాకు తెలియనివి, నా ఊహకు అందనివి, నా దృష్టికి రానివి ఉండియుండవచ్చును. నాకు అప్పగించిన పనిని చిత్తశుద్ధితో యథాశక్తి చేసితినని మాత్రమే విద్వజ్జనులకు విన్నవించుచున్నాను.

ప్రప్రథమముగా నన్ను ఈ గ్రంథ పరిష్కరణకు ప్రబోధించిన

ఆచార్య డాక్టర్ రాయప్రోలు సుబ్రహ్మణ్యముగారికి

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ పురావస్తు ప్రదర్శనశాలల శాఖ డైరెక్టర్‌గారైన

డా॥ వి.వి. కృష్ణశాస్త్రి గారికి,

ఈ తారకబ్రహ్మరాజీయ గ్రంథ పరిష్కరణముద్రణ కార్యక్రమములకు సారథ్యము వహించిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయ — పరిశోధనాలయము

డైరెక్టరుగారైన డా॥ వి వి.యల్. నరసింహారావుగారికి

నేను వందన శతములను సమర్పించుచున్నాను.

''ఆ పరితోషా ద్విదుషాం న సాధుమన్యే ప్రయోగవిజ్ఞానమ్''

ఇట్లు

బుధజన విధేయుడు

(సం) అక్కిరాజు వేంకటేశ్వరశర్మ

గుంటూరు

12—6—1984



'తారకబ్రహ్మరాజీయము' కాకినాడ తాళపత్రప్రతిలోని మొదటిపుట నకలు; ముద్రిత ప్రతి పుట — 1



కాకినాడ తాళపత్రప్రతిలోని చివరిపుట నకలు: ముద్రితప్రతి పుటలు — 94, 95

# తారకబ్రహ్మరాజీయము

## చింతలపూడి యెల్లనార్య ప్రణీతము

## ప్రథమాశ్వాసము

శా॥ శ్రీరాజీవదళాక్షి కౌస్తుభమణీ సింహాసనం బెక్కి య
ర్కారూఢ స్ఫుట దీప్తియుం [1]బలెన సొంపార న్నభోమండ లా
కారశ్రీ విలసిల్లు విష్ణుఁడు జగత్కల్యాణ చారిత్ర గం
భీరు న్నంజయ తిమ్మమంత్రివరు [2]లక్ష్మీయుక్తునిం జేయుతన్. 1

ఉ॥ శ్రీత్రిదశద్రుమూలమునఁ జెన్నెసలారు పసిండి గద్దియన్
ధాత్రిజ నంకపాళి నిడి తమ్ములలో భరతుండు మౌక్తిక
చ్ఛత్రము దాల్పఁ జాపశర చామరముల్ ధరియించి భక్తి సౌ
మిత్రులు గొల్వ నుండు జనమిత్రుని శ్రీరఘురాముఁ గొల్చెదన్. 2

చం॥ అభినవ పద్మహాటకమయామృతపూర్ణ ఘటాగ్రహస్తయై
యభయ వరప్రదాన సుముఖాయత దోర్లతయై కృపాళువై
యభిమత పద్మ లాభము చిరాయువు నిర్భయమున్ వరంబుతన్
శుభముఖి లక్ష్మి యిచ్చు గుణశోభికి నంజయ తిమ్మమంత్రికిన్. 3

సీ॥ శృంగార రసముతోఁ జెలిమిచేసెనొ శాంత
    రస మన నగజతో నెనఁగువాఁడు
పవడంపు జొంపంబు [3]ప్రభవించెనో రజ
    తాద్రి నా [4]జడముడి నదరువాఁడు

---

1 వ పద్యము. 1. 'బలెనె పెంపార న్నభోమండలాధార శ్రీ' యని కాకినాడ ప్రతి.
2. 'లక్ష్మీవంతునిం'—కాకినాడ ప్రతి.

4 ,, 3. 'ప్రభవించునో'—కాకినాడ ప్రతి
4. జడముడి నలరువాఁడు—మద్రాసు ప్రతి.

యజ్ఞంబు త్రేతా సమగ్రమై యున్నదో
యనఁ ద్రిశూలంబుతో నమరువాఁడు
మేనెత్తెనో జగం [1]బేను భూతములతో
నన నేను మోముల నలరువాఁడు

గీ॥ జేసికను సానకంటిపైఁ దీసి వలపు
గంధ మలఁదిన [2]కందువ కలికి వేల్పు
పాద కటక ధ్వనుల మించు భాష లొసఁగెఁ
నెమ్మిఁ [3]బ్రోచుత నంజయతిమ్మవిభుని. 4

చం॥ కెలఁకున రామరామ యని కీరము పల్కఁగ [4]పీఁజెతోఁడుతన్
బలుకుఁబోలంతి తన్నెలమిఁ బాడఁగ బ్రహ్మ విబోధ కామ చే
ష్టలఁ బులకించు బ్రహ్మ సుఖసంపద లీవుత నిత్యకీర్తి వ
ర్తిలు గుణశాలి నంజవిభు తిమ్మన మంత్రికి సత్కృపామతిన్. 5

శా॥ సర్వజ్ఞాత్మజుఁ డౌట నిచ్చుఁ గరుణన్ సర్వజ్ఞతాశక్తి యం
తర్వాణీశ్వరుఁ డౌట నిచ్చుఁ దగ నంతర్వాణితాశక్తియున్
శర్వాణీ సుతు విఘ్నహర్తఁ గొలుతున్ సత్యాభిధానోన్నతున్
నిర్విఘ్నం బొనరింప నాత్మకవితా నిర్వాణ సంసిద్ధికిన్. 6

కం॥ తలఁపును బలుకును దానై
తలఁపును బలుకును నిజాశ్రితశ్రేణికి ని
చ్చలు నిచ్చు మచ్చెకంటిం
గలకంఠిఁ దలంతుఁ గావ్యకలనా శ్రీకిన్. 7

కం॥ శ్రీరామాయణమును శ్రీ
భారతమును భానుశీతభాన్వన్వయ వి
స్తార కరంబులు చేసిన
సూరుల వల్మీక పులినజుల సేవింతున్. 8

---

4 వ ప: 1. బేనురూపములతో—పాఠాంతరము.
2. దిండెన—కాకినాడ ప్రతి, కలదిన—మద్రాసు ప్రతి, కందువ—పరిష్కృత పాఠము
3. బ్రోవుత—కాకినాడ ప్రతి, బ్రోచుత—మద్రాసు ప్రతి.
5 వ ప: 4. పీఁజె తోపలన్ (వ్రా). పీఁజె తోడుతన్ పరిష్కృత పాఠము.

సీ॥ కాళికా వదన తాంబూల రసాస్వాద
కలిత[1] కావ్య విలాసుఁ గాళిదాసు
భవభూతి శితముఖ పార్వతీ కుచలబ్ధ
భవభూతి నాము వాగ్భవ్యధాముఁ
[2]గాయజోద్దీపన గ (ద్య) హాసోక్తి కా
ప్రముదితాత్మ స్థాణు భట్టబాణు
శత పద్య పూర్ణతా కృత సహాయత్వార్క
ధామ దీప్త శరీరు శ్యామయూరు

గీ॥ వెండియును దేవతాశక్తి వెలయు మాఘు
[2]హర్ష భారవి దండి మల్హణ మురారి
రాజశేఖర [3]కామ చోర ప్రముఖుల
సంస్కృతపు సత్కవులఁ గొల్తు సంతసమున. 9

ఉ॥ భారత కావ్యహార మొక భాగము నన్నయభట్టు గూర్చె ము
క్త్రా రమణీయ వాక్యములఁ దక్కిన భాగము సోమయాజి సొం
పార నొనర్చె రెంటిఁ గలయన్ శివదాసుఁడు మధ్యనాయక
శ్రీ రచియించె శారద ధరింపఁ [4]గవిత్రియ కీర్తి మించఁగన్. 10

కం॥ బక హంస విభేదము పా
లకఁడం దెలితేట యైన లాగున శబ్ద
ప్రకరార్థ దర్శనంబునఁ
గుకవి సుకవి భేద మెఱుఁగుకొనఁ దగు రసికుల్. 11

వ॥ అని అభిమత దేవతా ప్రార్థనంబును మహాకవి ప్రశంసా సమర్థనంబును
గుకవి నిరాకరణంబును నొనర్చి సకల వేదోక్తంబును సకల మంత్ర సారం
బును చతుర్విధ పురుషార్థ ప్రదంబును నగు [5]శ్రీరామతారకబ్రహ్మ
రాజీయంబు పరమ భాగవతోత్తముండు ప్రయాగ క్షేత్రవాసి నారాయణాశ్రమి

---

9వ, పద్యము 1. 'కామ' అని కాకినాడ ప్రతి. 'కావ్య' (ప)
2. ఇది కాకినాడ ప్రతి యందలి పాఠము.
3. 'భామ' అని కాకినాడ ప్రతి.
10వ. పద్యము 4 కవిప్రియ కీర్తి. మద్రాసుప్రతి; కవిత్రియకీర్తి - కాకినాడ ప్రతి.
12వ. పద్యము 5. శ్రీరామ తారక బ్రహ్మరాజంబు - కాకినాడ ప్రతి.

యను మహా యతీశ్వరుండు సంస్కృతంబున రచియించె నది తెనుంగున
సకల జనులకుఁ దెలియు నట్లుగాఁ దమ్మనీశ్వర సంస్మరణ శక్తిని నిర్మించి
బ్రహ్మ వేత్తలకు శ్రవణ యోగ్యంబు గావించుచున్న సమయంబున 12

సీ॥ తన మహాదీప్త ప్రతాప [1]బింబ ప్రతి
బింబంబు భానుమద్బింబ మనఁగఁ
దన [2]బాహు దండంబు ధరణి మండల మెత్తి
పన్నగరాజు విశ్రాంతి గొలుపఁ
దన [2]కరాబ్జము గల్ప తరువుల కళుకుగాఁ
బంచ శాఖాఖ్యమై ఫలము లొసఁగఁ
దన శంఖ చక్రాంకితంబైన రూపంబు
హరి మూర్తి నచ్యుతి నట్లు వెలుఁగఁ

గీ॥ దనరు బ్రహ్మాండ పీఠికాంతర్బహిర్వి
హారి సత్కీర్తి కర్పూర సౌరభమున
మూరు రాయర గండాంక మోహనంకు
రాజ దేవేంద్రుఁ డచ్యుత రాయ విభుఁడు. 13

సీ॥ పద్మాప్త రుచి మించు పద్మరాగపు రహి
గూర్చిన పదక మక్కున వెలుంగఁ
బసిఁడి వ్రాతల పచ్చపట్టువచ్చడ మొస
పరి వన్నెయై కటిఁ బరిఢవిల్ల
బహురత్న దీప్తులు ప్రసరించు మేలు కు
ళ్లా కిరీటము కంటిజోఁక గాఁగఁ
గస్తూరికాతిలకము పుష్పమాల్యంబు
మించ తుమ్మెదల కామెత యొనర్ప

గీ॥ దండ సత్కళ యవనాంధ్ర ధరణి నాథు
లర్థి సేవింప రత్న సింహాసనమునఁ
గొలువు కూర్చుండు కృష్ణుని చెలువు మీఱ
రాజ దేవేంద్రుఁ డచ్యుత రాయ విభుఁడు. 14

---

1శివ, వ. (1), (2, కాకినాద ప్రతియందలి పాఠములు.

ఉ॥ కుంభిని దాల్చి తా నిరవు కొల్పిన యచ్యుతరాయ శాసన
స్తంభము మేరుశైలము ప్రతాప యశోరవి చంద్రమండలీ
సంభృత లక్షణం బనుచు సంతస మారఁగఁ జూచు చంద మా
జంభవిరోధిముఖ్యులు దిశా వలయస్థితు లౌట యేర్పడన్. 15

కం॥ ఆ రాయలకృపఁ గందా
సారము వ్రాయుచును గీర్తి సంపాదించెన్
ధీరగుణాఢ్యుఁడు కందా
సారము నంజరుసు తిమ్మసచివుఁడు సిరులన్. 16

చం॥ [1]తిరువడి గెల్చి పాండ్యనరదేవుని బట్టము గట్టి యుక్కళే
శ్వరుఁ గరుణించి మ్రొక్కిన సవాయికిఁ దా నభయం బొసంగి పెం
పరుదుగఁ గీర్తి చేకొనిన యచ్యుతరాయల మంత్రిరత్నమై
చిరముగ నున్న నంజవిభు తిమ్మరుసుం [2]దగుఁ బ్రస్తుతింపఁగన్ 17

ఉ॥ వేదపురాణశాస్త్రముఖ విద్యల కెల్ల గురుండు బ్రహ్మ వి
ద్యా దృఢ బుద్ధి నేర్పులిపు లన్నియు [3]వ్రాయ సమస్తదేశ భా
షాదు లెఱుంగు స్వామిహితమైన ప్రయోజన మాచరించు నా
నా దిశలం బ్రసిద్ధుఁడగు నంజయతిమ్మనిఁ బోల రెవ్వరున్. 18

వ॥ [4]అమ్మహా మంత్రీశ్వరుం డొక్కనాఁడు చతుస్సముద్ర ముద్రిత మధ్య భూ భువన సింహాసనాధీశ్వరసార్వభౌముండగు నచ్యుతరాయల కొలువు సేసి వచ్చి నిజ నివాస భాసుర చంద్రశాలా ప్రాంగణ మణిమంటపంబున విజయనగర రాజధానిం గల బంధువర్గంబును విద్వత్కవీంద్రులును దిగంతరాయబారులును (?)వంది మాగధ గాయక వారకామినీ నికరంబును, సముచిత ప్రకారంబున సేవింప సుఖగోష్ఠిం బ్రవర్తిం పుచు నిజస్వామియగు నచ్యుతదేవ రాయలు ప్రతిసంవత్సరంబు శ్రీవేంకటేశ్వరునకు సత్కావ్యప్రబంధ వాక్పుష్పాంజలి సమర్పించుచు కీర్తి సుకృతంబులు నిర్వహించు

---

17. వ (1) 'తిరుపతి' తిరువడి' యని పాఠాంతరములు (2) దగయని కాకినాడ పతి
18 ప. (3) 'వ్రాయు' అని మ దాసు పతి
19. వ (4) 'అమ్మహామహీశ్వరుం డొక్కనాఁడు' అని మద్రాసు పతి

కొనుచున్నవాఁడు తదనుమతంబున నవ్విభునకును నాకును నభ్యుదయపరం పరాభివృద్ధియుఁ జతుర్విధ పురుషార్థ సిద్ధియుఁ గలుగునట్లుగా నా యిష్టదైవంబగు శ్రీరామవిభునకు నంకితంబుగా నొక్కపుణ్య ప్రబంధంబు చెప్పింపవలయునని సుహృజ్జనంబులతో నూహించి 19

గీ॥ యతివరేణ్యులు నారాయణాశ్రములు మ
హానుభావులు నొడివిరి యోగమాంత
పరిచితంబైన తారకబ్రహ్మరాజ
మఖిల సన్మంత్రసారాంశ మైనదాని. 20

కం॥ ఆ ధీరుని గతిఁ దెనుఁగున
రాధామాధవుఁడు [1]సుకవిరా జిది చెప్పెన్
[2]వేధోముని వరబుధ గం
గాధర జప్యంబు తారక బ్రహ్మంబున్. 21

వ॥ అని సబహుమానంబుగాఁ బిలిపించి 22

కం॥ [3]రాధారుణాధరోరు ప
యోధర కాశ్మీర రస రసోదయ కవితా
మాధుర్య ధుర్యు నన్నున్
రాధామాధవుని సుకవిరత్నముఁ బిలికెన్. 23

గీ॥ పరమహితుఁడవు తారకబ్రహ్మరాజ
మను ప్రబంధంబు నీ చెప్పినది మదాత్మ
నాయకుండగు శ్రీరఘునాయకునకు
నంకితము సేయవలయు నా కభిమతముగ. 24

---

21 వ. పద్యము (1) 'సుకవి....జెప్పెన్' అని మద్రాసు ప్రతి.

21 (2) 'వేదోవ'ముని' – అని మద్రాసుప్రతి

23 వ. ప: (3) 'రాధాధరాధరోరు పయోధర కాశ్మీరరసరసోదయ' – అని కాకినాడ ప్రతి

"రాధారుణాధరోరుపయోధర కాశ్మీర పరరసోదయకవితా" అని మద్రాసుప్రతి.

ఉ. నావుకు నీకు నంకిత మొనర్పఁ దలంచినవాఁడ బంధు సం
భావన నీకు విష్టముగ బ్రహ్మమయుండగు రామభద్ర ధా
త్రీవరమౌళి కంకిత మిదే [1]యొనరించిన మంచి పైడికిం
దావి ఘటిల్లె నేమి యన నంజయతిమ్మ! వివేకభూషణా! 25

కం॥ నాయకుఁ డయ్యెం గృతికిన్
నాయకరత్నం బుదాత్త నాయకుఁడు జగ
న్నాయకుఁడు రామధరణీ
నాయకుఁ డిఁక నేమి చెప్ప నా సుకృతంబుల్. 26

చం॥ స్ఫుటరుచి పద్మరాగమణి భూషణుఁడై కనకాంబరోల్లస
త్కటి యయి సజ్య చాప విశిఖంబులు దోర్యుగళిన్ వెలుంగఁగాఁ
బటుతర పీరరేఖ ముఖపద్మమునం గల రాఘవుండు హృ
త్పుటమునఁ దోఁచె నా కిపుడు భూరికృపామతి నీమతంబునన్. 27

సీ॥ సాకేతపుర మహా సౌధాంగణోల్లసత్
ప్రసవకల్పక పాదపంబు నీడ
మణివేదిపైఁ బుష్పమంటపంబున విభీ
షణ [2]రవిజాద్యద్రిచరులు గొల్వ
ఫాలభాగార్పిత ప్రాంజలులై భర
తాదులు తమ్ము లంతంత నిలువఁ
గంకణ ఝుణఝుణత్కారంబుతో దివ్య
మానినుల్ ధవళచామరము లిడఁగఁ

గీ॥ గనక సింహాసనంబున జనక తనయ
[3]నంక పాళిక నించి కృపార్ద్ర దృష్టిఁ
బ్రేమ నందఱఁ జూచు శ్రీరామ విభుఁడు
మనఁ గృతికి నధీశుఁడై మనుచుఁగాత 28

---

25 ప. (1) యొనరించి పైడికిన్ — అని మద్రాసుప్రతి
28 ప. (2) 'రవిజాద్యద్రిచరులుగొల్వ' అని మద్రాసుప్రతి
(3) 'అంకపాళిక నుంచి' అని మద్రాసుప్రతి.

చ॥ [1]'సకియ భయంబు పుట్టె మది' 'జానకి యేటికె' 'చంచరీక కీ
టక మత మర్థిఁ జూచి నిబిడ స్థితి నేను రామమూర్తినై
యకట చరింతునో యని' 'త్వదాకృతి రాముఁడు దాల్చు నిన్నుఁ బా
యక వెఱ పేల? నిత్య మిథునానుభవం బొడఁగూడు నెప్పుడున్. 29

వ॥ ఇవ్విధంబున సీతావచనంబు కలదు గావున శ్రీరామ మంత్ర స్మరణంబునఁ
జతుర్విధ పురుషార్థంబులు సిద్ధించుట యేమి యాశ్చర్యం బని శ్రీరామ మంత్ర
సిద్ధుండగు నమ్మహా[2] ప్రధాని శేఖరు నభినందించి. 30

సీ॥ కాశ్యపగోత్ర దుగ్ధపయోధి చంద్రుఁడై
భాగ్య లక్షణములఁ బ్రబల మొందె
[3]రాయపీఠ పరంపరా క్రమాగతమైన
నిజమంత్రి కులము వర్ణితముఁ జేసె
సకల దిగ్దేశ రాజప్రధానుల కెల్ల
నాధారమయ్యె సింహాసనమునఁ
దనకు నేలిన మహీధవునకు సత్కీర్తి
దనర సామ్రాజ్య తంత్రంబు నడపె

గీ॥ నుభయకుల పావనుండు కులోచిత క్రి
యారతాచార నిరతుఁ డుదార గుణుఁడు
విప్రబాంధవ వాంఛితార్థప్రదుండు
విట్ఠలేశ్వర నిజమూర్తి విట్ఠమరుసు. 31

కం॥ ఆ రాయ మంత్రి మణికిన్
నారీమణి తిప్పమాంబ నయ వినయ శుభా
చార యరుంధతిఁ బోలు న
నారత పతిభక్తియందు నభివర్ధింతున్. 32

---

29వ. ప. సీతాదేవియు నామె చెలికత్తెయు పరస్పరము ప్రశ్నోత్తర రూపమున సంభాషించినట్లు అన్వయించుకొనవలయును.

(1) స....చభరంబు పుట్టె — అని కాకినాడ ప్రతి పాఠము. సకియ భయంబు (ప)
30వ. 2. ప్రధాన (వ్రా) ప్రధాని (ప)
31వ. ప. 3 'రాయభార' — అని మద్రాసు ప్రతి

కం॥ ఆ శుభదంపతులకు గుణ
రాశి తపఃఫలమువోలెఁ బ్రభవించె యశ
శ్శ్రీశశి [1]నంజరుసు సురా
ధీశ గురు ప్రతిభవాఁడు తేజం బలరన్.. 33

శా॥ కందావారము నంజయ ప్రభుని లోకఖ్యాతు లీలా లస
ద్గంధానేకప దానవారి మకుటాగ్రవ్యగ్రలోల ద్వియ
త్సింధూల్లోల ఘటార్భటీ పటువచశ్శ్రీలన్ సుధాసార ధా
రంధర్యంబున సన్నుతింతు సుజన వ్రాతంబు హర్షింపఁగన్. 34

ఉ॥ నంజరుసయ్య మంత్రికుల నాయకుఁ డుత్తమసాధ్విఁ దిప్పమన్
గంజదళాయతాక్షి శుభకారిణి శ్రీసతిఁ బెండ్లియాడె శ్రీ
కంజదళాక్షుఁడుంబలె జగంబులు ప్రస్తుతిసేయ బాంధవుల్
రంజిల భాగ్యసంపద నిరంతరమున్ గొనసాగుచుండఁగన్. 35

కం॥ పతిదేవతా శిరోమణి
శతధృతిసతి పద్మనాభుపతి శంభుపతిన్
బ్రతి వోల్తు నంజయ ప్రభు
సతిఁ దిప్పాంబికను బంధుజనకామగవిన్. 36

శా॥ ఆ తిప్పాంబకు నంజమంత్రికి సముద్యత్కీర్తి ధుర్యుల్ సుఖా
స్వీతుల్ తిమ్మరుసయ్య సంకపరుసున్ వేదాంతవేత్తల్ మహీ
జాతా రాముల కాత్మజుల్ కుశలవుల్ జన్మించిన ట్లుత్కట
ప్రీతిం బుట్టరి తల్లిదండ్రుల కతిప్రేమంబు సంధిల్లఁగన్. 37

ఉ॥ శ్రీనిధి నంజమంత్రి కులశేఖరు తిమ్మరుసయ్య దాన వి
ద్యానయశాలి మన్మథ శుభాకృతి కాంతి సుధాంశుఁ డర్థి సం
తాన సురద్రుమం బనుచుఁ దన్నుఁ దనంతటి వార లెల్ల నౌ
నౌ నన మంచిస్వామి యగు నచ్యుతరాయ లనుగ్రహింపఁగన్. 38

---

33వ, ప. (1) నంబురుసు అని వ్రాతప్రతి. నంజరుసు అని సవరణ.

శా॥ శ్రీరామస్మరణార్చనా జ పసదాసేవావ్రతంబుల్ సదా
చారంబుల్ తనదైన బ్రాహ్మణ కులాచారంబు కంటెం గడున్
బారాశర్య శుకాది భాగవత పంభావ్యండు సత్కీర్తి రా
మారత్నప్రియుఁ డైన సంజవిభు తిమ్మర్సయ్య వర్ణింపఁగన్. 39

కం॥ శృంగారవతీమణి పు
ణ్యాంగన సంజరుసు తిమ్మనార్యుని సతియౌ
లింగాంబిక యంబిక కెన
మంగళసూత్ర ప్రభావ మాన ధనములన్. 40

ఉ॥ ఆ హరిణాక్షియందు సుగుణాఢ్యుఁడు తిమ్మరుసయ్యగాంచెఁ దే
జోహరి సత్కృపాహరి విశుద్ధ యశోహరి నిత్యభోగ ల
క్ష్మీహరి సంజమంత్రిని సమిద్ధ కులాంబునిధీంద్ర చంద్రునిన్
మోహన పుష్పసాయక సముజ్జ్వల రూప విశాల వైభవున్. 41

కం॥ కుల వర్ధనుండు సంజన
విలసిల్లెం దిమ్మమంత్రి విభు పుణ్యంబుల్
ఫలియించి సట్లు విద్యా
విలసిత తమకాంతి శుభవివేకోన్నతులన్. 42

వ॥ అని కులస్థాన పౌరుషంబులు విజయనగర సింహాసనంబునఁ బ్రసిద్ధంబులై యున్నవి. సర్వలక్షణ సంపన్నుఁడ విట్టి మహానుభావుండవు. నీ వానతిచ్చినట్లు నీ యభిమత దైవంబగు శ్రీరామచంద్రునకు నీ తారకబ్రహ్మరాజం బంకితంబు సేసెద ననిన నా బ్రహ్మ ప్రధాని శేఖరుండు కర్పూర తాంబూలంబు మున్నుగా నిచ్చి జాంబూన దాభరణాదులు కట్ట నిచ్చిన నియ్యకొని హర్షించి 43

సీ॥ బ్రహ్మాది దేవతల్ ప్రార్థింప దశరథు
నకు నుదయించి కౌశికుని మఖము
గాంచి శంకరు విల్లు ఖండించి సీతఁ బెం
డ్లాడి యా పార్థివితో నసుజుతోడ
నడవికి నేగి యింద్రాత్మజు వణఁచి సు
గ్రీవాది వనచర శ్రేణితోడ
వార్ధిఁ దరించి రావణుఁ ద్రుంచి యా విభీ
షణుని బట్టముగట్టి జగము లలర

గీ॥ పుష్పకం బెక్కి సాకేతపురికి వచ్చి
ఎలమిఁ బదునొక వేలయేం డ్లేలె భూమి
తారక బ్రహ్మ మంత్రాధి దైవతంబు
రామ భూపాలుఁ డా జగద్రక్షకునకు. 44

## షష్ఠ్యంతములు

కం॥ శ్రీ రుచిర బ్రహ్మ విద్యా
చోరాసుర విదళనోగ్ర శూరునకు భయ
స్ఫారునకు బ్రహ్మ విద్యా
సారజ్ఞ బ్రహ్మ హృదయ సంచారునకున్. 45

కం॥ అమృతాబ్ధి మథన లీలా
కమఠాకృతి ధృత మహానగ గ్రామణికిన్
సమధిక దినమణికి సుధా
ప్రముదిత దేవునకు సత్కృపాపారునకున్. 46

కం॥ అతి నిశిత దంష్ట్రికాగ్ర
స్థిత భూవలయునకు దేవ దివ్య ద్యుతి ని
ర్జిత కువలయునకు తను ము
ద్రిత పరిరంభణ ధరాసతీవలయునకున్. 47

కం॥ స్తంభావిష్కృతి కహ కహ
గంభీర నృసింహ దివ్యకాయునకు జయా
రంభ మహోపాయునకున్
దంభ రహిత భక్త రక్షణ విధేయునకున్. 48

కం॥ చరణాక్రాంత భువనునకు
నురు పరశు విదార హైహయోర్వీశ్వర శే
ఖర జీవనునకు విజయ
స్థిర సద్గుణ ధామునకును శ్రీరామునకున్. 49

వ॥ సహస్ర సంఖ్యా నమస్కార పూర్వకంబుగా నా సమర్పించిన తారకబ్రహ్మరాజం
బను మహాప్రబంధంబునకు కథా క్రమం బెట్టి దనిన 50

## కథా ప్రారంభము

ఉ॥ శ్రీయుత మాధవాన్వితము సిద్ధము నైన ప్రయాగ యొప్పు గం
గా యమునా సరస్వతులు కాలగళాచ్యుతధాతృమూర్తు ల
త్యాయత [1]పుణ్యవాహినుల యట్లు జగత్తు పవిత్ర మౌటకున్
బాయక కూడియున్న క్రియఁ [2]బారమునం బ్రవహింపు చుండఁగన్. 51

సీ॥ బ్రహ్మ యజ్ఞముచేసి ప్రథమకాలంబున
నతి పవిత్రక్షేత్ర మనుచు నుండు
వైకుంఠమునకంటె వసతి మంచిది యని
మాధవుం డచ్చోట మానకుండు
నఖిలైక సంసేవ్య మగు త్రివేణీ సంగ
మము మహీ మండల మందుఁ దనరి
కమనీయ ధర్మార్థ కామమోక్షదము ప్ర
యాగయే యని చాటు నాగమములు

గీ॥ భూమిఁగల యుత్తమ క్షేత్రములకు నెల్ల
నుత్తమ క్షేత్రమై తాపసోత్తములకు
నఖిమతైక తపోభూమి యగుచు నొప్పు
నా ప్రయాగంబు మహిమ నేమని నుతింతు. 52

చం॥ రవి మకరస్థుఁడైన తరి బ్రహ్మహుఁడున్ హయమేధియున్ దదీ
య విమత వేణికాత్రయమునందు మునింగిన వాని మేని వా
ర్లవములు మీఁదఁ బడ్డపుడు బ్రహ్మ పదస్థితిఁ గాంతు రన్నచో
నవలను దీర్థ మాడిన మహా [4]ఫల మెవ్వఁ డెఱుంగుఁ జెప్పఁగన్. 53

---

51 ప. (1) పుణ్యవాహిళవిలు యట్లు అని యున్నది. వాహినుల యట్లు అని సవరణ.
,, (2) పర్వమునం అని యున్నది. పారమునం అని సవరణ.
53 ప. (4) బలమెవ్వఁడెఱుంగు అని యున్నది. ఫలమెవ్వఁ డెఱుంగు అని సవరణ.

ఆ॥ అభిమతంబు గోరి యమ్మహాక్షేత్రంబు
నందు ముక్తజీవుఁ డైన వాఁడు
భూతలంబునందు జాతిస్మరత్వాది
ఫలము గాంచి దానిఁ బ్రస్తుతించు. 54

వ॥ అమ్మహాక్షేత్రంబునం బరాశర మునీంద్రుం డొక్కనాఁడు త్రివేణీ సంగమంబున [1]మకరమాసంబునఁ దీర్థ మాడి సంధ్యానుష్ఠానంబులు నిర్వర్తించి తత్పులిన ప్రదేశంబున శిష్య సహస్రంబులకు బ్రహ్మంబు బోధించుచున్న సమయంబున వసిష్ఠ మహాముని శిష్యుండగు వామదేవుండు వచ్చి యటకు మున్న స్నానాది కర్మంబులు దీర్చి యమ్మునికులగ్రామణిం గాంచి ప్రణమిల్లి యిట్లనియె. 55

కం॥ సాక్షాత్కారస్థిత స
ద్మాక్షునిగా నిన్ను గంటి నక్షులు దనరెన్
దాక్షిణ్య హృదయ ! యధికా
పేక్ష యొకటి కలదు నాకు హృదయంబందున్. 56

గీ॥ నా గురుండు వసిష్ఠుండు నాకు మోక్ష
ఫలద మైనట్టి తారకబ్రహ్మ మంత్ర
మొసఁగె నేతత్ప్రభావంబు నొనరఁ జెప్ప
వలయు ననవుడు కారుణ్యవార్ధి యతఁడు. 57

కం॥ పూని దిలీపునకున్ స
న్మానార్హ్మన కర్కకులజ మణికిన్ బ్రహ్మ
జ్ఞానాత్మక రామాయణ
మేనుడువుచు నున్నవాఁడ [2]నెడ లే దింకన్. 58

వ॥ కావున నిప్పుడు ప్రయాగక్షేత్రంబునఁ బరాశరుం డున్నవాఁడు. అతని కడకుం బొమ్ము. తత్ప్రభావంబు నవిస్తరంబుగా నీకుం దెలుపునని యానతిచ్చినఁ దదాజ్ఞా ప్రమాణంబున వచ్చితి ననిన బహుమానించి సమీపంబునం గూర్చుండం బెట్టుకొని యమ్ముని కుమారుని మోక్షాపేక్షకు నలరి పరాశరుం డిట్లనియె. 59

---

55 వ. (1) మకర మాఘంబున అని వ్రాత ప్రతిలో నున్నది, మకరమాసంబున నవరణ.

58 వ. (2) యడలేదింకన్ అని యున్నది. నెడలేదింకన్ అని నవరణ.

కం॥ జీవన్ముక్తుఁడవు జగ
త్పావనుఁడవు బ్రహ్మచర్య పదవి వినిష్ఠా
ధీవిలసితుఁడవు గురు సం
భావితుఁడవు [1] నీదె గొప్ప భాగ్యం బనఘా! 60

కం॥ అని బ్రహ్మమయుని శ్రీరా
ముని దన్మంత్రార్థి దైవమున్ హృదయములో
మనుచుకొని [2] మేనఁ బులకలు
జనియింపఁ బరాశరుండు సమ్మతిఁ బలికెన్. 61

వ॥ పరమర్షిప్రవరుండు కుంభజుఁడు లోపాముద్రయుం దాను ని
ర్భర వింధ్యోన్నతి డించి లోకముల సంరక్షించి బ్రహ్మాది ని
ర్జర రాజస్తుతు లంది దక్షిణ తపోరక్తైక పుణ్యస్థలీ
వరిదాదు ల్గనుఁగొంచు సేతువునకున్ సంప్రీతిమై నేగుచున్. 62

సీ॥ ప్రచ్ఛాయ శీతల పాదపచ్ఛాయల
నాతపజాయాస మణఁచి యణఁచి
యక్కడక్కడఁ గ్రేవ నాపగా కూపాది
మధురాంబువుల దప్పి మాన్పి మాన్పి
యలపున మైఁదీగె యల్లాడి తోఁటల
సుశీత స్థలంబుల సవిచి యునిచి
[3] వేళకుం దగఁ గందమూల ఫలాదులఁ
దినిపించి యాకలి తీర్చి తీర్చి

గీ॥ నడవ నోపిన నడపించి నడవ నోప
కున్న నెచ్చోట నచ్చటే యుండఁజేసి
తెరువునడచిన దుఃఖంబుఁ బొరయనీక
సఱఁతి నొయ్యనఁ గొని చనఁ బారికాంక్షి. 63

---

60. వ. (1) న జప్ప అని యున్నది. నీదె గొప్ప అని సవరణ.
61 వ. (2) మేన కులకుల అని యున్నది. మేనఁ బులకలు అని సవరణ.
63. వ. (3) వేళతోఁదగ అని యున్నది. వేళకుందగ అని సవరణ.

గీ॥ కాశికాపుర [1]విరహ దుఃఖమున విషమ
పథ పరిశ్రమమునఁ గుందుఁ బారికాంక్షి
పూర్వకర్మానుభవమును బొంద కెట్టి
వారలకుఁ బోవరాదని వనితఁ జూచి. 64

గీ॥ ఉవిద యింత ప్రయాసంబు నొందవలసె
వింధ్యగిరి దుర్ణయంబున విశ్వనాథుఁ
గాశికా భర్తఁ బాసి శ్రీ గౌరిఁ బాపి
గంగ నెడవాసి మనకు నీ గహన భూమి. 65

శా॥ శ్రీ కాశీనగరోపకంఠ [2] ప్రవహత్సింధు ప్రతీరంబునం
దేకాగ్రస్థిరచిత్త వారిజమునం దీశున్ శివున్ నిల్పి ద్రి
హ్మైకానందముతోడ మేన్మరచి తాదాత్మ్యంబు సిద్ధించు నే
నీ కాంతార నిరంతర వ్యథకు రా నే కర్మముల్ చేసితిన్. 66

ఉ॥ ఎన్నడు చూచువారమొకొ యిందు కళాధరు విశ్వనాథు నా
పన్న జనార్తి నిర్హరుని పాల విలోచనుఁ గాశి కేగి యిం
కెన్నడు గంగఁ జూతుమొ సమీహిత ముక్తి రమాస్మితాస్య [3] నా
పన్నులఁ దేల్చి హస్తముల మాటికిఁ గౌగిటఁ జేర్చుచుండఁగన్. 67

ఆ॥ కలవు పుణ్యనదులు కల్గుఁగా కేమి యా
గంగఁ బోలలేవు గాని యందు
గంగ పేర మించి గౌతమి కృష్ణ కా
వేరి తుంగభద్ర వెలయు జగతి. 68

కం॥ ఈ నాలుగు నదులును గం
గా నదితోఁ గూడి పంచగంగ లనంగా
నానానదులకు నెక్కువ
యై నెగడుఁ ద్రిలోక పావనాకారములన్. 69

---

64 ప. (1) విహారు....మున అని యున్నది. విరహదుఃఖమున అని సవరణ.

66 ప. (2) విషసింధుప్రతీరంబునన్ అని యున్నది. ప్రవహత్సింధు ప్రతీరంబునన్ అని సవరణ.

67 ప. (3) నా పన్నగదేవి అని యున్నది. నా పన్నులఁదేల్చి అని సవరణ.

సీ॥ బ్రహ్మకమండలోద్భవ విష్ణుపద వికీ
ర్ణజ భవ నిహితోత్తమాంగ గంగ
బ్రహ్మహత్యాదిక పాతకోన్మూలనో
ద్భట చటులోత్తుంగ భంగ గంగ
నిజ తటస్థ విరస్త నిస్సార సంసర
ణాంగనా రతిరయసంగ గంగ
ముక్తిస ర్తకవధూమోహ నాభినయైక
రసకళా [1]రంగ తరంగగంగ 70

గీ॥ స్వర్గమర్త్యాహిలోక పావన జలౌఘ
కలిత మాధుర్య శైత్య[2]లాఘవ విశుద్ధ
తావినిర్జిత రుచిర సుధాహిమాంబు
శారదాంభోద శేషభుజంగ గంగ.

ఉ॥ గంగఁ దలంచినం గనిన గంగఁ గొనాడిన గంగ నాడినన్
గంగ యటంచుఁ గుంభమునఁగాలువ నూతను దీర్థ మాడినన్
గంగ శుభాభిధానమున గాదిలి పుత్రులఁ బిల్వ నేర్చినన్
గంగ సమస్త యాగముఖ కర్మఫలంబుల నిచ్చు నిచ్చలున్. 71

వ॥ అని పలుకుచు సేతువునకుం జని తత్సమీపంబున నుద్యానముఖంబున నొక్క మఱ్ఱి
చెట్టు నీడను గొండిక యలపు దీర్చికొని కూర్చుండి రప్పుడు. 72

సీ॥ కర్దన గావికోకలుఁగావి తలచుట్టు
ప(యి)వింద విసువ చిప్పలు దనర్పఁ
గడుపావనంబైన గంగలో మట్టియు
భూతిరేఖలు ఫాలమున వెలుంగ
శీతవాతాతప భీతికి నిడిన కృ
శాంగ కూర్పాసక భంగి మెఱయ
మూపు లెత్తుక యుండఁ దాపిన భార య
ష్టులక్రిందఁ గంబళాదులు పొసంగఁ

70. వ (1) రంభ వరంగ గంగ. అని పాఠాంతరము.
„ (2) రాఘవ అని యున్నది. లాఘవ అని సవరణ.

గీ॥ గుల పవిత్రులు పితృవత్సలులు మహిను
పర్వ లోకకొంద అమ్మహో వారిఁ గాంచి
కన్నులకు వేడ్క సంధిల్ల గ సులుకూడి
వచ్చి రట వారణాసి కావళ్ళవారు. 73

కం॥ వారిఁ గనుంగొని ముని మన
మారఁగ మముఁ దలఁచినట్లు యరుదెంచెను భా
గీరథి యదె చూడుము పం
కేరుహదళనయన యనుచుఁ గీర్తించి తగన్. 74

గీ॥ అద్భుతము విను రామేశ్వరాభిషేక
మునకు భాగీరథీతీర్థ మనుదినంబు
వచ్చు నీ సేతువునకు నవశ్యమును మృ
గాక్షి యా కాశినుండి మధ్యాహ్నమునకు. 75

కం॥ శ్రీరామేశ్వరుశివుఁ బ్రతి
వారము గంగాజలముల వసుధాజను లిం
పార నభిషేక మార్చుట
నారీ! శ్రీరామ శాసనంబునఁ జుమ్మా! 76

వ॥ అని పలుకుచు నింతియునుం దానును గంగాతీర్థధారవాహకులం జూచుచుండి రంతఁ
దారును నమ్మహీరుహంబు నీడం బ్రశమిత పథ పరిశ్రములై మధ్యాహ్న సమయం
బగుచు వచ్చె, నభిషేక సమయంబు నిదియ శీఘ్రంబున రామేశ్వరలింగంబు నగరికిం
బోవలయు నని చనిరి. వారల యభిప్రాయంబు లెఱింగి నిజాంగనకుం గలశసంభవుం
డిట్లనియె. 77

మ॥ మనముం బోదము వీరివెంట నిదిగో మధ్యాహ్నమయ్యెం గనత్
కనకచ్ఛత్రము రామలింగమున కగ్రక్షోణి సేవార్థ మె
త్తిన చందంబున భానుబింబ మలరెన్ దేజోధికస్ఫూర్తి చే
వనజాతాక్షుఁడు వచ్చె నా సమయమున్ వచ్చెన్ జన ప్రార్థ్యమై. 78

కం॥ మధుభిన్నాభిష్టలమున
విధి సంభవ మొందియున్న విధమున సేతు
ప్రథితబ్రహ్మ సరోంబుజ
మధుగత తపనీయమూర్తి మ్రదవి యొప్పెన్. 79

గీ॥ ధ్యానయోగంబు లుడిగి [1]మాధ్యాహ్నికంబు
లైన కర్మంబు లొనరింప నరుగుదెంతు
రాశ్రమస్థలమునులు సేత్వంతికాబ్ధి
కమలభవకుండికాది తీర్థముల కింక. 80

కం॥ అని వింధ్యాచల దమనుఁడు
చన లేచిన యమ్మహీజ శాఖల [2]జతుకా
తనుధరులై వ్రేలుచుఁ దప
మొనరించెడు మునులు గొంద ఱుత్తమ చరితుల్. 81

కం॥ వారలఁ గనుఁగొని యచ్చెరు
వార నగస్త్యుండు నిలిచె నా సంయములున్
జేరి ప్రణామాంజలి బం
ధాహృతత ననిరి యమ్మహాత్మునితోడన్. 82

చ॥ శిలరు మహామునీశ్వరులు కంజభవాదులు నిర్జితేంద్రియా
త్ములు జగదేకపూజ్యులు సముజ్జ్వలసంస్కృతు లివ్వసుంధరన్
గలిగిననేమి యీక్రియ నఖండచిదాప్తియె సత్ఫలంబుగా
నలఘుసమాధి నుండెడు మహాత్ములఁ గానము [3]గాక యెయ్యెడన్. 83

---

80 ప. (1) మధ్యాహ్నికంబు అని వ్రాతప్రతి పాఠము

81 ప. (2) జతుకాదను తరులై అని వ్రాతప్రతిలో నున్నది. జతుకాతనుధరులై అని సవరణ. జతుకాతనుధరులై =చివుక పిట్టల శరీరములను దాల్చినవారై అని అర్థము. చివుక పిట్టలు చెట్లయందు తలక్రిందుగా వ్రేలుచుండును.

83 ప. (3) మహాత్ములు గావసుగాని యయ్యెడన్ (వ్రా) మహాత్ములఁ గానము గాక యెయ్యెడన్ (స)

సీ॥ త్రైలోక్యభయద వింధ్యవసుంధరాధరేం
ద్రము క్రుంగ [1]మట్టిన ప్రాభవంబు
ధరణీతలం బెల్లఁ దిరిగివచ్చిన వార్ధిఁ
బుడిసిటఁ బట్టిన భూరిశక్తి
వాతాపి జఠరాగ్ని వైచి పొక్కిలిక్రింద
నిమి రారగించిన నెఱతనంబు
హరుపెండ్లినాఁడు తద్ధర క్రుంగిపోకుండ
[2]దక్షిణక్షమ మున్న తానకంబు

గీ॥ తారకాకార విలసనోదయముచేత
వారి మాలిన్య ముడుపు దివ్యప్రభావ
మమరులకునైనఁ గలదె నీయట్టి ఘనున
[3]కిదియు నద్భుతభంగియే యెన్ని చూడ. 84

కం॥ అక్షయ కరుణాసంప
ద్వీక్ష విశాలాక్షితోడి విఘ్నేశ్వరుఁడే
సాక్షాత్కరించె నని ప
ద్మాక్షియుతు న్నిన్ను గంటి మాహ్లాదమునన్. 85

కం॥ కలశభవ ! మా తపంబులు
ఫలియించె న్నేఁడు రామభద్రుని సత్యో
క్తులవలన సేతుబంధ
స్థలిఁ దావక దర్శనమునఁ దత్త్వజ్ఞనిధీ ! 86

వ॥ మహాత్మా ! విన నవధరింపుము ! మేము వాలఖిల్యులము. జన్మించినది మొదలుగా సంసార సుఖ కారణంబులైన స్రక్చందన వనితాది విషయంబుల చవి యెఱుంగని యింద్రియంబులు గలవారమై మోక్షాపేక్షం బక్షిప్రభృతి సూక్ష్మాకారంబులు వహింపుచు గిరిదరీగహ్వరంబుల తరుశాఖాకోటరాదులఁ గొంతకొంతకాలంబులు నిలుచుచుఁ బెక్కు దివ్య వర్షంబులయ్యేం దపంబు సల్పుచు మోక్షంబు వడయు నుపాయంబు గానక

84 ప. (1) ముట్టిన—అని (వ్రా) మట్టిన (స)
,, (2) దక్షణక్షమనున్న దానకంబు - అని వ్రాతప్రతిలోనున్నది. దక్షిణక్షమనున్న తానకంబు అని సవరణ.
,, (3) కిదియ, యద్భుతభంగియే యెన్నిచూడ అని వ్రాతప్రతి పాఠము. "కిదియునద్భుత భంగియే యెంచిచూడ" అని సవరణ.

యుండ నీకడపటి మత్తికొమ్మల వ్రేలుచుండ జకదేకరక్షణార్థంబు బ్రహ్మాదిదేవతా ప్రార్థితుండగు నాదినారాయణుండు శ్రీరామావతారం బంగీకరించి [1]దేవాంశ జాతులగు సుగ్రీవాంగదాది కపివీరులతో సముద్రంబు గట్టి నిజాంగనాద్రోహియగు దశగ్రీవుని పుత్రమిత్రయుతంబుగా [2] దుష్కరశరంబులతో నణంచి ప్రియాసమేతుండగుచుఁ గ్రమ్మరి నిజశాసన సేతుబంధనంబునం దనపేర శివలింగంబును బ్రతిష్ఠించి [3]యీ పుణ్యక్షేత్రంబున బ్రహ్మహత్యాది పాతకంబులు వాయు నీ క్షేత్రంబునం జేయు ధర్మంబులు కోటిగుణితంబులై ఫలించు నని వరంబిచ్చెఁ దత్కాలంబున సమీపవర్తి యైన నారదమహామునీంద్రుండు మా విధం బెఱింగించి వీ రేవిధంబునం గృతార్థులగు దురనిన నద్దేవుండు. 87

కం॥ నారద! యిమ్మను లొనరుచు
ఘోరతపము మోక్షలక్ష్మి కోరిక నయ్యేన్
వీరికిఁ దన్మ క్కిశ్రీ
చేరిక కుంభజునివలనఁ జేకుఱు ననినన్. 88

కం॥ అని యవ్విభుం డయోధ్యకుఁ
జన నానృపు వీడుకొని ప్రసన్న వదనుఁడై
ఘనుఁ డా వైధాత్రుఁడు మముఁ
గొనియాడుచు వచ్చి యిచటఁ గుజవిటపములన్. 89

కం॥ తలక్రిందై జతుకాఖగ
ములమై వ్రేలాడు మము ముముక్షుఁ గని వే
తలయూచి తద్విధము మా
కలవడ వినిపించి చనియె [4]నల్లన నిచటన్. 90

---

86 ప. (1) దేవోశకౌతులగు. అని యున్నది - దేవాంశ జాతులగు అని సవరణ.
,, (2) దుష్కరంబులతో నణంచి అనియున్నది. "దుష్కరశరంబులతో నణంచి" అని సవరణ.
,, (3) (యీ పుణ్యక్షేత్రంబు..........తనిన) అను భాగము హైదరాబాదులోని గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్టు లైబ్రరీయందలి వ్రాతప్రతిలోలేదు.
89 ప. వైధాత్రుఁడు=బ్రహ్మమానస పుత్రుఁడగు నారదుఁడు.
90 ప. (4) నట్లన—అని యున్నది. నల్లన అని సవరణ. (చనియెన్+అల్లన)

వ॥ మా భాగ్యంబున మేము సేయుతపంబులు ఫలోన్ముఖంబు లయ్యెడు కాలంబున నిప్పుడు భవద్దర్శనంబు సిద్ధించె. మమ్ముం గృతార్థులం జేయు మనిన నగస్త్యుం డిట్లనియె. 91

కం॥ తాపసముఖ్యులు మీ రమ్ప్ర
తాపేక్షాపరులు సంతతాతిశయ తపో
ద్దీపితులు రామదేవ కృ
పోపేతులు ముక్తి మీకు నొదవుట భరమే. 92

మ॥ పరమబ్రహ్మమయుండు విష్ణుఁడు జగత్ప్రఖ్యాతిగా ధారుణి
పరిరక్షార్థము పుట్టి రామవిభుఁడై పద్మాప్తవంశంబునం
దరుదారన్ భినుఁ డా[1] మహీశుని మహీయః శాసనశ్రీఁ గృపా
పరిబుద్ధిం దగ మీకుఁ జెప్పెద [2]భవత్రాప్యాపవర్గత్వమున్. 93

వ॥ ఇప్పుడు మనమందఱము సేతుబంధ పుణ్యక్షేత్రంబున సముద్రబ్రహ్మ కుండికాతీర్థంబుల స్నానాదికృత్యంబులు నిర్వర్తించి రామేశ్వరు సందర్శించి తత్రత్య విద్వన్ముని గణంబులతో ముక్తిమంటపంబునఁ గూర్చుండి మీరడిగిన ముక్తి రమాసమాగమోపాయం బుపదేశించెదనని వారునుం దానునుం జనియె నప్పుడు. 94

సీ॥ ఉష్ణాంశుకర దాహ మొదవకుండఁ బయోద
మాతప వారణ మగుచు నేగు
గమన ఖేదోద్భూత ఘర్మంబు తోఁడ్తోన
మందానిలము వీచి మాన్పుచుండు
సంగశైత్యముకల్గ నక్కడక్కడఁ జల్లు
దురు వనదేవతల్ విరులతేనె
([3]) "ఇతఇతోయతినాథగతి" యని ముందట
వన్యకీరశ్రేణి వచ్చుచుండు

---

93 ప. (1) "నికేశుఁడు మహీయ్యాశాసనశ్రీగతా పరబుద్ధిం" అని వ్రాతప్రతిలోనున్నది. మహీయఃశాసన అని (స)

,, (2) 'భవత్ప్రాద్యాపర్గత్వమున్ అనియున్నది.' 'భవత్రాప్యాపవర్గత్వమున్' అని సవరణ

95 ప. (3) 'యితియితో యతినాథ గతియైనముందట పన్న కెరశ్రేణి' అని వ్రాత ప్రతిలో నున్నది 'ఇతఇతో యతినాథగతి' యని ముందట వన్యకీరశ్రేణి వచ్చుచుండు అని సవరణ

గీ॥ సేతుకుజఃఖ్యాతికారామసీమ మౌని
కుల లసత్పర్ణశాలాగ్రముల హిరణ్య
గర్భ హరి హర నిభునకుఁ గలశజునకు
నభిమతంబుగ వాలఖిల్యాదు లలర. 95

వ॥ అట్లు చనిన. 96

చ॥ కనియె నగస్త్యుఁ డమ్మునినికాయముతోఁ బున రాత్మ పానసం
జనిత కుతూహలాగమన సంభ్రమ [1]వహ్నిశిఖావళీవిలో
కన తరళోర్మి హస్తధృత కమ్రకణ ప్రసవాళితో సమ
ర్చన నియమైక ధీనిధి [2]దిశావలయావధి నమ్మహోదధిన్. 97

చ॥ అరుదుగ నీవు క్రోధశిఖి నార్పుటకై వడిఁ గ్రోలి తోన జా
ఠరశిఖి నార్ప నొల్లక వెడల్చితి నన్నుఁ గృప నృదీయ జా
ఠరబడబాగ్ని నార్పను వెడల్పను నేరను దీని మాన్ప నన్
పరుసున వార్ధి ఘూర్ణిలుట వట్టె మనంబున నిల్పరామికిన్ 98

మ॥ తను బ్రార్థించిన లక్ష్మిఁ గౌస్తుభముఁ జింతారత్నమున్ గల్పకా
వనిజాతామృత కామధేనువు మరుద్వాహంబు నైరావతం
బును రంభాదుల నిచ్చె వేల్పులకు నంభోరాశి దాన్యప్రభా
వ నిరూఢిం బ్రభు వన్యుఁ డెంకఁ గలఁడే వర్ణింప లోకంబులన్ 99

చ॥ భువనభయంకరం బగుచుఁ బుట్టిన హాలహలం బజంబె నా
శివుఁ డుపకార మంబునిధి చేకొనె యెట్టికృతఘ్నులో సుమీ
దివిజులు శ్రీ సుధాదులు ధృతింగొని సేయరయో తదాత్మ సం
భవ బడబానల వ్యధ కుపాయ మతండు గభీరుఁ డేమనన్. 100

ఉ॥ అంతయు నింకి మర్త్యభువనావనబుద్ధి నమర్త్యభూతలా
క్రాంతి యొనర్పఁ బోక జలరాశి యథార్థత నున్న దిట్టు లా
వంతయు మేర దప్పక మహాత్ముఁడు దైవప్రకల్పితాశయా
త్యంత జగత్ప్రియైక విలయావసరంబున నేమొ [3]కో యగున్. 101

96 ప. (1) "వహ్నిశిఖావజావలోకన" అని వ్రాతప్రతిలో నున్నది.
"వహ్నిశిఖావళీ విలోకన" అని సవరణ.

,, (2) దిశావలయానిధి (వ్రా) దిశావలయావధి (స)

101 ప. (3) కాగొగిన్ ; కా నొగిన్న్ (వ్రా) కోయగున్ (స)

వ॥ ఇట్లు వర్ణనీయం బగు నా యర్ణవంబుఁ జేరంబోయి. 102

క॥ గోమూర్తి యుడిగియును దా
భూమీసతి [1]వాల మునుపఁబోలు ననుచు వే
లామహిళామణి మణిమయ
సీమంత [2]లలాటకంబు సేతువుఁ గాంచెన్. 103

వ॥ కాంచి కాంచనగర్భ ప్రభృతి దివ్యసేవ్యంబగు సేతుబంధనం బెక్కి (సి)ంధూపబ(ద్ధి)
శేష్ఠుండు(?)వాలఖిల్యులు వినుచుండ లోపాముద్ర కిట్లనియె. 104

శా॥ ఆచంద్రార్కము నిల్చు సేతు విది రామాధీశ సత్కీర్తితో
భూచక్రంబున సర్వసేవ్య మగుచున్ బుణ్యస్థలీరాజమై
[3]వాచాగోచర మొక్క దివ్యవనితా వాల్లభ్య మబ్బుం జుమీ
యే చందంబునవైన వచ్చి మనుజుం డీ సేతువుం జూచినన్. 105

క॥ సేతువుఁ జూచిన యపుడే
భూతలమునఁ గలిగినట్టి పుణ్యక్షేత్ర
వ్రాతముఁ జూచిన ఫలము లు
చేతికిఁ జనుదెంచు వేదసిద్ధం బబలా ! 106

గీ॥ కువలయేక్షణ యిది ధనుఃకోటి చూడు
ఘనధనుఃకోటితోడ రాఘవుఁడు దీని
నీరు ద్రిప్పిన [4]ఘనసుడి నేఁడుఁ దిరుగు
నది ధనుఃకోటి యయ్యెఁ [5]దీర్థా (బ్ధి) యగుచు. 107

---

103 ప. (1) భూదేవి గో రూపమును విడిచిపెట్టినప్పటికిని ఆ గో రూపమునకుఁజెందిన వాల
మును (తోకను) మాత్రము మిగిల్చినదో యనునట్లున్న — సముద్ర తీరమను
రమణీమణి దాల్చిన మణిమయమగు పాపట బొట్టుగా రూపింపదగు సేతువును
కనుగొనెను అని భావము కానోపును. 'వాల మునుపఁబోలు'-పాఠాంతరము

(2) లలాటికయగు అను పాఠము సముచితముగాఁ దోచును.

105 ప. (3) వాచా+అగోచరము అని గ్రాహ్యము. "వాచాగోచర మోక్ష దివ్యవనితా వాల్లభ్య
మబ్బుం జుమీ" అని పాఠాంతరము (హైదరాబాదు వ్రాతప్రతి).

107 ప (4) ఘనసుడి సాధుత్వముచింత్యము. అనింద్య గ్రామ్యముగా నెంచఁదగును.

కం॥ [1]ఆ తీర్థము మింట ఖగ
వ్రాతము విహరించునేని వడిఁ బడు నందున్
[2]నాతి! ధనుఃకోటిఁ బడిన
పాతకి మేన్దొఱఁగి దివ్యభావము నొందున్. 108

కం॥ రామేశ్వరలింగము శుభ
ధామము వీక్షించు పొలఁతి! తరణియు సాల
శ్రీ మెఱయ నప్పరిధి ఖర
ధామ ప్రతిబింబ మట్లు తనరెడు నచటన్.
109

వ॥ అని తదంతికంబున సముచిత పుణ్యతీర్థంబుల విహిత కర్మంబు లాచరించి యయ్యగస్త్యుండు లోపాముద్ర నవలోకించి శ్రీరామవిభుండు పౌలస్త్య శిరశ్ఛేదనానంతరంబున విభీషణునికి లంకాపురంబు పట్టంబుగట్టి సురాసుర పూజితుండై కపికోటులతోఁ బుష్పకారూఢుం డగుచు సీతయుం దానును నయోధ్యానగరంబునకు వచ్చుచుం దనముందర దశగ్రీవాకారంబునఁ దద్బ్రహ్మహత్య చనుదేర దానింజూచి బ్రహ్మస్వరూపుండును నిరంజనుండును నయ్యు సకలధర్మంబులుఁ దత్ప్రాయశ్చిత్త విధానంబులు నిజనియమితంబులు గావునఁ దా నంగీకరించినప్పుడుగాని లోకంబులు ప్రవర్తింపవని వహించుకొని యీ బ్రహ్మహత్య సేతుబంధంబునం బాపవలయునని వచ్చి శివప్రతిష్ఠ పూజ నమస్కారంబులు పాపహరంబులుగా వరం బిచ్చినవాఁడు గావునఁ దత్ప్రతిష్ఠకొఱకు శాసనస్తంభ విజయంబును, శివలింగంబును బ్రతిష్ఠించిన బ్రహ్మహత్యయు నద్దేవుని బాసి సకలజనులకు దృష్టాంతంబుగా నీ దేవాలయంబున ఛాయారావణంబై దోచు చుండు ననిన లోపాముద్ర యిట్లనియె. 110

కం॥ పదునాలుగు నేఁడాదికిఁ
దుది దినమునఁ బురము జేరఁగ దొరయుపతికి నె
ట్లాదవెనొకో రామునికిన్
సదాశివ స్థాపనార్హ సమయం బిచటన్. 111

కం॥ ఈ లింగ స్థాపనమున
నేలాగున సంభ్రమించె నీ శిల యిచ్చో
వేలాతటమున నావుడు
నా లలన కగస్త్యమౌని యనియెం బ్రీతిన్. 112

---

108 ప. (1) ఆ తీరముమింట అని (వ్రా) ఆ తీర్థము అని (ప)
(2) ప్రీతి ధనుఃకోటిఁబడిన (బాతకములు తొఱఁగి దివ్యభావము నొందున్. అని యుండఁదగును.

సీ॥ వినుము త్రిలోకైక విభుఁడు శ్రీరాముఁడు
పదునాలుగవయేడు తుదిదినంబు
నందునఁ బదునాలుగగు గడియ కయోధ్యఁ
జొచ్చు ప్రతిజ్ఞ వచ్చుచు నిచటకు
నిలిచె నెన్మిది గడియలవేళ నిల్చి యు
త్తమశిలఁ గొనిరమ్ము తారగిరికిఁ
బోయి వేగను వాయుపుత్ర నీ వని యన్న
నతఁడు నట్లన వచ్చు నంతలోన

గీ॥ వేళవచ్చిన నిసుకఁ [1]బృథ్వీవిభుండు
లింగరూపంబుచేసి నిల్పిన మహీజ
సీతయును నిల్పె నిసుకతోఁ జేసి నంది
నట్ల నిలిపిరి కపులును నంది శివుల. 113

కం॥ హనుమంతుఁడు ఘటికాద్వయ
మునకున్ శిల గొంచువచ్చె మునిసురకోటుల్
తను గొల్వఁ గనకగర్భుఁడు
చనుదెంచెన్ రామలింగళంభుని జూడన్. 114

వ॥ అప్పుడు గగనగంగయుం జనుదెంచి రామలింగంబు నభిషేకంబు సేనె నద్దివ్యలింగంబు సేవింప వచ్చియున్న [2]విరించి ముఖ్యులును జగదీశ్వరుండగు రామచంద్రుండును గంగాభిషేచనం బొనర్చిరి. అంత హనుమంతుండు తానుదెచ్చిన యమృతశిల రాము ప్రోల నిల్చిన నతని భక్తి నభినందించి యద్దేవుం డిట్లనియె. 115

గీ॥ తగు ముహూర్తంబునకు రాక తడయుటయును
వేళ దప్పిన నిసుక నీవేళ యింత
[3]పొడిపి నిల్పితి నీ లింగమున శివుండు
నిందు వసియించి మదభీష్ట మిచ్చె నపుడు. 116

113 ప. (1) పృథ్వీసుతుండు. అని వ్రాతప్రతి (మ.ఓ.లై.ప్రతి) పాఠము. పృథ్వీవిభుండు అని సవరణ. పృథ్వీవిభుండు=రాజగు శ్రీరాముఁడు.

115 ప. (2) విరించి ముఖ్యులంజూచి జగదీశ్వరుండగు రామచంద్రుండు ప్రతిదినంబున గంగాభిషేకం బొనర్చిరి. అని వ్రాతప్రతిలోనున్నది. అన్వయము సరిగా లేనందున సవరణ చేయబడినది.

పొరిపి (వ్రా) పొడిపి (స)

కం॥ నీ వుత్తమ శిల గైకొని
పోవుము శ్రీభ్రమమున నిల్పి [1]ముదమారఁగ నా
రాధ్యవరు నారాధింపుము
నావుడు హనుమంతుఁ డనియె [2]నరనాథునితో. 117

సీ॥ ధరణీశ యాచంద్రతారార్కముగ సేతు
బంధంబు నున్నత బాహుశక్తి
నిచట నీ శాసనం బెసఁగ శ్రీరామలిం
గంబు నిల్పితివి లోకంబు లలర
జలనిధి సేతువు గలకాలమున్ [3]భువి
నమృత శిలయేకాక యగునె యిసుక
తగు ముహూర్తంబని తప్పకుండఁగఁ బ్రతి
ష్ఠించి ప్రసిద్ధిని జేఁది తీవు

గీ॥ సృష్టినాయక! నిల్పు నీ శిలయ వాలు
కా మహేశ్వర లింగంబు కడకుఁ ద్రోచి
తగిన వేళకు నే రాని తప్పు గావు
మనినఁ దన్మగ్ధతకు నవ్వి యనియె విభుఁడు. 118

గీ॥ తప్పు లే దెన్నడును వాయుతనయ నీకు
భయము విడువుము దీన నీ భావశుద్ధి
నెఱుఁగనే దానికేమి యీ యిసుకఁ జేసి
నట్టి లింగము శిలయున్న యట్ల యుండు. 119

కం॥ హరు దివ్య శక్తి సంపద
కరము ప్రవేశింపఁ గులిశ కర్కశమై సు
స్థిరమై యున్నది లింగ
స్వరూపమిది దీనిఁ దిగియ శక్యంబగునే. 120

చం॥ అనుటయు వాయుపుత్రుఁడు కృతాంజలియై జగదీశ! నీదు శా
సన మిది యెక్కువేఁగడువ శక్యము కాదని కాక దీని ది
వ్యమ శిల నిల్ప నెంతపని వారిజసూతి యలర్ప మీరు పం
చిన శిల దీసి యీ శిల రచించెద నట్లన శంభులింగమున్. 121

---

117 ప. (1) సుఖకరముగ అని వ్రాత ప్రతి—యతిభంగ దోషమును పరిహరించుటకై ముద మారఁగ అని సవరింపఁబడినది.
,, (2) నావిభుతోడన్. అని వ్రాత ప్రతి. నరనాథునితోన్. అని సవరణ.
118 ప. (3) ధ్వని. అని యున్నది. భువి అని సవరణ.

వ॥ స్వామీ! భవన్నిర్మితంబు కావున దేవర పరమోత్కర్షం బొనర్చితిరి కాక వాలుకాకృతికి నంతశక్తి యెక్కడిది? మీ యనుజ్ఞ కలిగిన నిది తిగిచి యీశుం బ్రతిష్ఠించెద ననినఁ దనశక్తి కొండొక శివలింగంబునందు నిల్పి యంతర్ధానంబున రఘుపతి నీ వటు సేయ నోపిన మాకు నియ్యకోలనిన నుత్సహించి వేల్పులమూకలు మూఁకలై చూడ హనుమంతుండు వాలుకా లింగంబు కరద్వయంబునం బొదువంబట్టి బిట్టు తిగిచి రాకున్న నభిమానించి వాలపాశంబునం బట్టి తనశక్తి [1]యంతయుంజూపి తిగిచి యట్టునుం దిగియ రాక మేను సడలి మూర్ఛిల్లిన లక్ష్మణుండు కౌగిలించి యల్లన మూర్ఛ దేర్చిన నవ్విభుండు దేవతాశక్తియేకాక [2]సామాన్య చరాచరశక్తి కింత శక్తి యెక్కడిది నీ మనంబు నొచ్చునో యని వారింపనైతిని. దేవతా ప్రభావంబు [3] దెలియవైతివి అయ్యపరాధంబు వాయ నీ శిలాలింగంబు నీవు ప్రతిష్ఠింపుమని నియోగించి వేల్పుల వీడుకొలిపి అయోధ్యకుం జనియె నింత దేవతాప్రభావంబు మఱియెచ్చట లేదని చెప్పుచుం జని రామేశ్వరు సందర్శించి. 122

క౦॥ ఘటసూతి ప్రమొక్కి జాగిలి
[4](కుటిలాలక) తోడ మౌని కులములతోడన్
నిటల విలోచనునకు నిజ
నిటలాద్యష్టాంగి ధారుణీతలుఁ దగుచున్. 123

చం॥ జయజయరామ శాసనవిశాలయశోనిధి భాస్వదిందు భా
శ్రయ మహనీయ భూరియుత శాశ్వతలింగవిలాస ! సేతుబం
ధయుత !సరోజసూతి ముఖదైవతపూజిత ! దర్శనీయ ! య
వ్యయ ! జయరూప ! [5]మర్త్యభువనావన ! దేవ ! యమప్రణాశనా! 124

క౦॥ కొంచెపు పాపము లుండునె
పంచమహాపాతకములు భస్మంబులు గా
వించు భవద్దర్శనము [6]స
మంచిత సేతుప్రతిష్ఠితా ! శుభమూర్తీ ! 125

122 ప. (1) యట్లనుంజూపి (పాఠాంతరము)
,, (2) సామాన్యచరాచరశక్తి యంతశక్తి అని వ్రాతప్రతి పాఠము.
,, (3) దెలియవైతివి అని (ప) దెలిపితివి (వ్రా)
123 ప. (4) "కుటిలాలక "లు ప్తపూరణము
124 ప. (5) మర్త్యభువనాసురమంద దమ్మప్రనాశనా! యని వ్రాతప్రతి పాఠము.
125 ప. (6) నమంచిత సేతుప్రతిష్ఠి.... శుభమూర్తిన్ అని వ్రాత ప్రతి పాఠము. ప్రతిష్ఠితా ! శుభమూర్తీ (స)

వ॥ అని ప్రశంసించి తదభిషిక్త భాగీరథీతీర్థ శీకరనికరశుచీభూత పాటల జటాజూటం బుతో నంతర్గేహంబుతో వెల్వడి బహిర్ముక్తిమంటపంబున సకలవిద్వన్మునీంద్ర పరివృతుండై శ్రీపాముద్రయుం దానును నుపనిషద్విద్యాప్రబోధంబులు మూర్తిమంతంబులై ప్రదీపించుచున్నట్లు కూర్చుండి యగస్త్యమహాముని వాలఖిల్యమహామునులం జూచి భవదభిమత నిరతిశయానంద పరమకైవల్యపద బగు నుపాయం బుపదేశించెద సావధానమానసులై వినుండని యిట్లనియె. 126

గీ॥ నారదుఁడు దివ్యముని బ్రహ్మనందనుండు
తెలిపెగా మీకు శ్రీరామ దివ్యవచన
మార్గమునఁ గుంభజుఁడు మోక్షమార్గమునకుఁ
దగు నుపాయంబుఁ జెప్పెడుఁ దథ్య మనుచు. 127

వ॥ అట్లన శ్రీరామచంద్ర ప్రసాదంబునం జనిత విజ్ఞానంబునం జెప్పెద. 128

కం॥ రాముఁడు సత్యబ్రహ్మ
శ్రీమూర్తియుఁ గేళిరచిత చిరతరమాయా
తామరసజాండ రక్షకుఁ
డిమ్మెయి వర్తించు విష్ణుఁ డెఱుఁగుచు బుద్ధిన్. 129

కం॥ శ్రీవిష్ణుని నిత్యాకృతి
భావింపఁగ రామనామ భవ్యతనువిలా
సావిర్భవంబు నవతా
రావళిలోఁ గపటతనువు యదుపతి యయ్యెన్. 130

సీ॥ ఆదితేజము దివ్య మానందనిధి బ్రహ్మ
మజ మనంతము సత్య మద్వయంబు
విభుని నిత్యంబు చిద్విభవంబు పూర్ణంబు
నైన కేవలతత్త్వ మరయ నాది
నారాయణుని పూర్వనామ మైనట్టి శ్రీ
రామనామమున నేర్పడిన రూప
మంతరారాములు నంతర్మహాజ్యోతు
లునునైన యోగీంద్రజనుల కోర్కి

గీ॥ యదియె తద్రామమంత్రమౌ ననఘులార!
తారకబ్రహ్మ మెఱుఁగుఁడు తదఖిలషిత
లలితకైవల్యలక్ష్మీ విలాస సిద్ధి
దంబు వేదాంతసార మంత్రములలోన. 131

గీ॥ కలవు మంత్రంబు లెన్నైనఁ గామితార్థ
సంపదల నిచ్చు నట్టివి జగతిలోన
నెవ్వియును మోక్ష మీఁజాల వెఱిఁగికొనుఁడు
తారకబ్రహ్మ దివ్యమంత్రంబె కాని. 132

మ॥ ఘన మంత్రౌఘములందు వేదజననిన్ గాయత్రి నిష్టార్థ దా
యినిగాఁ జెప్పుదు రాగమజ్ఞు లది పృథ్వీదేవరాజన్య వం
శ నిజాచార నియుక్త గావున సమస్త గ్రాహ్యయై ముక్తిసా
ధన సంపత్తి వహింప నేర దెపుడున్ దత్తారక ప్రౌఢిమన్. 133

గీ॥ సప్తకోటి మహామంత్ర జాలమునకు
రాజు నారాయణాష్టాక్షరంబ యండ్రు
సప్తకోటి మహామంత్ర జాలమునకు
రాజు శివనామ పంచాక్షరంబ యండ్రు. 134

వ॥ ఇంత ప్రభావంబు దీని కెట్లు కలిగె నంటిరేని యవి తారకబ్రహ్మ మంత్రోపాసన జ్ఞాన సాధనంబులు. 135

సీ॥ దురిత సంసారంబు తరియింపఁ జేయఁగా
బ్రహ్మ స్వరూపమై పరగు కతనఁ
దారకబ్రహ్మాభిధానమై శ్రీరామ
మంత్రోత్తమం బాగమముల వెలయు
బ్రహ్మహత్యాది పాపము లాచరించిన
ఖలులకు నజ్ఞాన కలుష హృదయ
పశు పక్షి కీటక పర్యంత జంతు సం
తతికి విద్యాబలోదారతాది

గీ॥ మద సముద్వృత్త కామాంధ మానసులకుఁ
బ్రాణవిరతిని దారకబ్రహ్మ మిది స
ముచ్చరించిన దండ నన్యఁడు నిజేచ్ఛ
నుచ్చరించినఁ గల్గు సాయుజ్యలక్ష్మి. 136

కం॥ సూరులు కొందఱు విను ఁ దోం
కారంబును మహిత తారకబ్రహ్మముగా
నారసి చెప్పుదు రయ్యోం
కారము దుష్కర్మ తారకం బగుచునికిన్. 137

వ॥ కేవల తారకబ్రహ్మ మంత్రంబు జప్యంబై మోక్షం బీనేరదు గాని యీ యోంకారంబు సహకారియై ప్రాణనిర్యాణ సమయంబున నిజాధిదైవతంబగు నారాయణుని దలం పుచుం దన్నుచ్చరించిన పరమ యోగీంద్రులకు సుగతికిం గారణంబగు నది యెట్లంటి రేని.

శ్లో॥ ఓమిత్యేకాక్షరంబ్రహ్మ వ్యాహర న్మా మనుస్మరన్
యః ప్రయాతి త్యజ న్దేహం స యాతి పరమాం గతిమ్॥

అని భగవద్వచనంబు కలదు. అదియునుంగాక మంత్రాద్యక్షరం బగుటంజేసి యా యోంకారంబు తారకబ్రహ్మంబు గాక శ్రీరామమంత్రంబె తారకబ్రహ్మం బగుట యెట్లంటిరేని.

శ్లో॥ ముమూర్షో ర్మణికర్ణేతు మణికర్ణ నివాసినః
అహం దిశామి తన్మంత్రం తారకబ్రహ్మ వాచకమ్॥

అని తారకబ్రహ్మ మంత్రోపాసకుండగు శివుండు తనకు విశ్వరూపంబు చూపిన శ్రీ రామవిభుని సమ్ముఖంబునఁ జతుర్ముఖ ప్రముఖ బ్రహ్మ యోగీంద్ర బృందారక పరి షన్మధ్యంబున విజ్ఞాపనంబు చేసిన వాఁడు కావున నిస్సంశయంబుగా నెఱుంగుదు శ్రీ రామమంత్రంబె తారకబ్రహ్మ మంత్రంబు. 138

కం॥ మణికొందఱు శివపంచా
క్షర మంత్రము తారకంబుగాఁ జెప్పుదు రు
ర్వర నట్లేనియు శంభుని
పరమోక్తికి నప్రమాణ భావము వుట్టున్. 139

సీ॥ ప్రణవంబు మణిమయ భద్రాసనం బాగ
మఖ్రేణి నిత్య సామ్రాజ్య లక్ష్మి
యారూఢ నారాయణాష్టాక్షరము శివ
పంచాక్షరమును నాప్త ప్రధాన
రత్నముల్ చామర గ్రాహిణి గాయత్రి
యితర మంత్రము లెల్ల భృత్య గణము
రాజతేజంబు శ్రీరామ ప్రభావంబు
సాధ్యంబు కామాది శత్రు కులము

గీ॥ ప్రతిదినోపాసకులు పరబ్రహ్మ మునులు
తత్ప్రదేయార్థ మపవర్గ ధన్యపద మ
హాధిపత్యంబు గాఁగ మూర్ధాభిషిక్త
మహిమ శ్రీతారక బ్రహ్మ మంత్ర మొప్పు. 140

సీ॥ తారకబ్రహ్మ మంత్రము మహాబల మూర్తి
పాపధరాధర పటలిఁ గూల్చుఁ
దారకబ్రహ్మ మంత్రము దహన స్ఫూర్తి
నేనోవన శ్రేణు లెల్ల నేర్చుఁ
దారకబ్రహ్మ మంత్ర ప్రభాకరలీల
దురితాంధకారంబు తొలఁగఁ ద్రోయుఁ
దారకబ్రహ్మ మంత్రము భిదుర ప్రౌఢిఁ
గలుష గోత్రములు భగ్నములు సేయుఁ

గీ॥ దారకబ్రహ్మ దివ్యమంత్రము భవాబ్ధి
తరణి శ్రీరాముఁ డురుకర్ణ ధారి సుమ్ము
తారకబ్రహ్మ దివ్యమంత్రము జపించు
వాఁడు శివునట్ల బ్రహ్మభావము వహించు. 141

కం॥ కావున మీ రీ మంత్ర
శ్రీవిభవముచేత మోక్ష సిద్ధిఁ గనుఁడు కా
శీ వాసంబున శంభుఁడు
[1]జీవత్యాగులగు మీకుఁ జెవి నుడువంగన్. 142

---

142 ప. (1) ''జీవ త్యాగులకు మీరు చెవినొడవంగన్'' అని వ్రాతప్రతి పాఠము.

వ॥ అనిన వాలఖిల్యులు విస్మితులై మహానుభావా! మారట శంభుండవు నీ వెఱుంగు యర్థంబు లేదు. నీ వచనంబు వేదాంత ప్రమాణంబై కుమతవాదన విభేదన ప్రవీణంబై సత్యజ్ఞాన సాధనంబై యున్నది. నీవు పలికినట్లు తారకబ్రహ్మ మంత్ర ప్రభావం బట్టిద. దివ్య ప్రభావంబుగల శివుండు శ్రీరామ తారక దివ్య మంత్రోపాసనం దేల యయ్యె? కాశీ క్షేత్రంబున నునికింజేసి సకలజీవులకుం బ్రాంతంబునం దారక బ్రహ్మ మంత్రోపదేశంబున మోక్షం బొసంగ నేమి పని? చతుర్విధ పురుషార్థ ప్రదంబులగు శ్రీశైల విరూపాక్ష శ్రీకాళహస్తి కాంచీ పంచారామ మహాకాళ స్థానాది శైవక్షేత్రంబులును శ్రీరంగ వేంకటాచలాహోబల పాండురంగ సర్వవర సింహాచల శ్రీపురుషోత్తమ ప్రభృతి వైష్ణవక్షేత్రంబులు పెక్కులు ప్రసిద్ధంబులై యుండ నిమ్మంత్ర సిద్ధికి కాశీక్షేత్రంబె యుత్తమం బగుట యెట్లు? శ్రీరామ విభుండు శివున కే సమయంబున నేమి కారణంబున విశ్వరూపంబు చూపె? నీ సకలంబు నాన తీయ వలయు ననిన గుంభసంభవుండు వారల కిట్లనియె. 143

కం॥ తన దివ్యత గనవచ్చిన
మునికిన్ భృగువునకు నలిగి మోసము నొందెన్
మును శివుఁడు తమోమయతన్
స్వ నిజ బహ్మాదిశక్తి గాలమి చేతన్. 144

వ॥ అది యెట్లంటేని 145

సీ॥ కనకాద్రి నొకనాఁడు గంగాతటంబున
మునులెల్లఁ గూడి త్రిమూర్తు లందు
మనతపఃపూజలు గొని ఫలం బొసఁగుచు
నిత్యవంసేవ్యమై నెగడు దివ్య
విలసనం బెయ్యది వివరింతమని భృగు
[1] సంయమీంద్రుని దపోంశ ప్రకాశు
నంపిన నతఁడు శివాలయంబున కేగి
[2] సకళత్రు నద్దేవుశక్తిఁ జూడఁ

---

146 వ. 1) సంయమిని (వ్రా. ప్ర) గణభంగము సంయమీంద్రుని (స)
,, (2) వకలత్రుణదేవు (వ్రా ప్ర) సకళత్రు నద్దేవు. (స)

గీ॥ తన్ని తత్ఫాలలోచన దహనమునకు
స్వపదతలనేత్ర పావక జ్వాలఁ*(జూపి)
సేవ్యుఁడవు గావు ముక్తి వాంఛింప నీ ప్ర
సాదము నయోగ్య మగునని శాపమిచ్చె. 146

గీ॥ తమ్మిరాచూలి నట్లన తన్ని తత్ప్ర
చండ కోపంబు వారించి శాప మిచ్చె
ధరణిఁ బూజా సమస్కార విరహితుండ
వగుము నీ వని యరిగె నవార్య మహిమ. 147

క॥ శ్రీవిభు నట్లన తన్నెన్
[1]ధీ (వెలయఁగ మునిమనంబు) దెలిసి యతఁడు సం
సేవింపఁ గలిగె సుముఖత
భావింప వపజ్ఞ గలదె బ్రహ్మమయునకున్. 148

చ॥ వదలని యా మునీంద్రుని యవార్యతరాగ్రహ శాపపీడచే
నదిమొద లాత్మఁగుందుచు సుధాంశు కళాధరుఁ డౌర్వవహ్ని లోఁ
బొదలు సుధాంశురాశియును బోలెఁ జరింపుచు నొక్కనాఁడు స
మ్మదమున విష్ణునిం గనియె మౌనిసమర్చితుఁ గాశిలోపలన్. 149

క॥ ఆనందవనములోపల
[2]నానందము (నంది వివశుఁ డగుచున్) విమల
జ్ఞానామృత రసముదితుం
డై నిశ్చల యోగరూఢి నలరెడు వానిన్. 150

గీ॥ కాంచి తద్ఘోర శాపదుఃఖంబు మాపఁ
దారక[3] (ంబను) దివ్యమంత్రంబు వడసి
యెలమి నగజకుఁ దన్మంత్ర మిచ్చెఁ దానె
మహికి గురుఁ డయ్యె శంభుఁ డీ మంత్రమునకు. 151

---

146. * జూచి (వ్రా)

148. 1) ధీ విలయము నీమతంబు (వ్రా.పా) ధీవెలయగ మునిమనంబు (ప)

150. 2) నానాదంబునది ఎమగుచో (వ్రా.పా) పరిష్కృత పాఠము కుందలీకృతము.

151. 3) (ంబను) (పూ)

కం॥ అనవుడు నమ్మని కిట్లని
రనఘా! యేమిటికి విష్ణుఁ డచ్చో నుండెన్
వన మానందాఖ్యంబై
చను చెట్టచ్చోటి కేల శంభుఁడు వచ్చెన్. 152

వ॥ తత్ప్రకారంబు మాకు సవిస్తరంబుగా నెఱింగింపవలయు నని యడుగుటయును. 153

చ॥ కరిహననోచ్చలన్మకరఖండన! [1] చండతరోరుచక్ర భా
స్వర! వహజ్రప్రతాప రవిసమ్ముదితాశ్రిత చక్రకామినీ
కర చరణాంఘ్రి మందర జగద్ధిత కార్య సుధాంబురాశి మం
దరధర! భానుసూను వరదా! వరదానవ మానభంజనా! 154

కం॥ [2] విద్యాదివేద్య! వంద్య! య
యోధ్యాపురనాథ! పరమయోగీశ్వర చి
త్త[3]ధ్యేయ! ప్రతాపవిజిత
మధ్యందిన రవిసహస్ర! మరకతనీలా! 155

తోటకము॥ పరిహాసరస ప్రకటీకృత [4]ము
ద్ధరణీతనయా తరళాంగ లతా
పరిరంభ సుఖప్రవవత్పులకాం
కుర విగ్రహ సంకుచిత స్వధృతీ! 156

గద్యము. ఇది శ్రీమదనగోపాల చరణకమల సేవాధురీణ సత్కళాపారీణ కృష్ణభట్టారక పౌత్ర చింతలపూడి కామయప్రభు సుపుత్ర శుద్ధసారస్వతవిభవ రాధామాధవ ప్రణీతంబైన తారకబ్రహ్మరాజం బను మహాప్రబంధంబునందు ప్రథమాశ్వాసము.

---

154. 1) చండగదోరు (ప్రా) చండతరోరు (ప)
155. 2) విద్యాదివేద వంద్య (ప్రా) విద్యాదివేద్య వంద్య (ప)
3) ద్వయ (ప్రా) ధ్యేయ (ప)
156. 4) ముధరణీ (ప్రా) ముద్ధరణీ (ప)

# తారకబ్రహ్మరాజీయము

## ద్వితీయాశ్వాసము

కం॥ శ్రీభూతనయా నాయక!
భూభారోత్తారణార్థ భూపాల తను
శ్రీభరిత! భక్తవత్సల!
సౌభాగ్య విశాల! రామచంద్ర నృపాలా! 1

వ॥ దేవా! విన నవధరింపుము. పరాశర మునిశ్రేష్ఠుండు వసిష్ఠ శిష్యుండైన వామ దేవునకుఁదరువాయి కథ విను మని యిట్లనియె. 2

సీ॥ అమ్మహామునులకు ననియెఁ గుంభజుఁడు మీ
రవధానమున వినుం డాదికాల
మున నా వనంబున వనజాసనుఁడు చేయు
రాజసూయాధ్వర రక్ష కతన
చేతఁ బ్రార్థితుఁడై వసించె విష్ణుం డది
యానంద మొనరింప నలరి దాని
కానంద నామధేయము చేసి విడువక
[1] (యవిముక్త) మీ క్షేత్ర మని వచించె

గీ॥ నతని చేతఁ బ్రకాశించె నా పురంబు
కాశి యను పేరఁ బరఁగె జగమ్మునందు
గీర్తితం బయ్యె వైష్ణవ క్షేత్ర మగుచుఁ
గామిత శ్రీకరంబు కాశీ పురంబు. 3

వ॥ అచ్చటికి శివుఁడు వచ్చిన కారణంబు వినుండు. 4

మ॥ ధరణీ దే[2] (వి కరారవిందము) తదుద్యద్మౌళి వజ్రంబో భా
స్వరమున్ శుద్ధము నైన బ్రహ్మరుచి[3] పుంజం బైశ్వరంబైన యీ
గిరియై యుండెనో నాఁగఁ గల్పతరు సంకీర్ణంబు[4] గంగాంబుశీ
కరకీలోత్కర మారుతంబు నగు నా కైలాస మొప్పుం గనన్. 5

---

3–(1) యిది ముక్తి. (వ్రా) యవిముక్త (ప)

5–(2) (     ) లుప్తపూరణము. (3) పుంజస్వరంబైన (వ్రా)
పుంజంబైశ్వరంబైన (ప)
(4) (     ) (గంగాంబుశీకర) లుప్తపూరణము.

చం॥ నిఖిల మృగవ్రజ గ్రసన నిష్ఠుర సింహ వినిర్భరార్భటీ
ముఖర దరీ సహస్రసప్త[1] (ల ము) జగముల్ భయమందు నా గిరిన్
సుఖతర కిన్నరీకృత విశుద్ధ పురారి[2] శశాంక గీతికా
సుఖ సురభూజ భృంగరుత సంగతి ప్రీతి నొనర్చు నెంతయున్. 6

కం॥ అందుఁ దగ విశ్వకర్ముఁడు
సందీప్తానర్ఘ రత్న జాలంబులచే
నందముగా రచియించిన
మందిరమున నొక్క సౌధ[3] (మణి) వేదికపై. 7

తం॥ త్రిభువన రక్షార్థము ప్రా
ణి భయంకరులైన త్రిపుర నిర్జర రిపులన్
రభసమున[4] నొడిచి వేల్పుల
కభయ మొసఁగి వచ్చియుండి యానందమునన్. 8

ఉ॥ గారవమొప్ప మానిత శిఖామణులందు నగేంద్ర పుత్రికిన్
గూరిమి మైత్రిఁ గానుకగఁ గొమ్మని యిచ్చి మణిద్వయంబునన్
దోరపుఁ గర్ణపూరములు తోయజపుష్పనిభంబు లింపు సొం
పారఁగఁ దాల్చి తాండవము నంచిత వైఖరి నాడె వేడుకన్. 9

స్రగ్ధర॥ గోత్రాచక్రంబు చక్రాకులగతిఁ దిరిగెన్ ఘూర్ణిల న్వారిరాసుల్
గోత్రాళుల్ ప్రీలి మ్రొగ్గెం గుబిలపడె దిశాకుంభు లంభోదముల్
క్షత్రంబుల్ మిత్రముఖ్యగ్రహములు చెదరెన్ గాంధికాత్ములై రా
వృత్రారాత్యాద్యష్టదిక్కుల్ విషమ దృగసమోద్వృత్త నృత్తైకకేళిన్. 10

---

6—(1) (లము) లుప్తపూరణము. (2) జయాంక (పా)

7—(3) మధ్య (వ్రా) మణి (ప)

8—(4) నొడవి (వ్రా) నొడిచి (ప)

కం॥ ధరఁ దిరుగఁగఁ గైలాసము
తిరుగఁగ గిరిమీఁద శివుఁడుఁ దిరుగఁగ బురచం
దురుఁడుఁ దిరుగఁ దాండవమును
గర మరుదుగఁ జూచు సురల[1] కన్నులు దిరిగెన్. 11

చం॥ నభమునఁ బుష్పవృష్టి సురనారులచేఁ గురిసెన్ సుపర్వ దుం
దుభులు చెలంగె నందికరతోయజ తాడిత మర్దళ ధ్వని
ప్రభవ పయోద గర్జ[2] (లకుఁ) బైకొని యాడెఁ గుమారపత్రి యా
విభు శుభకేళి తాండవము వేళ విధిప్రముఖుల్ నుతింపఁగన్. 12

కం॥ పూర్ణకృత నాట్యమున సము
దీర్ణప్రభ దివికి నెగసి దివ్యులు చూడన్
గర్జాలంకృత నవమణి
కర్ణిక యొక టూడి పడియెఁ గాశీపురిలోన్. 13

కం॥ మణికర్ణిక యపుడు నభో
మణికర్ణిక యట్లు భూమిమండలిఁ బడినన్
ఫణిరా[3] జ కంకణుఁడు త
క్షణమున నయ్యాట యుడిగి కడురభసమునన్. 14

కం॥ కేలన్ శూలము వెలుఁగఁగఁ
గేళిగతిన్ వచ్చెఁ గాశికిన్ వచ్చి వడిన్
నాళీక నాభు ప్రమొక్కెన్
నేలం బడియున్న దాని నెలవున కేగెన్. 15

వ॥ అట్లేగి యట మున్న యానందవనంబున నున్న లీలావైభవుండగు విష్ణుండు యోగీంద్ర గణంబుతో నా మణికర్ణిక దివ్యప్రభాపూరంబున సలిలాభిపూర్ణ సరోవరంబు కైవడి నుండఁ గన్నుల పండువుగాఁ జూచు సమయంబున డాయంబోయె నప్పుడు నయ్యిరువురకు నన్యోన్యాలింగనాది సంభావము గలిగె. తదనంతరంబ శంభుండు పుండరీకాక్షున కిట్లనియె. 16

---

11—(1) క....లు. (వ్రా) కన్నులు (ప)

12—(2) గర్జ (...) (వ్రా) గర్జలకుఁ (ప)

14—(3) రాజు కఖఞుఁడు (వ్రా) రాజ కంకణుఁడు (ప)

కం॥ సత్కాంతి వెలుఁగునది దా
మత్కర్ణ విభూషణంబు మణికర్ణిక నా
ద్యోత్కట మగు గతిఁ బడుటయుఁ
దత్కౌతుకము నన్ను దెచ్చెఁ దత్సన్నిధికిన్. 17

వ॥ అనిన విష్ణుండు ప్రసన్నుండయి యుష్మదస్మత్సమాకలనంబు జగదేక కారణం బయ్యె నీ మణికర్ణికచేత నీ క్షేత్రం బత్యంతాలంకృతంబు నతిపవిత్రం బయ్యె. ఇది యచ్చోటన యుండనిమ్ము. దీనిపేర మణికర్ణికాతీర్థంబు త్రిలోకపావనం బయి ప్రసిద్ధం బయ్యెడు. దీనిని తూలంబునం బాతాళంబునకు నొత్తు మనిన శివుం డట్లచేసె. నదియు నొక్క మడుగై సముత్పన్న జలాభిపూర్ణంబై శోభిల్లె. దానిఁగని హర్షించు శివునకు నింతియ కాదు. దీనిపై దేవనదీ ప్రవాహంబును గొంత కాలంబునకుఁ బ్రవహింపఁగలదు. అట్లగుటంజేసి యీ కాశీక్షేత్రంబు పంచక్రోశమధ్యంబు [1] గంగా మణికర్ణికాతీర్థంబులచేత భూలోకంబునంగల పుణ్యక్షేత్రంబుల కెల్ల నుత్తమంబై చతుర్విధ పురుషార్థంబుల నొసంగు ననియె నంత కైలాసంబున శివుని తాండవంబు చూచు బ్రహ్మాదిదేవమునీంద్రులు ప్రమథగణంబులుం బార్వతీదేవితోడం గూడి యా నెలవునకు వచ్చి తత్ప్రకారం బంతయు సమీపమునిశ్రేష్ఠులవలన విని విష్ణుదేవునిం బ్రశంసించిరి దివ్యకాంతలు మణికర్ణికాతీర్థంబుపైఁ బుష్పవర్షంబులు గురిసి రప్పుడు. 18

కం॥ తన మదిఁగల భృగుముని [2]శా
ప నితాంత వ్యథ దలంచి బ్రహ్మాదుల యొ
ద్దనె [3]విష్ణునిచేఁ గ్రమ్మరఁ
బునర్జగత్పూజ్యభావమున వర్తింతున్. 19

---

18. 1) గ.... (వ్రా) గంగా (ప)

19. 2) కావ (వ్రా) శాప (ప)

3) విష్ణుని గ్రమ్మర — విష్ణునిచేఁ గ్రమ్మర (ప)

కం॥ అని తన హృదయము చెప్పిన
వనజాక్షుఁడు త్రిభువనైక వంద్యుఁడవు జగం
బున నీ కంటెను బూజ్యుం
డును గలఁడే విడువు నీ మనోవ్యథ యింకన్. 20

సీ॥ నినుఁ బ్రతిష్ఠించిన నిన్నుఁ బూజించిన
నిను భక్తి గొలిచిన నేఁడు మొదలు
పద్మసంభవ కీటపర్యంత జీవులు
నఖిల పదవులు రాజ్యమును వివిధ
సంపదల్ సంతత సౌఖ్యముల్ విభవముల్
గలుగు నైశ్వర్యాష్టకంబు నిదియు
విశ్వనాథుఁడ వీవు విశ్వంబు పాలింపు
మగజ విశాలాక్షి యనఁగ నెగడుఁ

గీ॥ గాశికాభర్త వగుము మోక్షంబు నిచట
నీవె ప్రాణుల కొసఁగుము నియతి ననుచు
తారక బ్రహ్మ దివ్యమంత్రం బొనంగె
శివునకై విష్ణుఁ డాచార్యశేఖరుండు. 21

వ॥ తదనంతరంబ. 22

శా॥ శ్రీకాశీపతి విశ్వనాథు శివు సంసేవింపుఁ డిచ్చోఁ ద్రిలో
కైకస్తుత్యుఁ బ్రతిష్ఠసేయుఁడు సముద్యద్భక్తి నిత్యంబు మీ
రేకాగ్రస్థితిఁ బూజసేయుఁడు నిజాభీష్టార్థ సంపత్కళల్
చేకూరంగఁ దదీయ లింగతనువున్ జిత్తానుకూల్యంబుగన్. 23

గీ॥ భృగువు శాపాంశ మొకటి తప్పింప రాదు
శంభునిర్మాల్య మెల్ల దోషంబు దాల్పు
ననుటకును బ్రాహ్మణ క్షత్రియాన్వయులకుఁ
దక్క నితరుల కెల్లఁ బాతకము లేదు. 24

కం॥ వారును బూజావిధి నిం
పారఁగ [1]ము(ను)జూచి మ్రొక్కి [2](యర్ఘ్య)స్థలి నె
వ్వారును ద్రొక్కని చోటం
డా రిడఁగావలయు నియమతత్పరబుద్ధిన్. 25

చ॥ అనిన మహాప్రసాద మని యంబుజసూతియు వేల్పులున్ మహా
మునులును [3](విష్ణుదేవునకు) మ్రొక్కి తదాజ్ఞ శివప్రతిష్ఠ నే
ర్చున నిజనామమంత్రములఁ బొందఁగఁజేసి బహుప్రకారపూ
జన లొనరించి రప్పు డతిసంభ్రములై మణికర్ణికాతటిన్. 26

కం॥ ఏలాగు పూజ నైనన్
ఫాలాక్షుఁడు మెచ్చుఁ బూజ్య భావాపేక్షన్
లోలుఁడయి పూజసేయు జ
నాళికి నపవర్గత్రయము నలతిన యిచ్చున్. 27

కం॥ ఆదిమొదలు కాశికాపురిఁ
గదలక యా శివుఁడు తారకబ్రహ్మము భ
క్తి దలిర్పఁగఁ బురుషార్థ
ప్రదముగ జపియించుచుండుఁ బణతియుఁ దానున్. 28

కం॥ నాళీకలోచనుండును
ఫాలాక్షుని మీది ప్రేమఁ బాయక కాశిన్
లీలావిగ్రహమున ముని
జాలము సేవింప యోగసంపద నుండెన్.

ఉ॥ అంత భగీరథుండును నిజాన్వయజాతులఁ గర్దమాత్మజా
త్యంత దురాగ్రహోదయ గతాసుల సద్గతి కంపఁ దెచ్చె దు
ర్దాంత తపః ప్రభావమున బ్రహ్మవరంబున నభ్రగంగ నా
కాంత [4]చలత్తరంగ దురితావళు లెల్లఁ దొలంగ భూమికిన్. 30

---

25—(1) ముజూచి (వ్రా) మునుజూచి (ప)

(2) (యర్ఘ్య) పూ. (ప)

26—(3) (విష్ణుదేవునకు) పూ. (ప)

30—(4) చలంతరంగ (వ్రా) చలత్తరంగ (ప)

కం॥ శ్రీమత్కాశీ పరిసర
భూమిన్ మణికర్ణి నొరసి పుణ్యసరిద్ర
త్నామరనది ప్రవహించె మ
హామహిమకు విశ్వనాథుఁ డాహ్లాదింపన్. 31

సీ॥ శ్రీవిశాలాక్షి కెంజేయి రొమ్మున నిడి
యంతఃపరీతాప మణఁగఁ జేయు
గంగ కేళీకర కమలంబుచే [1] (వీచి)
చిత్త మానందంబు చెందఁ జేయు
మరణభయార్తి సంస్మరణంబు లేకుండ
భృంగి ఫాలంబునఁ బెట్టు భూతి
తారకబ్రహ్మ మంత్రము చెప్పుఁ గుడిచెవి
శివుఁడు మోక్షశ్రీ వశీకరింప

గీ॥ నఘము వెడలంగ లింగదేహము తొలంగె
సరవితోడ రజస్తమస్సత్వమూర్తు
లంది యవియును విడిచి బ్రహ్మను భజింప
జీవునకు సంతతంబు కాశీపురమున. 32

వ॥ అనిన వాలఖిల్యులు 33

కం॥ శ్రీకాశీ మృతులెల్లన్
జేకొను శివమూర్తి యంచుఁ జెప్పుదు రిట బ్ర
హ్మాకారంబును విష్ణుని
యాకారము నొచ్చి బ్రహ్మ మగ బెట్లొక్కొ. 34

గీ॥ పూర్వ జన్మంబులను గడ పుట్టువులను
కడఁగి చేసిన పాతకౌఘములు నరక
మనుభవింపక పాయు టెట్లాక్షణంబు
జీవునకుఁ గాశిలో ముక్తి చెందునపుడు. 35

---

32 — (1) (పీచి)పూ.

చ॥ అనవుడుఁ గుంభజుం డనియెఁ బ్రాణి[1]జనుశ్శత కోటులందు సం
జనితములైన ఘోరకలుషంబులు నా జననంబులందుఁ జే
సిన దురితంబు భైరవునిచేతఁ ద్రిశూలము పోటు నొప్పి చే
కొని నరకార్తిఁ బొందఁగడు ఘోరముగా ఘటికాద్వయంబునన్. 36

వ॥ కాశీక్షేత్రంబు శివుని యపరావతారంబగు కాలభైరవుండు ప్రాణ విరతి కాలంబున నా జన్మంబు తుదగా జన్మపరంపరలం జేసిన బ్రహ్మహత్యాది పాతకంబుల కొలఁది ననుభవింపఁ దగిన రౌరవాది దారుణ బాధలు ముహూర్త మాత్రంబున ననుభవించు నట్లుగా స్థూలదేహ లింగదేహంబుల తోడంగూడ జీవునిం ద్రిశూలంబునం [2]బొడిచి (పట్టు) నది భైరవ నరకం బనం బరంగు. దాన దేహద్వయంబున విడిచి విమలుండైన యా జీవుండు తమోగుణ విలసితుండైన శివుని యాకారంబు వహించి యవ్వల రజోగుణవిలసితుండైన ప్రజాపతిమూర్తి [3]నెనసి సత్వగుణ విలసితుండైన నారాయణుని దివ్యరూపంబు నొచ్చి తుది బ్రహ్మతేజంబునం గలియు నట్లు గావునఁ గాశీ క్షేత్రంబు తారకబ్రహ్మ మంత్రోపావనంబునకు మత్తమక్షేత్రం బనిన వారలిట్లనిరి. 37

కం॥ హరి హరు లిరువురు సముబలు
లరయంగ నిటువంటిచోట నమ్మంత్రము దా
హరిహరునకు నిజగురువై
యిరవుగ నుపదేశ మెట్టు లిచ్చెను జెపుమా ! 38

వ॥ అనినఁ గుంభసంభవుం డిట్లనియె. 39

శా॥ సత్యంబై విభువై యనంతమయి తేజఃపుంజమై దివ్యమై
[3] (నిత్యంబై) వెలుగొందు బ్రహ్మమున నున్నింద్రప్రభావ్యాధులై
దైత్యారాతి విధీందు శేఖరులు విద్యాస్ఫూర్తి నుద్భూతులై
రత్యంత స్థితి సృష్టినాశకరులై యాదిన్ గుణోత్కర్షతన్. 40

---

36— 1. జనాశత. (బ్రా) జనుశ్శత (ప)

37— 2. బొడిచివది. (బ్రా) బొడిచిపట్టునది (ప)

40— 3. ........వెలుగొందు (బ్రా) నిత్యంబై వెలుగొందు (వ)

సీ॥ సత్వంబు విమల విజ్ఞాన కారణము వి
శుద్ధ భాస్వర వర్ణ శోభితంబు
రజము దురంతపుఁగారణ మరుణద్యుతి
యజ్ఞాన కారణంబైన తమము
హరినీలరత్న సుందరము సత్వంబున
ధైర్య మాస్తిక్యంబు దాంతి శాంతి
సుప్రసాదంబులు సుఖసుమ బోధము ర
జంబున రాగదోషములు దరల

గీ॥ భావముమ బుట్టుఁ దమమునఁ బ్రభవ మొందు
నలసతాజాడ్య నిద్రాదులందు సత్వ
గుణ గరిష్ఠుడు హరి, రజోగుణయుతుండు
బ్రహ్మ శివుఁడు తమోగుణ ప్రకటమూర్తి. 41

వ॥ అవ్విధంబున సుజ్ఞాన కారణ సత్వగరిష్ఠుడు గావున విష్ణుండు తామస ప్రకృతియగు శివునకుఁ బరమజ్ఞానాత్మక మంత్రోపదేశంబునకు గురుండయ్యె. అదియుంగాక పరమ పురుషుండు స్వతంత్రుండు గావున లీలార్థంబు నిజమాయా విలాసంబునం బెక్కు-రూపంబులై పెక్కంద్రు బ్రహ్మల నుత్పాదించి యనంతకోటి బ్రహ్మాండంబుల నిర్మింపంజేసి తాన రక్షింపుచు నప్పటప్పటికి వాని మాయింపఁ బెక్కంద్రు రుద్రులం గల్పించె నీ సృష్టియందుఁ గొందఱు సత్వాంశ జాతులై దివ్యయోగీంద్రులు శమదమాది సంపత్తి నుత్తమ సాత్విక తపశ్శక్తిం దత్వజ్ఞానంబునఁ దమ్ము భావించి మోక్షంబు వడయు వారును గొందఱు సమసత్వాంశ రజోంశ జాతులై యింద్రాది దివ్యులై రాజ ఋషులై యధ్వరాది సుకర్మంబు లాచరింపుచు సాధు హింసాపరుల శిక్షింపుచు గమనాగమనంబు లొనర్చుచు నుచిత సుఖంబునం బ్రవర్తించువారును, గొందఱు రజోగుణాంశ జాతులై గంధర్వ యక్షాదులై యిహలోక సౌఖ్య లోలహృదయులై చంచల స్వభావంబునఁ బరలోక సౌఖ్యంబుల సంశయింపుచుఁ బరలోక సుఖసాధన సత్కర్మంబులు చేసియుం జేయక వివిధవాహన స్రక్చందన వనితాదులం దాసక్తులై యుండు వారును [1]గొందఱు రజస్తమో గుణ జాతులై బలిప్రముఖు లతిచంచలులై మదన రాగ ద్వేషానూయాదులుగలిగి యుచితానుచిత కర్మంబులు నడుపుచుఁ బరమప్రేరి

తంబగు సంగమభోగంబులు గైకొనుచు బలాత్కారంబునఁ జేయవలసిన సుకర్మంబు లన్యులచేతఁ జేయింపుచు నర్థాపేక్షనే యుండు వారును, గొందఱు తమోగుణాంశ జాతులై మ్లేచ్ఛ నీచ రక్షః పిశాచాదులై దురభిమాన ఘూర్ణమాన మానసులై యజ్ఞానాంధకారంబున మునింగి దూరతోపాత్త సమస్త పుణ్య జ్ఞానానుసంధాను లగుచు మీదెఱుంగక కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్య గ్రస్త [1]స్వాంతులై తామస ప్రకృతి నకృత్యంబు లెల్లం జేయుచు దయా సత్య శౌచంబులులేక హింసాపర్వతంబున మృగయాదు లొనర్చుచుఁ బ్రాణికులంబుం జంపుచుఁ బరమకౌతుకంబుగా వర్తించు వారునుంగా నడచుచుండు నేతద్రూపంబైన సంసారసాగరం బజ్ఞానకారణంబు తారక మంత్ర తరణిం దరింపం జేయు నతండె గురుండు తన్మాయా జగదుత్పత్తిస్థితిలయకర్మ వ్యాపారంబుల పట్టున హరి హరులును బ్రజాపతియును సములు లనిన వార లిట్లనిరి. 42

క॥ సర్వమునకు విఘ్నందే
నిర్వాహక బుద్ధి జ్ఞాననిధు లెఱిఁగింపన్
సర్వజనులుఁ దత్సేవా
పర్వోత్సుకు లేల కారు పరమమునీంద్రా॥ 43

వ॥ అనిన నగస్త్యుం డిట్లనియె. 44

క॥ తామసుల కెంత సెప్పిన
నీ మహిత జ్ఞానమార్గ మెఱుకపడదు మా
యా మగ్నులు గావున జ్ఞా
నామల[2]సాత్వికులు గొల్తు రావిభు నెపుడున్. 45

గీ॥ పరమ సాత్వికు లెల్లను బద్మనేత్ర
సేవఁ జేతురు, తామసుల్ శివుని గొల్చి
శక్తిపూజలఁ జేతు రజ్ఞానహేతు
సంపదాదులు మదిఁగోరి [3]జాల్మవృత్తి, 46

---

42– 1 శాంతులై (వ్రా) స్వాంతులై (ప)

45– 2 సాతికుల (వ్రా) సాత్వికుల (ప)

46– 3 జాల్మివృత్తి– (వ్రా) జాల్మవృత్తి (ప)

ఆ॥వె॥ బహుమతంబు లెఱిఁగి బహుజన్మములు గర్మ
నను భవించి హరి దయాంశలబ్ధిఁ
గాశి కేగి తారకబ్రహ్మమున మోక్ష
సిద్ధి వడయు సకల జీవతతియు. 47

వ॥ అనిన వార లగస్త్యునిం జూచి 48

గీ॥ కాశికాక్షేత్ర మట్లుండెఁ గడమచోట్లఁ
దారకబ్రహ్మ దివ్యమంత్రమున ముక్తి
కలదొకో యన్నఁ గలదు తత్కాశిఁ బోలెఁ
గలుగ దసుమత్తతుల కెల్ల వలసినటులు. 49

ఆ॥వె॥ ఆదిదేవుడైన హరి యాజ్ఞ శివుఁడు మో
క్షం బొసంగుఁ దారకమున నియతిఁ
గాన కాశి ప్రాణిగణముల కవ్వారి
సాగినట్టి మోక్ష సత్రశాల. 50

వ॥ కడమభూముల నిమ్మంత్రరాజంబుతోడ నభ్యాసయోగయుక్తులయిన యుత్తమపురుష
లకు మోక్షంబు సిద్ధించు నదియెట్లంటేని. 51

మ॥ శమముం దాంతియు శౌచముం గలిగి విజ్ఞానంబునన్ సజ్జనుం
డమలంబై తిరమైన చిత్తమునఁ దా నా తారకబ్రహ్మ మం
త్రము నిత్యంబు జపించి ప్రాణనియతిం దన్మంత్ర వజ్జిహ్వికా
గ్రము నర్తింప విముక్తదేహుఁడయి మోక్షం బందు నన్యస్థలిన్. 52

కం॥ వినుఁ డీక దన్మంత్రోపా
సన హీనుఁడు నీచుఁడైన జనుఁడును మోక్షం
బును బొందు రామనామము
వినుచుం బ్రాణంబు విడిచి విమలుం డగుచున్. 53

వ॥ దీనికి నొక్క యితిహాసంబు గల దెఱింగించెద నాకర్ణింపుడు. 54

సీ॥ పావనదేశమై పరగు మహారాష్ట్ర
　　భూమిలోపల నొక్క బోయపల్లె
నొక బోయజేని కూర్మికళత్ర మతిచిత్ర
　　లావణ్య సౌందర్య లలిత గణ్య
యింద్రనీలపుబొమ్మ యిది యనం దను జూచు
　　యువజనంబుల కెల్ల నుల్ల మలర
నెఱి మించునట్టి వన్నియబోయ శృంగార
　　మలవడు కలికి యొయ్యారితనము

గీ॥ సంగజోద్దీపనము లై నయట్టి బోయ
[1]యాలి ననబోండ్లతోడ గయ్యాళి చిన్నె
బూమెలును గల్గి ముంగిటఁ బొలయు దానిఁ
జూచి తైర్థికుఁ డగు నొక్క భూసురుండు. 55

చ॥ చదివినవాఁడు జవ్వనము సంపదగల్గియుఁ దా విరక్తుఁ డై
ముదమునఁ గాశి కేగెడు ముముక్షువు కర్మవశీకృతాత్ముఁ డై
మదన శిలీముఖార్తిఁ బడి మానము ధైర్యము దూలి నిల్చి య
మ్మదవతిఁ జూచి క్రమ్మర సమగ్ర మనోభవ గాఢవిక్రియన్. 56

గీ॥ తోడి తైర్థిక జనములఁ గూడి చనక
కార్యమిషమున వారలఁ [2]గడవ ననిచి
యా సమీపమునందు దేవాలయమున
నొక్క కంబంబు మాటుననుండి మఱియు. 57

ఉ॥ దీని [3](యమాన) యౌవనము దీని విలాసము దీని నవ్వులున్
దీని గయాళిచందమును దీని రతోన్ముఖచిత్తవృత్తియున్
మానస మంగజాంబునిధి మగ్నముచేసెఁ దరంగ సంపమై
యే నిఁకఁ దీర్థయాత్రఁ జొర నేక్రియనై నను దీనిఁ గూడెదన్. 58

---

55— 1 యాలలన బోట్లతోటి గయ్యాళిచిన్నె
　　బూతులునుగల్గి ముగ్గియ బొలయుదాని—వ్రాత ప్రతి పాఠము
　　యాలి నన బోండ్లతోడ గయ్యాళిచిన్నె
　　బూమెలునుగల్గి ముంగిటఁ బొలయుదాని....(ప)
57— 2 గణక (వ్రా) గడవ (ప)
58— 3 (యమాన) (పూ)

చ॥ తిరముగఁ దీర్థయాత్రకని తెచ్చిన యర్థము దీని కిచ్చెదన్
సరసపుమాటలం గథలఁ జాల మనంబున కిం పొనర్చెదన్
సరవిఁ దతంతరంగహితచారిణులన్ బ్రియవర్తనంబులన్
గరఁచెదఁ బెక్కుచందములఁ గామిని నన్గవ గూడునంతకున్. 59

క॥ కోరిన కొలఁదిగ వచ్చిన
జారస్త్రీ సంగమంబు సంసార ఫలం
బీరీతి సౌఖ్య మెఱుఁగని
వారలె కాదంద్రు నర్మవాచోయుక్తిన్. 60

క॥ నరకమని చదివిచెప్పిన
ధరణీపతి దండభయము దగిలించియు మా
నరుగాక యధమపురుషులు
హరిహరు లజ్ఞులే రమింపరా పరసతులన్. 61

క॥ పరనారీ సంభోగము
పరమసుఖం బనుచుఁగాదె పట్టుకొనియె నా
సరసిజగర్భుఁడు కూఁతుం
[1]దరలక తమ వావి యెఱుఁగఁ దలఁపకయును దాన్. 62

మ॥ అమరాధీశుఁడు స్వర్గ మేలఁడె యహల్యాజారుఁడయ్యున్ శుచి
త్వముతోడం బరదార సంగమము విద్వాంసుల్ నివారింపుటల్
తమభార్యల్ [2]నియమస్థులైనతము లీలాహీనులం [3]బాయ దో
స మటంచున్ వచియింత్రు నే నెఱుఁగనే సందేహ మిందేటికిన్. 63

సీ॥ శ్రీరామ విభునకుఁ జెయిదోయి యెత్తుదు
మెలఁత కన్నుల [4](సన్న) మోఁగె నేని

62— 1 దరల కతల వోవుదెరుగ దలపగ నంతన్. (వ్రా)
దరలక తమవావి యెఱుఁగఁదలపఁకయును దాన్ (పరిష్కరణము)

63— 2 నియమస్థులై సతత. (వ్రా)నియమస్థులైన తము (ప)

63— 3 బాయుదోసిమటంచు నేనెరుగనే సందేహమిందేటికిన్ (వ్రాతప్రతి)
....బాయదో — సమటంచున్ వచియింత్రు నేనెఱుఁగనే
సందేహమిందేటికిన్. (ప)

64— 4 సన్న. (పూ)

వాణీశ్వరుల కభినందనం బొనరింతు
    నెంత నా ముఖమున నిలిచె నేని
గౌరీశ్వరుని పూజ గావింతు సద్భక్తిఁ
    జెలువ నా కౌఁగిటఁ జేరె నేని
రతిపతిఁ బ్రతిదిన స్తుతుల నారాధింతు
    వెలఁది నా మేలు భావించె నేని

గీ॥ ఇంద్రుఁ బొగడుదు రాగరసేచ్ఛ నింతి
పంచశరుకేళి నను నలరించె నేని
యనుచు వేల్పులఁ దలఁచె నా యవనిసురుఁడు
కువలయేక్షణపైఁ గోర్కి కొనలు సాఁగ. 64

కం॥ ఆ చూపు నతని యునికియు
నా చంచలనేత్ర యెఱిఁగి యనురాగముతో
నా చేరువ కొక్క తెయుఁ బ్రి
యోచితయానమున వచ్చి యుల్లం బలరన్. 65

చ॥ గురుకుచకుంభయుగ్మమునఁ గొంగర జార్చుచు వాలుఁజూపులన్
గరఁచె మహీసురోత్తముఁడు గామిని మర్మ మెఱింగి యాతఁడున్
మరువకు నగ్గమైతి నను మన్ననఁ బోవుము బ్రాహ్మణుండ నీ
కరుణకు నర్హుఁడన్ వికచకంజదళేక్షణ తైర్థికాగ్రణిన్. 66

గీ॥ చెలువ జగమెల్ల మోహింపఁ జేయు నీదు
కలికిచూపునఁ జిత్తంబు గరఁగెఁ జాలు
గురుకుచద్వయిఁ గవ్వము గోర గిల్లు
పల్లవంబున కేటికిఁ బరశుధార. 67

వ॥ అనిన నమ్మత్తకాశిని నిజరూపరేఖాయత్తచిత్తుం డగుచున్న విప్రోత్తమును మోహించియు నతని మోహంబు తమకంబు కొలంది దెలియుటకుం జేరిక మాటల యిట్లనియె. 68

కం॥ మగినాల బోయదానం
దగదు ననుం దగులు కొనుట దయమాలిన పా
ప గరిష్ఠుఁడు నాపతి విను
జగతీసురుఁ [1]దనక తగిలి చంపును నిన్నున్. 69

69— 1 దనెడు- (వ్రా) తనక (ప)

కం॥ నీకై ప్రాణం బిచ్చెద
నాకు విచారింప విప్రనందన పుణ్య
శ్లోకుఁడవు బోయదానన్
నాకై మృతిఁ బొందితేని నవ్వుదురు జనుల్. 70

చ॥ అనవుడు నమ్మహీసురకులాగ్రశిఖామణి కాముజారి నె
మ్మనము మరల్పలేక యభిమానము ధైర్యము దక్కి పల్కె నో
వనజదళాక్షి నీపతి యవశ్యము చంపు డెఱింగితేని ని
న్నెనసిన మీఁద పుష్పశరుఁ డిప్పుడ చంపెడు నేమి సేయుదున్. 71

కం॥ నిను బొందిన పిమ్మటఁ జ
చ్చిన చావొక కోటిసేయు శీతాంశుముఖీ
జనచూడామణి నీ వం
గన నా చావునకు వెఱవఁగావల దనినన్. 72

కం॥ ఆ జగతీసురు మమతకు
నా జారచకోరనేత్రి యపు డియ్యకొనెన్
రాజును దనపతి బోయల
రాజును నా రాత్రిలేమి రయమున రతికిన్. 73

వ॥ అంత నా శబరకాంత యతని నద్దేవాలయంబునందు నుండ నియమించి తన మగఁడు బోయపీటంగల మగవారి నెల్లంగూర్చుకొని కొల్లగొళ్ళకు దూరంబు వోయినాడు నేఁ డెల్లి రాడు. ఇక్కటికిరే యిచ్చోటికి వచ్చెదనని యింటికిఁ బోయి తదుచిత కందమూల ఫలాదుల నెవ్వ రెఱుంగకుండఁ దెచ్చియిచ్చి చనియె ఖరకరుండును దిన చరమ యా మార్ధంబునకు వచ్చె. అప్పుడు విప్రుండు తదనంతరంబున. 74

కం॥ రవి యస్తమించె నాచేఁ
బూవిలుతు జయింపఁ జేయు బుద్ధి గలిగినన్
దివి మందేహాసురులను
సవితృఁడు గెలువంగఁజేతు సమయార్ఘ్యములన్. 75

మ॥ వరిగుజ్జంబులు గాక జేసి యగుటన్ సప్తాళ్వ[1] తే ర్వేగ రా
కరయ న్వచ్చుట నచ్చుట న్నిలుచునో కాదేని యీ యింతి సుం
దరభావం బిడి చూచు [2]నెంజిలిసి[3]మార్తాండుండు వోఁడేమొ జా
ర రతి క్రీడ ఘటిల్లునే నిజతమోఽరాతిత్వ మూహింపఁడే। 76

కం॥ సొనం బట్టిన నాఁడే
భానుని నెంతయును నరుగఁ బట్టక యేలా
మానె సురకారకుం డ
ట్లేవి [4]నహో జాఁబసౌఖ్య మేమన వచ్చున్. 77

చం॥ [5]అనిశము మారునార్తి దహనార్చుల గ్రందుచు బ్రాహ్మణుండు నె
మ్మనము [6] ప్రమోహ హాంబాలమం దవిబోధముకాఁగ [7]దేల గి
ల్లిన కనుదోయితోఁ [8]దరుణి లీలల సోఁకుచునుండె నంత న
య్యినుఁడును గ్రుంకె నాతని సమిద్ధ కులోచిత ధర్మముం బలెన్. 78

సీ॥ లోయత జేగురు బొట్టు గ్రొమ్మించునా
నెఱవంజ కెంజాయ యిరవుకొనియెఁ
దులువ పూఁబోడి చన్నుల ప్రతికృతులనాఁ
దమ్ములు ముకుళీకృతమ్ము లయ్యెఁ
క్షేచ్ఛ పధూటి కన్మెఱుఁగుల సిరులనాఁ
జారు నీలోత్పల చయము లయ్యెఁ
శబరకామిని కచచ్చటల సోయగమునాఁ
గప్పారు చీఁకటి గ్రమ్ముకొనియె

గీ॥ నా మహీసుర సంతాప మరుణభాను
కాంతి శిఖ పోలు నా ద్విజాగ్రణి దివాంధ
మట్లు మదినుబ్బె నా విప్రుఁ డంబుజాక్షి
రాక నెంచెఁ జకోరంబు రాక వోలె. 79

76– (1) తేరుంగు (వ్రా) తేర్వేగ (ప) (2) నెంబలెనె (వ్రా). నెంజిలిని (ప)
(3) మార్తాండుడుంబోలెరో (వ్రా) మార్తాండుండు పోఁడేమొ జా (ప)
77– (4) నయో (వ్రా) నహో (పా)
78– (5) అనినిమిషమాశుగార్తి (వ్రా) అనిశము మారునార్తి (ప)
(6) ప్రమోద (వ్రా) ప్రమోహ (ప) (7) గేలిగిల్లిన (వ్రా) దేలగిల్లిన (ప)
(8) దరుణ లీలల (వ్రా) దరుణిలీలల (ప)
79 రాక= 1 వచ్చుట 2 పున్నమి

మ॥ [1]తమ మ న్బిల్వవనంబున న్జలజనేత్రంబుల్ [2]తగన్మూసి యా
త్మమనోవృత్తిఁ జకోరికాళులు చరింపం జంద్రమశ్శంభుఁ బ్రే
మమున న్గోరి తపం బొనర్చెడు త్రియామాగౌరిపైఁ జర్వ మం
ద[3] మరుద్ధూత హిమాద్రి హైమకణ సంతానంబు నక్షత్రముల్. 80

కం॥ తమి యెక్కఁగఁ దమ మెక్కెన్
తమ మెక్కఁగ మదము నెక్కె ధరణీసురు డెం
దమున బులిందవధూ సం
గమ సంభ్రమ సంభవోన్ముఖత్వము కలిమిన్. 81

సీ॥ సుదతికి నెదురుచూచుచుఁ ద్రోవ లక్ష్యంబు
గోచరింపక యున్న మై చెమర్చుఁ
జీమ చిటుకుమన్నఁ జెలువ మట్టెల చప్పు
డని చెవి పెట్టి యందంద వణఁకుఁ
బవమానహతి మీఁదఁబడిన తృణం బైనఁ
దరుణి చెయ్యని గరు తాల్చుచుండుఁ
దన వేగిరమునకుఁ దరళాక్షి రాకున్న
నెఱి తూలి కన్నుల నీళ్ల నించుఁ

గీ॥ బల్లటిలు గాఱువారు ప్రాన్పడు మృదూక్తిఁ
గొమ్మ పేరెత్తి పిల్చి దగ్గుతిక వెట్టుఁ
దిరుగు గుడివాకిటికిఁ బోవు మరలుఁ బొరలు
ధరణిఁబడి పుష్పశరు[4] వేఁడ్ర ధరణిసురుఁడు. 82

వ॥ అంత. 83

గీ॥ మధ్య నిద్రలచేత మైమరచి పడిన
అత్త కనుబ్రామి సమతుల నటమటించి
తోడి కోడండ్ర [5]మొఱగి [6]బంధురతరాంధ
కారమున కుబ్బి శయ్య నేపార దిగ్గి. 84

80 (1) తమము. (వ్రా). తమమన్ (ప) (2) తదామూశి. (వ్రా) తగన్మూసి (ప)
(3) మరూ..త. (వ్రా) మరుద్ధూత. (ప)
82 (4) పీక (వ్రా) వేంద్ర (ప) 5 మొ...గి (వ్రా) మొఱగి (ప)
84 (6) దురతరాంధ. (వ్రా) బంధురతరాంధ (ప)

గీ॥ కొలఁదిఁ బొందిన గాజులు కూడఁగట్టి
మట్టియలు మూడ్చి నల్లనిపట్టు గట్టి
కోక కొంగున విడెములు కొన్ని ముడిచి
తలుపు మెల్లన తెఱచి తా వెలికివచ్చి. 85

కం॥ వాటంబుగాఁగ మరలఁగ
వాటము దాకొల్పెఁ గెలనివారి వరసి య
చ్చోట సడిలేమి గని య
య్యాటవిక వధూటి వచ్చె వల్లన గుడికిన్. 86

కం॥ జారస్త్రీ పురుషులకున్
జేరువ మృత్యుండు మరుఁడు సిద్ధమును నిశా
చారత్వము చోరత్వము
శూరత్వము ప్రాణహాని చూపక యున్నే. 87

ఉ॥ జారచకోరలోచనల సన్న లెఱుంగుచు నిల్వుమన్నచో
సారెకు నిల్చుచున్ వచనచాతురిఁ బిల్చినవేళఁ దోడ వెం
పారఁగ నేఁగి కూడుదురు ప్రాణభయంబును లజ్జయు న్గులా
చారము దక్కి ప్రాజ్ఞులును సౌఖ్యము నల్ప మదేమి చిత్రమో. 88

కం॥ [1]ఆ యడవిని నో యంటే
నో యను నడిరేయి యొంటి నుండిన వానిన్
డాయంగఁ బోయె బోయత
యా యవనీసురుఁడు నెఱిఁగె నడుగు చిటుకులన్. 89

కం॥ ప్రాణము ప్రాణంబై యా
యేణాయతనేత్రి శబరి యేతెంచుటకున్
క్షోణీదేవుఁడు మన్మథ
బాణంబుల [2]కోహటించి పరిరంభించెన్. 90

---

89 (1) (ఆయడునిర్జాయంటే నోయను.) (వ్రా.) (ఆయడవిని నోయంటే) (ప)
90 (2) కోహటింప. (వ్రా) కోహటించి (ప)

ఉ॥ చూపుల తీపులం దగిలి చొక్కపుమాటలఁజొక్కి [1] (గాధ)సం
తాపము నొంది వచ్చిన ముదంబు వహించిన యాత్మ కింపుగా౯
బైఁబడి దానిఁ గూడి బహుభంగుల విప్రుఁడు కేళిఁదేలె శీ
లా పరిరంభ చుంబన [2] కళాస్థల ఖేలన లాలనంబులన్. 91

క॥ కించిన్మణితము కృతకిలి
కించితము కచగ్రహణ వికీర్ణ ప్రసవ
ప్రాంచ [3] త్పరిసరమునునై
మించెం దత్సురత మపరిమిత సుఖలీలన్. 92

చం॥ తమి రవిరశ్మి సోఁకని యుదారవనావళిఁ గారుకొన్న యా
తపము తమాలభూరుహము తచ్ఛబరాంగన చారుపుష్ప గు
చ్ఛము మధుపంబు భూసురుఁడు సారమధుద్రవభోగ మోష్ఠ పా
నము మెయిచొక్కు కైవసము నాటిన కూరిమి క్రొత్త యామనిన్. 93

వ॥ ఇవ్విధంబున వసుంధరాదేవుండు కటికి కాటుక చీఁకటిరేయి బోయతేని యిల్లాలిం గూడి యభిమత రతిక్రీడ లనుభవించెనా మైదీఁగెఁబోణి యా క్రీడాంతంబున నతనిం జక్కన యక్కునంజేర్చి కూర్చి యిట్లనియె. 94

క॥ నా [4] నిండు జవ్వనమునకు
నీ నేరుపు రతులఁ దృప్తి నేఁ డొదవెఁ జుమీ
మానసము తనియఁ గూడిన
వానికి నొడలైనఁ గోసి వనిత యొసంగున్. 95

చం॥ చతురతయున్ విలాసమును జవ్వనము న్సురతైక శక్తియున్
బ్రతిదిన మన్మథోత్సవ శుభప్రియ వేషము గల్గినట్టి వాఁ
డతివల పాలి పుష్పశరుఁ డాతడు జారుఁడు నయ్యెనేని ని
శ్చిత మిది బోయతేనికి రుచించునె నాకు మనోజకేళికిన్. 96

---

91 (1) (గాధ) లుప్తపూరణము
(2) కళాస్థితు(ప్రా) కళాస్థల. (ప)
92 (3) త్పరిచరము (ప్రా) త్పరివరము (ప)
95 (4) నిండు (పూ)

కం॥ మగఁడు కడురసికుఁ డైనన్
జగతీశ్వరుఁ డైన రోసి జారక్రీడన్
దగిలిన సతి విడుచుఁ జుమీ
జగతీసురవర్య! పుష్పచాపుని యాజ్ఞన్. 97

వ॥ అట్లగుటంజేసి భవత్సంగమ సుఖంబున మజ్జన్మంబు సఫలం బయ్యె నింక ప్రాణ పర్యంతము నిన్ను మఱవ, నీవును నన్ను మఱవకు మని వేఁగుఁ బోక యయ్యె నీపాటు నీవు లేచి తీర్థంబు పొమ్మ్ము, మరలం ద్రోవఁ గ్రమ్మర నన్నుఁ జూచి పొమ్ము. నీకు [1] సంబళం బిది కొనిపొ మ్మని తనమొల పసిండి మొలనూలిచ్చి మచ్చిక నూపిన గుండె ఝల్లన బ్రాహ్మణుండు కన్నీళ్ళతో దానిచెక్కిలి దడుపుచు నిట్లనియె. 98

ఆ.వె. తీర్థ మేల నాకుఁ దిథియేల నిను బాసి
యెట్లు పోవువాఁడ నిందువదన
పాసి పొమ్మనంటి ప్రాణంబులే పాసి
పోవుఁగాక బొంది పోవఁగలదె! 99

కం॥ ప్రాణము గల[2] (కాలం)బునఁ
బ్రాణేశ్వరి వైన నిన్నుఁ బాయఁగఁజాలన్
బ్రాణము వోయిన పిమ్మట
నేణాయతనేత్రి యవల నెవ్వఁ డెఱుంగున్. 100

ఆ॥వె. పంచ చంద్రశాల పాషాణ [3] దేశంబు
పుష్పశయ్య సురతభోగ మల్ప
మైన నింద్రభోగ మరయంగ జార సం
గమ సుఖంబుకంటెఁ గలదె సుఖము. 101

ఉ॥ గుండియ ఝల్లు ఝల్లు మనుఁ గోమలిఁ జూచిన దాకఁజూచినన్
నిండుమనంబు జారునకు నెయ్యము తియ్యముసూఁపుఁజూపులన్
గొండొక యింతి నవ్విన గగుర్పొడుచుం దనువెల్ల నొంటిమై
నండకు వచ్చి కూడినఁ దదంగజ సౌఖ్యము కోటి సేయదే. 102

98 (1) సంబడంబిది. (వ్రా) సంబళంబిది (ప)
(2) (కాలం) (పూ)
(3) దేవుండు (వ్రా) దేశంబు (ప)

క॥ కావున భవదీయ రతి
శ్రీ విభవము మానఁ జాల శీతకరముఖీ
[1]ప్రోవు నను విడువవల దని
యా వసుధామరుఁడు దాని యడుగుల ప్రాలెన్. 103

గీ॥ అట్లు దీనత మ్రొక్కిన నదరు గదిరి
యియ్యకొని కౌఁగిలించి యయ్యిందువదన
నాకు నీకంటెఁ జువ్వె ప్రాణంబు వోక
నిన్నుఁ బాయంగ నోపుదునే గుణాఢ్య! 104

ఉ॥ ఏల మగండు ప్రాణ మది యేటికి శీలము నన్వయంబు ని
ర్మూలము సేసి జార విటు ముచ్చట దీర రమింపఁ గల్గినన్
స్త్రీలకు వావిఁ కేమిటికిఁ జింత తనంతనె వచ్చునా పర
స్త్రీల రమించు కంటె సుఖసిద్ధియు నున్నదె యెన్ని భంగులన్. 105

వ॥ అని జార సంభోగ సుఖంబు వర్ణించి నీ యాజ్ఞచేసి నీ హృదయంబునకు నను కూలంబుగా నడచెద నన్ను నమ్మించు మనిన నంతసంచి బ్రాహ్మణుండు మోహాతిశయంబునఁ దదభిప్రాయం బెఱింగి యిట్లనియె. 106

కం॥ సుదతి నిను బాయ నెన్నఁడు
మదిరా మాంసాది రుచులు మరగెద నీతో
[2]డిది నీతోఁ బ్రాణము ని
చ్చెద నా దైవంబు సాక్షి శీతాంశుముఖీ. 107

వ॥ అనిన నది సమ్మతించి యిట్లనియె. 108

కం॥ గుడిలోననుండు మెల్లిటి
నకురే యెచ్చటికినైన నను గొని చను వెం
బడి వచ్చెద నని పలికినఁ
బడఁతి ననిచి వేడ్కనుండె బ్రాహ్మణుఁ డచటన్. 109

కం॥ కులశీలంబులు విడిచెన్
దలఁకక ప్రాణంబు విడుపఁ దలఁచెను విప్రుం
డలివేణి నెత్తుకొని చను
తలఁపున నెవ్వాఁ డెఱుంగు దైవము చేతన్. 110

---

103—(1) ...నకు (వ్రా) ప్రోవునను (ప)
107—(2) తో...డ (వ్రా) తోడిది (ప)

వ॥ అంత.

కం॥ ఖండశశి చుక్కతో నా
ఖండల దిశఁదోఁచె శబరకామిని నుదుటన్
[1]గొండిక ముత్యము బొట్టిడి
యుండుటగాఁజూచి విప్రుఁ డుల్లం బలరన్. 112

చ॥ అనిశము నర్థి సంతతకి నాప్త ధనం బిడి పేదవడ్డ దా
తను నిదువంగఁ జాలరు గదా [2]ధర నర్థులు కొంచ కేమియున్
వెనుకొని వత్తు రంచు శశి వెన్నెలపుల్గుల నవ్వి నట్లు ప్ర
న్నన నునుఁజాయవెన్నెల తనర్చెఁ బ్రభాతము రాక చేరువన్. 113

శా॥ ఘూకాంధీకరణౌషధంబు శిశిరక్రూరాద్రి కుంభోద్భవుం
డాకాశాచ్యుత కౌస్తుభాభరణ మింద్రానేకపోద్దండ శుం
డాకాండోద్ధృత దివ్యసైంధవ సువర్ణ [3]ష్మాజజాతంబు లో
కైకాలోకము లోకబాంధవుఁడు పూర్వాద్రిం దనర్చెన్ బ్రభన్. 114

గీ॥ అపుడు నీరెండ పసుపునీరాడి పసిడి
తమ్మి నునుఁజాయ కెంబట్టు తనరఁ గట్టి
కచభరంబునఁ బ్రొద్దు చెంగల్వ కుచ్చు
చెలువు మీరంగ దివముఖశ్రీ దనర్చె. 115

చ॥ ధరణిసుపర్వుఁడున్ శబరతన్వియు రేవును వేడ్కతోడ శం
బరరిపుమాయఁ జక్రఖగభావము నొంది రమించుచున్న వా
రురుతర మోహబంధమున నొక్కటియై యటు కాకయుండినన్
మరుమరు లెల్లజీవులును మానఁగ జక్కవ లేల మానవో. 116

వ॥ అట్లు ప్రభాతకాలంబు ప్రస్ఫుటం బయ్యెవేఁగుఁబోక నిద్ర మేల్కాని విప్రుండు కాలోచిత కర్మంబులు తీర్చి గుడికి వచ్చినవారికి దనరాక యెటువలన నెఱుక పడకుండు నట్లుగాఁ బరదేశి మార్గంబున దేవాలయంబునందే యుండి రాత్రిటి శబరతరుణివలన రతిక్రీడలతోడి మేలుగ్గడింపుచు నింక నెప్పుడు ప్రొద్దు ప్రుంకు నెప్పుడు దీనిం గొనిపోదు నని తలంచుచు నొక్క చందంబునఁ బ్రొద్దు గడపుచుఁ దచ్చివసన్నిధానంబున. 117

---

112 (1) కొండొక (వా) కొండిక (ప)

113— ధ .... నర్థులు కొంచదేవికిన్ (వ్రా) ధరనర్థులు కొంచకేమియున్ (ప)

114 (3) సైంధవ సువక్షర జాతంబు (వ్రా) సెంధవ సువర్ణ ష్మాజ జాతంబు (ప)

క॥ సంతసముతోడ నతఁడు త
దంతికమున రామరామ యనియెడు దానిం
జింతామణిసఖ ముఖనఖ
కాంతిశ్రీవిజిత కింశుకంబు శుకంబున్. 118

వ॥ చూచి తలయూచి 119

కం॥ కీరము రాముని బలుకుచు
గారా మొనరించెఁ జెవికిఁ గనుఁగవఁ దనిపెన్
గారుత్మత కురువింద శ
రీర ద్యుతి కంఠభాగ రేఖాశ్రీతోన్. 120

కం॥ దీనిం గొనిపోయెద నీ
మానినితోఁ గూడి మృదులమధురోక్తులచే
వీనులు దనుపుచు సతతము
మీనాంకోద్దీపనంబు మేల్కొల్పు మదిన్. 121

ఉ॥ వింతలుగాఁగ రామకథ వేడుకతోఁ జదివింతు మాట లా
డింతు సభాస్థలిం జనుల డెందములెల్లఁ గరంగ మేదినీ
కాంతులచేఁ బదార్థములు గైకొని యిచ్చెద నింతి కంచుఁ దాఁ
జెంతకు నేగి బ్రాహ్మణుఁడు చెప్పఁదొడంగెను రామసత్కథన్. 122

క॥ శ్రీరామ పూర్వకంబుగఁ
గీరంబును జెప్పినట్లు కెరలుచుఁ జదివెన్
జారుమతి దాని మహిమకు
గారామున ముద్దువెట్టి కరమున నిమిరెన్. 123

ఆ॥వె॥ శబరకాంత తనకు సంప్రీతి నందించు
పాలు వోయు నరఁటిపండ్లు వెట్టు
పసుపునీర నార్చుఁ బలుకులు చెప్పుఁ బం
జరమునం దమర్చు సంచరించు. 124

వ॥ ఇవ్విధంబునం బూర్వజన్మ సంస్కారంబునం జెప్పినట్లు చదువుచుఁ బ్రతిపదం
బును రామనామోచ్చారణంబును జదివిన పద్యంబున కర్థంబు చెప్పుచున్న యన్నెఱ
బిరుదుచదువుల రాచిల్కతోడిదే లోకంబై దివసంబు గడపె నంత సంతమసం
బున బ్రహ్మాండంబు దుర్మోహ దురవగాహం బగు నా విప్రుని హృదయగాహం
బునుం బోలె నుండె నప్పుడు. 125

మ॥ నడురే యయ్యె మహీసురప్రవరుఁడు న్నారాకకై యున్న వాఁ
డెడసేయం బనిలేదు పోదనిపుడే యిల్లెల్ల నిద్రించె నా
తొడవుల్ చీరెలు నంతసంపదయు నాతోఁ గొంచుఁ బోదున్ బ్రియం
బడరం బోవిడువంగ నేటి కని యయ్యబ్జాక్షి నిశ్శంకయై. 126

కం॥ కలవెల్లఁ గట్టుకొని వి
చ్చలవిడి మగఁ డూర లేమి జడియక పౌర
చ్చలు (?) దొడిగి విడెములుం దన
వలసిన యవి గొంచుఁ[1] గలికి వచ్చెన్ గుడికిన్. 127

కం॥ [2]వచ్చియు వేశమ విప్రుని
మచ్చికతోఁ గౌగిలించి మాట నిజముగా
వచ్చితిఁ జూడుము వద మిఁక
నిచ్చట మన ముండవలవ దెచ్చటికైనన్. 128

వ॥ ఇది మహారాష్ట్ర దేశంబు. ఈదేశం బేలు రాజు ధర్మధ్వజుండు, మీవంటివిద్వాం
సులకు నభిమతార్థంబు లిచ్చు నా పుష్పవతీ పురం బిచటికిఁ బదియోజనంబు
లున్నది. దాని మార్గం బెఱుంగుదును. పద మనిన సంతసిల్లి యవ్విప్రుండు
చిలుకపంజరంబు చేతం బట్టుకొని పిరుదం జనియె. మరునాఁడు వే పగలింటికి
యోజనత్రయంబు కడచి తెరవులో నొక పల్లెయున్న దాని సమీపంబున నీళ్ళ
వాగుదండ నీడలగుజ్జుమఱ్ఱిచెట్టుక్రింద నిలిచి రప్పుడు. 129

---

127 (1) క... (ప్రా) ఁగలికి (పూ)

128 (2) వచ్చి వేడగమని. (ప్రా) వచ్చియువేశమ (ప)

క॥ అలసితిగా నా కతమున
నలరుంబోఁడీ యటంచు నాయింతి పదం
బులు పిసికి దప్పికిడి త
మ్మల (?) మిడి శయనింపఁజేసి మమకారమునన్. 130

క॥ పల్లెకు నల్లనఁ జని యొక
యిల్లాలికిఁ దగిన విలువయిచ్చి నయమునన్
దల్లీ! నా ప్రియురాలికి
నుల్లం బలరంగఁ జేయు [1]మోగిర మనినన్. 131

క॥ అయ్యా! నిమిషములోననె
యయ్యేడు నెచ్చటికిఁ దెత్తు ననవుడు నతఁడున్
నెయ్యమున మత్తిక్రిందికిఁ
జయ్యనఁ గొనిర మ్మటంచుఁ జనియెం బ్రీతిన్. 132

క॥ పలుతెఱఁగుల మాంసంబులు
పొల దెలియక యుండఁ గమ్మపొగపులు గల కూ
రలువండి మేలువంటక
మెలమిం గొనివచ్చె నామె [2]యిక్కువ కడకున్. 133

క॥ కూడును గూరలు నటికెల
తోడం దన కిడిన యామెతో నా శబర
వ్రీడావతి సుర తెమ్మని
వేడుకతోఁజెప్పి [3](దాని) విలువయు నిచ్చెన్. 134

గీ॥ తక్షణం బామె తగిన మద్యమ్ము నొక్క
బిందెతోఁదెచ్చి శబరి కర్పించి పోయె
నంత విప్రుఁడు తాఁ దీర్థమాడి వచ్చి
పడఁతి యాకొంటి పీవేల కుడువ వనిన. 135

---

131 (1) మోగిన (వ్రా) మోగిర (ప)

133 (2) బంకువ. (వ్రా) యిక్కువ. (ప)

134 (3) (దాని) (పూ)

సీ॥ బోయ పూఁబోణి యా భూసురవర్యుండు
తనతోడఁ గుడువని తలఁ పెఱింగి
నా పొత్తు గలియని నాఁడె యెన్నటికైన
పోవు నాపై మేలు పోవు నపుడె
పోకుండ నిప్పుడె పొత్తునఁ దినిసింతు
నొత్తి పలికి మేలున్నయపుడె
యన్లేని నను బాయఁడెన్నడుఁ దానని
తలవంచెఁ గన్నీరు ధరణిఁ దొఱఁగ
గీ॥ దాఁ గని గుండె ఝల్లని తల్లడిల్లె
సింతి యేటికి నేడ్చెద వింటివారిఁ
దలఁచు కొంటివొ నావంకఁ దప్పుగలదొ
యంచుఁ దమకించి యడిగిన నతని కనియె. 136

కం॥ నీ వంకఁ దప్పు గలదే
నా వంకనె కాక నిన్ను నమ్మి చెడితి నీ
భావం బెఱుఁగక వచ్చితి
కావరమునఁ జెఱచుకొంటిఁ గాపుర మెల్లన్. 137

కం॥ కలిమియు బలిమియుఁ బ్రీతియు
గలపెనిమిటి సిగ్గుపుచ్చి [1]కనువేదఱనన్
వలచి నిను గూడివచ్చితి
సిలు వెలువడి తోడివార లెల్లను నవ్వన్. 138

ఆ॥వె॥ నిన్ను విడువఁ జాల నీ పొత్తుగలిపెద
నమ్మి మనుచుఁ బలికి నన్ను దెచ్చి
వెట్టిచేసి తిపుడు విడుతు వీకై ప్రాణ
మనిన బిట్టు[2]కలఁగి యనియె నతఁడు. 139

మ॥ పడతీ యాడినమాట తప్పుదునె యీ బ్రాహ్మ్యంబు నా కేటికిన్
విడుతుఁగాక కులంబు నిచ్చెదుతునే వేఱున్నదే నాకు [3]నీ
య్యెడ నీతో భుజియించెద న్గలిసి పుష్పేషు ప్రియోద్దీపనం
బడర న్నీ [4]మధురాధరామృతముతో హాలారసం బానెదన్. 140

138 (1) కను...ందు రనన్ (వ్రా) కనువేదఱనన్ (ప)
139 (2, కలిగి (వ్రా) కలఁగి (ప)
140 (3) నీయెడ (వ్రా) నియ్యెడ (ప)
140 (4) యధరామృతాసవముతో (వ్రా)
మధురాధరామృతముతో (ప)

వ॥ అని బ్రాహ్మణుండు వేదశాస్త్ర సంపన్నుండయ్యును గర్మవశంబున మదనో న్మాదంబున మత్తమకులాచారంబు తలంపక యాబోత పొత్తునంగుడిచి మాంసరుచులు ప్రకటించి దానితో మద్యంబు గ్రోలుచు నిట్లనియె. 141

క॥ మదనోద్దీపనమునకున్
దుది మద్యము కారణంబు తొయ్యలి లీలన్
మదనారవింద గంధా
స్పదముగఁ జవి చూపెనేని ప్రాణము కాదే. 142

వ॥ అని దానితో వలసినట్లు మాంసము దిని మధువు గ్రోలి చేతులు గడుగుకొని అది దెచ్చిన జవ్వాది బొట్టు పెట్టుకొని కపురపు గందవిడియంబు లందుకొని తమ్మలంబులు సేయుచు నెరగొని కామోద్రేకంబున నయ్యేకాంత విటపిచ్ఛాయం దమ యిచ్చకు వచ్చినట్లు సముచ్చలితకాచవలయ కంకణ ఝణితంబులు కల హంస కలరవ కంఠప్రభృతి సముత్కంఠ మణితంబులుం గచగ్రహణ వ్యగ్రా కర్షణంబులు రోమహర్షణంబులు విగళితనీవీబంధంబులు కఠినకుచపీడనంబులు వక్షస్తాడనంబులు ముహుర్ముహుర్జనిత ప్రశాంత మన్యుమానంబులు నధరపానం బులు నఖాలంకారంబులు మూర్ఛా వికారంబులు నలరం దొలినాఁటి రాత్రింటివంటి వెఱపుమఱచి తమతమ తమకంబులకొలఁది యభిమతసురతం బొనర్చి యలపు సొలపు దీఱ నిద్రించి రపుడు. 143

గీ॥ ప్రొద్దు గ్రుంకినఁ బిల్లెకుఁబోయి తమకు
వండి పెట్టిన వారింటనుండి వేగుఁ
బోక లేచి రయంబునఁ బోయి రట్లు
చనిరి పురమున కైదారు దినములకును. 144

క॥ చని యొక్క యుచిత గృహమున
నునికి తగంజేసి దాని నొప్పఁగ విప్రాం
గనల యలంకారం బిడి
తన బ్రాహ్మణవేష మెపుడుఁ దప్పక యుండెన్. 145

వ॥ అంత బోయదండు పరదేశములనుండి తనమందియెల్ల వెంటరా సకల పదార్థ సామగ్రితో వచ్చుచు నూరిచేరువఁ బ్రియురాలిం దలంచి దానిపై మేలున నిట్లను కొనియె. 146

ఉ॥ క్రొత్తగఁ బెండ్లియాడి మదిఁ గోరిక లీరికలెత్తికూడ ను
న్మత్త వినూత్న యౌవనమున న్రతిఁ బాయుట నీతి యౌనె న
న్నిత్తరళాక్షి యేమనునొ యే నిఁక నెన్నడుఁబాయనంచునా
మత్త చకోరలోచనకు మన్నన నిచ్చెద నీ పదార్థమున్. 147

క॥ జలజాక్షి నన్ను బలెనే
చిలుకను బోషింపు మనుచు జెప్పితి గుడిలో
పలికినది పోవ నేర్చునె
తలవాకిలి ద్రొక్కి దెపుడు తనపైఁ బ్రేమన్. 148

క॥ నా మాట చేయకుండదు
నామీఁద న్భక్తి కలదు నన్నుం బలెనే
ప్రేమమునఁ జిలుకఁ జూచును
భామామణి యనుచు వేడ్కఁ బల్లెకు వచ్చెన్. 149

వ॥ అట్లు వచ్చి తనయింటిదాపు దేవరగుడికిం బోయి రాచిలుకం గానక వెడ ద్రొక్కు దేవరకు మ్రొక్కి చిలుకపంజరం బింటికిం గొంపోయినవారు కాఁబోలు నని యిల్లుసొచ్చి చిలుకపలుకులు వినక తన కెదురురాని ప్రియురాలికై యలమ టింపుచు లోనింటి వాకిటియరుంగునం గూర్చుండి తల్లిం జూచి యిది యెటు వోయిన దనిన నామె యేమియుం బలుకనేరక కన్నీరుతో నూరకున్న కళ వళించి యతం డిట్లనియె. 150

గీ॥ ఏమి యేడ్చెదు నా రాక కెదురుచూచి
యోర్వఁజాలక చచ్చెనో యొర్మిలేక
నన్ను దూషించి [1]పుట్టిల్లు చన్నదొక్కొ
యేమి యయ్యెనొ చెప్పవే [2]యింటిదేది ? 151

---

151 (1) చనెనొ పుట్టింటికేని (బ్రా). పుట్టిల్లు చన్నదొక్కొ. (వ)
(2) యింతి యాల. (బ్రా) యింటిదేది (వ)

వ॥ అని యడిగిన నింటిలోని యాడువారెల్ల నంతంత నిలిచి యింక నీవేల దాచెద వని యొడలు పట్టలేక తెరువు పదనం బోవుట చెప్పఁ గదమ్మయని కారు తారే పరదేశివిప్రుండు తీర్థము పోవుచుం బోలేక రెండుదినసంబు లాగుడిలో నుండుటయుఁ దొలినాటి రాత్రి యతం డున్నచోటం దలపువ్వులు రాలుటయుఁ దమ్మలంబు లుమియుటయు గాజులు పగిలి పడుటయు నానవాలుపట్టి మరునాఁ డిది పోయిన నతండే కానిపోయె నని విశ్వయించితి మనియును పోయిన వారిరువురి చొప్పును బుష్పవతీపురంబు దెసకుం బోయి రనియుమం జెప్పి యిల్లెల్లం దేవుకొని చిలుకం గొంచుం బోయి రనిన నతండు శోకమూర్ఛిత మానసుం డై కన్నీరు నింపుచు నిట్లనియె, 152

ఆ.వె॥ నన్ను బలెను జూచు నాతల్లి తనతోడి
వారలెల్లఁ దనకు వణఁకు చుండ్రు
కూడు చీర లిచ్చి [1]కొలుతునే తలఁపునఁ
బాసి యెట్లు వోయెఁ బాపజాతి, 153

కం॥ బోయపగ ప్రాణహానిం
జేయక పోరాదటంచుఁ జెప్పఁగ వినదే
యా యవనీసురుఁ డెక్కడ
వోయెను నే నెఱుఁగనట్టి భూమియుఁ గలదే. 154

కం॥ పాతాళము సొచ్చిన వసు
ధాతలపతి మఱుఁగు సొచ్చి తా రుండిన నా
చేతి పిడియమునఁ జంపెద
ఖ్యాతిగ నాజాతివారు [2] కడుకీర్తింపన్, 155

వ॥ అని యించుక ఆకలి దప్పులు తీర్చుకొని దట్టీ తలపాగ లమర్చుకొని తీర్థ యాత్రాపరుల బ్రాహ్మణుల తలలు పగులం దెరువాటులు గొట్టి కుత్తుకలు గోయు కరవాలము గండ్రగొడ్డలియు [3] (నాడుదానివలన నేపాటి) తప్పు గలిగినను దల్లితోఁబుట్టుగులు మొదలైనవారిఁ బడఁబొడుచు మువ్విడియము మొల నిరుగడలఁ గానెకోక పొరలం బిగియించి గోరక్తసిక్త దారుణబాణం

---

153 (1) కొలదినేకలవున (వ్రా) కొలుతునే తలఁపున (ప)
155 (2) వన్నుతిసేయన్ (వ్రా) కడుకీర్తింపన్. (ప)
156 (3) నాటదానివలనన్పాటు (వ్రా) నాడు దానివలన నేపాటి (ప)

బులు గలకవదౌనయు విల్లునుంగొని యెవ్వరికిం జెప్పక యొక్కరుండున
వారలచొప్పుబడిం గతిపయ దివసంబులకు వచ్చి యాపట్టణంబు రజనీ
ముఖంబువం జొచ్చె నంత. 156

కం॥ ఆ రాత్రి బ్రాహ్మణుం డా
వారిజ దళనేత్రితోడ వలసిన య ట్లా
హారప్రవక్పుందన రతి
సారస్యం బనుభవించి సంతోషమునన్. 157

కం॥ రవి యుదయించిన ధరణీ
ధవు కొలువున కేగవలయుఁ దగు వన్నెలతో
ధవళాక్షితోడ నవి సమ
యవిధు లొనరంగఁ దీరిచి యాసతి డానున్. 158

గీ॥ తగిన సొమ్ములు దొడిగి యందంబు లైన
సురుచిరాంబరములు దాల్చి సురభిగంధ
సంపదలు పూసి [1] సిగను బుష్పములు ముడిచి
తమ్మలంబులు సేసి చిత్తంబు లలర. 159

ఆ॥వె॥ చిలుక పంజరంబు శీతాంశుముఖిచేత
నలవరించి వెంట నరుగు దేర
బ్రాహ్మణుండు వచ్చెఁ బ్రభువు సన్నిధికిఁ ద
త్పౌరు లెల్లఁ దమ్ముఁ దగిలి చూడ. 160

క॥ రతి మన్మథులో [2] శచియున్
శతమన్యుఁడునో విలాస సౌభాగ్యకళా
న్వితు లై వచ్చిరి వీ రని
యతిముదమునఁ జూచి రపు డాస్థాన జనుల్. 161

---

159 (1) (పిగను) పూ.

161 (2) లొచ్చియు (వ్రా) శచియున్. (స)

గీ॥ భారతీదేవి యిది చిల్కపంజరంబు
చేత నున్నది యితఁడు రాజీవ భవుఁడు
శక్తియావక్తి వచ్చి రిద్దఱును మాన
వాకృతిని దాల్చుటకు హేతు వరయ[1]వలయు. 162

వ॥ అని సకలజనులు దమలోనకు నాహ్లాదింప నేఁగి యాస్థాన మంటప పురోభాగం బున నిల్చి సభాపతియగు ధర్మధ్వజు నాశీర్వదించి యేము విప్రదంపతులము దూరదేశంబుననుండి వచ్చితిమి యీ కీరరాజంబు మాకు జీవకం బిది సకల శాస్త్రంబులు నెఱుంగు విశేషించి శ్రీరామ ప్రభావంబు పకటింప నేర్పు నింపుక ప్రొద్దు దేవర విద్వజ్జనంబులతోడ దత్తావధానుండవై చిత్తగించ వలయునని యనుజ్ఞ వడపి బ్రాహ్మణుండు చిలుక మొగంబు చూచి రామకథా ప్రసంగము సేయు మనిన నదియు సభాసదులం గలయంజూచి యిట్లనియె 163

కం॥ ధరణీనాయక! విద్వ
ద్వరసచివులతోడ వినుము వాంఛాసిద్ధుల్
దొరకొను రామకథా త
త్పరులకు నెఱుఁగుదురు దీనిఁ బరమ మునీంద్రుల్. 164

క॥ రామేతి వర్ణయుగళం
బేమరక రచించు వార లీ సంసార
వ్యామోహ ముడిగి దురిత
స్తోమము నణఁగించి పొందుదురు మోక్షంబున్. 165

క॥ రామోచ్చారణ మున్నను
రామన్నా యంద్రుగాక రామస్తుతులవ్
రామాహ్వయులై పుత్రుల
రామన్నా రామచంద్ర రామా యనుచున్. 166

క॥ రామా యను నక్షరములు
ప్రేమంబున జిహ్వ నుచ్చరింపుడు మదిలో
రామస్మరణము సేయుఁడు
రామస్తుతి వినుఁడు కర్ణ రంధ్రము లలరన్. 167

ఆ.వె॥ రామభద్ర యనుచు రఘురామ యనుచు శ్రీ
రామచంద్ర యనుచు రామ యనుచు
పలుకుచున్నవాఁడు పలుకఁగా వినువాఁడు
ముక్తి గంద్రు రామమూర్తిఁ జెంది. 168

గీ॥ పూని బ్రహ్మాక్షరంబును మొదలి రేఫ
కడమవర్ణంబు మామిడి గలిసి రామ
నామ మయ్యెను స్మరియించు నరుల కెల్ల
బ్రహ్మపద మిచ్చుటకు నంద్రు పరమమునులు. 169

క॥ శ్రీరామ మంత్రరాజము
దూరంబుగఁ బాపవమితిఁ ద్రోలుచు ముక్తి
శ్రీరమణిఁ గూర్చు నెంతయు
శ్రీరామజపంబు మేలుచెప్పఁగ వశమే. 170

వ॥ అని కీరరాజంబు శ్రీరామ దివ్యనామ ప్రభావంబు వర్ణింప వేదశాస్త్రాగమ వేదులగు సత్తమద్విజుల నేమిచెప్ప సకలజనులు గరుపాఱ నానంద బాష్ప కణంబు లురుల శ్రీరామ ప్రభావంబు వినువారును రామోచ్చారణం బొనర్చు వారును దదేకధ్యానంబున రామస్మరణంబు సేయువారునునై యుండి రాస్థానం బెల్ల శ్రీరామమయంబై యుండె నట్టి సమయంబున. 170

ఆ.వె॥ అవ్విధం బెఱింగి యల్లన నా బోయ
యేఁగుదెంచి యచట వింతిఁజూచి
విప్రుఁజూచి రోషవివశుఁడై మానంబె
యూర బ్రతుకునాళ యొల్ల కపుడు. 171

క॥ కడు నిర్దయుఁడై జిరజిరఁ
బిడికిం బొకఁ బాయఁ దిగిచి బిరబిరఁ జని యా
పడతిని విపుని జావం
బొడిచి పడం ద్రోసె జముని పోలికఁ బెలుచన్. 172

వ॥ అట్లు పొడిచి ముప్పిడి నేలవైచి భూపతికిం జేతులెత్తి మ్రొక్కి యేను బోయ గమికాఁడ నీ యింతి నా యిల్లాలీ విప్రుండు నే నూర లేకుండుట యెఱింగి దీని నెత్తుకొని వచ్చినవాఁ డభిమానము గల బోయవారము గానఁ బగ దీర్చుకొంటి దేవర చిత్తంబు వచ్చినట్లు సేయ నవధరింపు మనిన నాస్థానజను లందఱు నీ పాపిష్ఠుఁడు రాజు సముఖంబునం దగవు కాదనక

174 (1) పాపిష్ఠి (వ్రా) పాపిష్ఠుడు (ప)

యింత సాహసకృత్యంబు చేసె నీ చూచిన పాపంబునకుం బ్రాయశ్చిత్తంబు రామనామోచ్చరణంబే యని చెవులు మూసికొని రామరామ యనుచుండి రది సహింపక ధర్మధ్వజుండును రామరామ యనుచుం బార్శ్వచరుల నియోగించె నప్పుడు. 174

క॥ చిలుకయు రామా యనుచుం
బలుకఁగ జనులెల్ల నట్ల పలుకఁగ ధరణీ
తలపతి యానతి బోయన్
దల నఱికిరి భటులు దత్పదంబుల చెంతన్. 175

వ॥ అప్పుడు. 176

క॥ అందఱు నా చందంబున
ముందటఁ బడియున్న వారి మువ్వుర శవముల్
సందడిఁ జూడఁగ దివి నుం
డందంబై పుష్పవర్షమచ్చోఁ గురిసెన్. 177

క॥ సుర పుష్పవృష్టి గురిసెన్
గరమరుదుగ సకలజనులు గగనము చూడన్
సురుచిర పుష్పకములఁ దోఁ
చిరి వారల దివ్యసతులు సేవింపంగన్. 178

చ॥ కరముల శంఖచక్రములు కౌస్తుభ మక్కున దివ్యకాంచనాం
బరము కటీరభాగమునఁ బంకజరాజకిరీట మౌదలన్
జరణములందు నందియలు చాల వెలుంగఁగ రామమూర్తి ము
వ్వురు విలసిల్లి రొక్కయెడఁ గోమలనీల పయోధరద్యుతిన్. 179

క॥ నేలఁ బడియున్న బొందులు
గాలికి దివి కెగసి దివ్యగంధము వాలయన్
జ్వాలా కరాళ తపన క
రాళల భగభగనుమండి యవియు నణంగెన్. 180

వ॥ అవ్విధంబున రామమూర్తులై వెలుంగు మువ్వురిలోన బ్రాహ్మణుండు ధర్మధ్వజు నుద్దేశించి యేను గర్మదూరుండ విప్రుండ ద్రావిళదేశంబువాఁడ సంసారవిరక్తుండనై కాశీక్షేత్రంబున మోక్షంబు వడయు నపేక్ష వచ్చి కర్మవశంబునఁ బరస్త్రీ సంగమం బొనర్చి దీనితోడ మద్యమాంస భక్షణంబు సేసితి నిటువంటి పతితుండ నేనును జారస్త్రీ యయ్యును నసుం దఱిమి మద్యమాంసాదు లాస్వాదింపంజేసిన బోయతయును నిర్దయుండై

స్త్రీహత్యయు బ్రహ్మహత్యయుం జేసిన కిరాతకుండును నీ సమ్ముఖంబున గిరరాజంబు పలుకు శ్రీరామనామంబులు వినుచుఁ బ్రాణంబులు విడిచితిమి కావున శ్రీరామదివ్యమూర్తి వహించి దివ్యసేవ్యులమై పరమగతిం బోవు చున్నవారము రామమంత్ర జపంబున రామసంకీర్తనంబును మఱవకు మని యుపదేశించి వారును దాను విష్ణులోక బునకుం జనియె నప్పు డఖిల జనులు జయజయధ్వనులతో రామరాజ యని పలికిరి ధర్మధ్వజుండును నిహపరసౌఖ్యమూలం బిది యని యా కీరరాజంబును బోషించుకొనియె నది మొదలుగా నా మహారాష్ట్ర దేశీయులు రామనామ పరాయణులై యున్నవా రనిన విని వాలఖిల్యులు పరమానందంబునుం బొందిరి తదనంతరంబున. 181

ఉ॥ మారుత పాకజోల్బణ సమంచిత తల్ప! సుకల్ప పుష్పమా
లా రసమాధురీ పరిమళస్థితి వక్ష! విచక్షణాత్మ పం
కేరుహ పంజర ప్రకట కీలిత కీరకులేంద్రచంద్ర మం
దార [1] మరందపూరిత సుధారస భాషణ! భక్తపోషణా! 182

కం॥ [2] సారస చారుపవన చల
[3] తీరోద్యానద్రు మాలతీ ముఖ్యలతా
వార ప్రసవావచయ
శ్రీరసిక మహీసుతా చరిత [4] రతితంత్రా!

మాలిని॥ సదసరసిజ ధూళీపాళి నారీకృతాత్మా!
సదసదుభయకార్యా! జ్ఞానవచ్చిత్తవేశ్మా!
మదవదరిపరార్చిష్మన్మహాంభోముగార్యా!
మదనశత తనూశ్రీ మాధురీధుర్యచర్యా! 184

గద్యము॥ఇతి శ్రీమదవ గోపాల చరణకమలసేవాధురీణ సత్కళాపారీణ కృష్ణ భట్టారక పౌత్ర చింతలపూడి కామయప్రభు సుపుత్ర శుద్ధసారస్వత విభవ రాధామాధవ ప్రణీతంబైన తారకబ్రహ్మరాజంబను మహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

శ్రీ సీతారామార్పణమస్తు

శ్రీ శ్రీ శ్రీ

---

182 (1) వితీర్ణత (వా) మరందపూరిత (స)
183 (2) సారవ (వ్రా) సారస (స)
183 (3) తీరోద్యానద్ర (వ్రా) తీరోద్యానద్రు (స)
183 (4) రతింద్రా (వ్రా) రతితంత్రా (స)

# తారకబ్రహ్మరాజీయము

## తృతీయాశ్వాసము

క॥ శ్రీమత్కల్యాణ గుణ
గ్రామ జలధిమధ్యదుర్గ రక్షోసుర శి
క్షాముదిత శుభవనముని
గ్రామణ్యంతర్విలోల రామనృపాలా! 1

వ॥ దేవా! విన నవధరింపుము పరాశర మహాముని శ్రేష్ఠుండు వసిష్ఠ శిష్యుండైన వామదేవునకుం దరువాతికథ వినుమని యిట్లనియె. 2

క॥ శ్రీరామ రామ యను నా
కీరమ్ముచే నిట్టి ఘోరకిల్బిషపరులున్
శ్రీరామ దివ్యపదముం
జేరిరి తన్మంత్రరతలఁ జెప్పవలయునే! 3

క॥ చిలుకలు [1]మానిసి పలుకులు
పలుకంగా నెట్లు నేర్చెఁ బక్షులలోనం
బలుకఁగ నేర్చియు రాముని
బలుకంగా నెట్లు నేర్చెఁ బరమమ్ముదార్త్కిన్. 4

వ॥ అని వాలఖిల్యు లడిగినం గుంభసంభవుం డిట్లనియె. 5

గీ॥ లోకసంరక్షణార్థ లీలాకుతూహ
లాత్ముఁ [2]డాదిమపురుషుఁ డబ్జాక్షుఁ [3]డట్లు
రాముఁడై పుట్టె దశరథ భూమిపతికిఁ
దత్పురాకృత మహనీయ తపము కలిమి. 6

---

4— (1)— మానుషపలుకులు (వ్రా) మానిసిపలుకులు (ప)

6— (2)— డాదిమధ్య (వ్రా) డాదిమ. (ప)

6— (3)— దంద్రడు — (వ్రా) దట్లు (ప)

సీ॥ శ్రీవధూమణి జనించెను మహీజాతయై
భరత శత్రుఘ్న రూపముల [1]శంఖ
చక్రము ల్నిలిచె లక్ష్మణమూర్తి శేషాహి
యలరె నవ్విభుని లీలార్థమందు
రాముఁ గౌసల్య భరతుని గేకయపుత్రి
లక్ష్మణ శత్రుఘ్నులను సుమిత్ర
గనియె నా జనకుండు గనియె సీతాదేవి
నా దేవితోడఁ బట్టాభిషిక్తుఁ

గీ॥ జేతు రాముని ననుచు వసిష్ఠుతోడ
దశరథేంద్రుండు తగు ముహూర్తమున నున్నఁ
గైకవరశక్తి నదిమాన్పి గహనభూమి
కనిచె రాముని మునివేష మలరఁజేసి. 7

ఉ॥ కేకయ రాజపుత్రిపయిఁ గిల్బిష మొక్కటి వెట్టి యాత్మ మా
యాకలుషాత్మఁ జేసి సుర లందఱు నాయమ మాటతోనె యి
క్ష్వాకు కులేంద్రు రామవిభుఁ గానల కేఁగఁగఁజేసి రట్లు లో
కైక భయంకరున్ దశముఖాసురుఁ జంపుటకై ముదంబునన్. 8

ఆ॥వె॥ సత్యపాశబద్ధు జనకుని వీడ్కొని
తల్లిఁ గోసలేంద్రతనయ నా సు
మిత్ర నూఱడించి మేదినీపుత్రికన్
బ్రేమఁ జూచి పలికె రామవిభుఁడు. 9

చ॥ ననుఁ బదునాలుగేఁడులు వనంబునఁ గ్రుమ్మరి రమ్మటంచు మ
జ్జనకుఁ డొసంగినట్టి వరసంపద నేమి తలంపు వుట్టెనో
మనమున యౌవరాజ్యమిది మానిచెఁ గేకయరాజపుత్రి య
ట్లని జనయిత్రి యాజ్ఞకుఁ గరాంజలిఁ జేసితి నియ్యకోలునన్. 10

చ॥ ఘన మగు యౌవరాజ్యమున కంటెను మేలొనరించెఁ గోరి న
న్ననిచి మదంబ సత్యమిది యట్లన దిగ్జయకీర్తి లాభముల్
చనుటనె కల్గెఁ గ్రమ్మరను సర్వమహీతల రాజ్యలక్ష్మియుం
దనరెను నాకుఁ దత్కరుణ ధర్మము దీనికి [1](జం)ట యొయ్యెదన్. 11

11 ప. (1) ... ట (వ్రా) జంట (ప)

క॥ కమలానన కౌసల్యా
సుమిత్ర లేప్రొద్దు నన్నుఁ జూచిన క్రియ నిన్
మమకారంబునఁ జూతురు
ప్రమదంబున నుండు మిచటఁ బంపుము నన్నున్. 12

సీ॥ పయనంబు శకునంబు బలె సిద్ధమై మాను
మనుట యమంగళం బైన తెఱఁగు
నీకేల పోవంగ నిలువు మనుట గురు
వచనంబు సేయంగ వలవ దనుట
పనివడి పొమ్మని పలుకుట యది ప్రభు
త్వము నాకుఁ బలుకంగఁ దగవు గాదు
మారు మాటాడక మఱి యూరకుండుట
యవమాన ముద్రగా నాత్మఁ దోఁచు

గీ॥ స్వామి నను డించి యొకఁడవు చనుట గలిగె
నేని నావార్త వినియెద విపుడె నగరు
వెడలు నీతోనె యనుచు సుర్వీతనూజ
యవలి మొగమయ్యె నశ్రుధారాకులముగ. 13

క॥ తన కూర్మిసాధ్వి చిత్తం
బునఁ గలిగిన తెగువఁ జూచి భూపాలుఁడు ర
మ్మనియెద నాతో ననుటయు
[1]ఘనగర్జకు నీలకంఠగతి సతి చెలఁగెన్. 14

వ॥ అప్పుడు శ్రీరాముని వనవాస గమనోన్ముఖత్వంబెఱిఁగి తత్సేవార్థంబు లక్ష్మణుం డును జనువాఁడయ్యె నయ్యిరువురును గౌసల్యా సుమిత్రలకు మ్రొక్కి తమ యుద్యోగంబు విన్నవించినఁ గోడలిని గౌఁగిలించుకొని కన్నీరు తొఱఁగ వార లిట్లనిరి. 15

క॥ బాలవు బాలక్రీడా
లోలవు కడుగోల వడవితోపలఁ దల్లీ
యేలాగు నుండ నేర్చెద
వాళిజనులైనఁ గలరె యనుఁగులు నీకున్. 16

---

14. (1) ఘనగజకుల (వ్రా) ఘనగర్జకు (ప)

ఉ॥ ప్రేమముతోడ బొమ్మలను బెట్టుక యాడుట మాన వెప్పుడున్
గోమలి బోటులం దలఁచుకొంచు మనంబున నెంత కుందెదో
రాముఁ బతివ్రతా గుణపరాయణబుద్ధి దొలంగలేమిఁ జే
తోముద మొప్పఁ బోవుటకు [1] దూఁకొనెదే కత మెట్టు లోర్తుమే. 17

సీ॥ మణిమయోదగ్ర హర్మ్యము లెక్కగా నేర్తుఁ
జక్కఁగా గిరులవి యెక్కు టెంత
ప్రమదవనంబులోపల విహరింపుదు
నింపుగా నడవిఁ గ్రీడింపు టెంత
[2] మృ[దుతల్పములయందు] మేను చేర్చుచునుందు
నుచిత పల్ల[3](వ శ)య్య నుండు టెంత
యేకాంతగోష్ఠిఁ బ్రాణేశుతో వర్తింతుఁ
జెలిక త్తియలను వర్జించు టెంత

గీ॥ యనుచుఁ బతితోడి లోకమై యన్యవాంఛ
చేయనొల్లక యరిగెదు చెల్లు నీకు
నుత్తమ స్త్రీ గుణము లెల్ల నున్న వనుచు
నన్నియును దోఁపఁ బల్కిరి యర్థ ఫణితి. 18

వ॥ లక్ష్మణుని జూచి పలికిరి. 19

కం॥ మా మారుగాఁగఁ జూడుము
భూమిజ దశరథునిగాఁగ బుద్ధి నెఱుఁగు శ్రీ
రాము నయోధ్యాపురిగా
నీ మనమునఁ దలఁపు మడవి నిర్మలచరితా. 20

ఉ॥ రామునినైన నిన్నయిన రాజనిభానన దుర్గభూమి భృ
ద్ధామముల క్షుత్పిపాసలను దూరపుఁ బోకలఁ ద్రోవ నేర్ప లే
కేమని దూరిపల్కిన సహింపుచు మొత్తని మాటలాడి గా
రా మొనరింపుఁడీ హృదయరంజన జాత కుతూహలాత్మగన్. 21

---

17 (1) మూకొనె (వ్రా) దూకొనె (ప)

18 (2) మృదుతల్పములయందు) (పూ) (3) (వశ) (పూ).

వ॥ అని బుద్ధి చెప్పి పంపి రప్పుడు. 22

శా॥ మాయా మానుష వేషధారి హరి రాముక్షోణీ భృన్మౌళి సీ
తాయుక్తుండయి లక్ష్మణుండు గొలువ న్దావచ్చె [1]నుద్యజ్జటా
శ్రీయు న్వల్కల వన్యచిహ్నము మహర్షిత్వంబు సూచింప నా
శ్రీమయ ప్రాయము మానవావిషయమై దీపింపఁగాఁ గానకున్. 23

సీ॥ సంగడికాఁడు వసంతుఁడు రా రతిఁ
గూడ వేడుకతోడఁ గుసుమశరుఁడు
ముని జన్మమునఁ దపం బొనరించి శివుని సా
ధింప వనమునకు నేతెంచి నటులు
వచ్చె నిర్జరపుష్పవర్షవిభ్రాంతిఁ ద
ద్వనమునఁ బుష్పవంతతి యొనర్ప
నడుగులు భూదేవి [2]కందందుఁ బూజా ప
యోజంబులై కడు నొప్పుచుండ

గీ॥ యక్ష రక్షః పిశాచ భయంబు లుడిగె
నడఁగె దావాగ్ని తన్మునీంద్రాశ్రమముల
ననుజుతో సీతతోడ నా యాదివిష్ణుఁ
డట్లు వచ్చిన నయ్యరణ్యాని యందు. 24

కం॥ చనుదెంచి చిత్రకూటం
బునఁ గొన్ని దినంబు లుండి మునిజన గోష్ఠిన్
జనితానందంబున నా
జనపతి యతిరమ్య పర్ణశాలావసతిన్. 25

వ॥ అందు 26

సీ॥ పుష్పాపచయకేళిఁ బొదలుచు వనవీథి
సరసిజలోచన తిరుగు నపుడు
కొలఁకులఁ గమనీయ పులిన దేశంబులఁ
దెలివ [3]యంచలఁ బట్టఁ దివురు నపుడు

23 (1) ను....ద్భుతో (వ్రా) నుద్యజ్జటా (ప)
24 (2) కంద.... పూజోపయోజంబులై. (వ్రా) కందందఁబూజాపయో
జంబులై (ప)
27 (3) యంతలఁబట్టి (వ్రా) యంచలఁఁట్టి (ప)

పర్ణశాలికలోనఁ బన్ని యోమనగుంట
లెలనాగ యాడఁగావఁ నీ నపుడు
భావ సూచక మృదుభాషల విభునితో
నలివేణి ప్రత్యుత్తరు లాడు నపుడు

గీ॥ ప్రాణనాయకుఁ డింపారఁ బవ్వళింప
వెలఁది పువ్వులసెజ్జ గావించు నపుడు
పడఁతి ప్రియుచేతఁ దాఁ బిల్వఁబడిన యపుడు
తన వయస్యలతో డాచఁ దలఁచు మదిని. 72

వ॥ అంత నొక్కనాఁడు శ్రీరామవిభుఁడు సమీపాశ్రమ వాసు లగు మునుల యొద్ద నుచిత గోష్ఠిం బ్రవర్తించి సౌమిత్రియుం దానును దమ పర్ణశాలకు వచ్చి యందు జనకరాజ పుత్రి సఖీసహస్రంబులు గొలువ నుండు నాదిగర్భేశ్వరి యొక్కతియ యున్నం జూచి 28

క॥ ఏము మునిజనులతోఁ జే
తో ముదమున నెపుడు దిరుగుదుము చెలి లేమిన్
భూమిజ యేమనునో యీ
వామాక్షికిఁ బలుకుతోడు వలయు నటంచున్. 29

క॥ తలఁచె మది నా జగత్పతి
తలఁపున కొనఁగూడ దివ్యతరుణీరూపం
బలవడ వనదేవత యొక
చిలుకను మణిపంజరమున సీతకుఁ దెచ్చెన్. 30

వ॥ తెచ్చి రామవిభుని సమ్ముఖంబునఁ బెట్టి యే నిచటి వనదేవతను దేవర విజయంచేసిన కతంబున నత్యంత వికాసంబున నున్నదాన నీ దేవి క్రీడావతికిఁ గ్రీడార్థంబు వేడుకం జూప వలయునని యీ కీరకామినిం గొనివచ్చితి నవధరింపుమని పోయిన నవ్విభుండు సంతోషించి నిన్ను నూసుపుచ్చ నీకుం జెలి కలిగె ననిన నద్దేవి యా విహంగంబుపై మమకారంబున నిట్లనియె. 31

క॥ నీకుఁ జెలికలిగె నంటిరి
యీ కీరవధూటి నట్లు యిది యగునేనిన్
నా కూర్మి చెలివిధంబున
నీ కృప మాటాడవలయు నెయ్యముతోడన్. 32

వ॥ అని వాక్ప్రసాదంబు గోరినఁ బ్రసన్నాత్ముండై పరమాత్ముండగు రామ భద్రుండు నీ కఱపిన మాటలెల్ల నీ కీరరాజంబు నేర్చి నీ మనఃప్రసాదం బొనంగెడు దీని కతంబునఁ గీరజాతి యెల్లఁ గఱపినట్లు మాట లాడునటులుగా వరంబిచ్చితినని యానతిచ్చిన జనకరాజపుత్త్రి హర్షించి. 33

ఆ॥వె॥ పంజరంబు చేతఁబట్టి యా చిలుకకు
మేలిఫలము లొసఁగి మేను నిమిరి
తన మనోరథమున కనుకూలముగఁ బ్రియుఁ
బిలిచి మాట లాడవలయు ననన. 34

క॥ రామా రాఘవ రామభద్ర యనుచు న్నామ ప్రసాదార్థ మా
రామారత్నము చెప్పెఁ గీరమునకున్ రామాహ్వయోచ్చారణ
ప్రేమన్మన్న తనంతనే తనప్రియు న్బేరొ్కంట పిగ్గంచు గా
రా మారంగఁ దదద్రిరాట్పుర సుపర్వస్త్రీలకుం బ్రీతిగన్. 35

గీ॥ సీత చెప్పినట్లు చిలుకయుఁ గడు మధు
రంబుగాఁగ రామరామ యనుచు
రాముఁ బిల్వ నేర్చె రసికత్వమున మాట
లాడ నేర్చెఁ గఱపి నట్లు మఱియు. 36

ఆ॥వె॥ అదియు మొదలుగాఁగ నఖిల కీరంబులు
రామవిభుని కరుణ రామ పూర్వ
కముగ మాటలాడఁగా నేర్చె జగములఁ
గలుగు సకల పక్షికులమునందు. 37

చ॥ ప్రియత మనోవికాసమునఁ బ్రత్యహము న్జతురాస్యు నొద్ద న
ధ్యయనము సేయు నారదముఖాదిమ దివ్యమునీంద్ర కోటితో
నియమము పూని భారతికి నెయ్యపునెచ్చెలికత్తె యైన చి
ల్కయు మును రామరామ యని గాని పఠింపదు వేదశాస్త్రముల్. 38

కం॥ భారతియు నజుఁడు నటువలె
శ్రీరామారామ యనచుఁ జిలుక పలుకగాఁ
గోరిక నునిచిరి మోక్ష
శ్రీ రామా (కే)లికాంక్షఁ జిత్తం బలరన్. 39

---

75 పే 89 ప. 1....లి (ప్రా). కేలి. (ప)

వ॥ అని వాలఖిల్యమునులు పరమహర్షంబున రామస్మరణంబుచేసి యిట్లనిరి. 40

గీ॥ ఆదివిష్ణువు లక్ష్మితో నట్లు మనుజ
వేషమున నుండ మౌను లప్పేపిన భూమి
నతని కేళివిహారంబు లాత్మ నెఱిఁగి
కొలుతు రా రామ మహిమను దలఁచుచుండ్రు. 41

చ॥ అనవుడు కుంభజుం డనియె నాక్రియ భూమిజ రామచంద్రునిన్
దనమది కింపుగాఁ జిలుక [1] తా నుపదేశ మొసంగినట్లు పి
ల్చినఁ దగు మాటలాడిన హసింపుచు నెయ్యపు [2] బోంట్ల పొందు నె
మ్మనమునఁ గోరదయ్యెఁ [3] బతిమచ్చిక నుబ్బుచు నాఁడునాఁటికిన్. 42

ఉ॥ రామునిఁ బిల్చుచుం జిలుక రాముని బాడుచు నట్లు విచ్చలున్
భూమిజ కింపొనర్ప గిరిపొంతఁ జరించెడు [4] కిన్నరాంగనల్
రాముని బాడుచుం బ్రియుల రంజిలఁ జేయుచు నుండఁగా ముని
గ్రామణు లచ్చటన్ వినిరి రామమనోహర నామగీతికల్. 43

కం॥ విని రాముని వర్ణించుచుఁ
గనుపండువుగాఁగ విజిత కందర్పుని నా
మునిజనము చూచుచుం డ
జ్జనకసుతాన్యోన్య కేళిచర్య లెఱుఁగుచున్. 44

కం॥ రాముఁడు బ్రహ్మం బనియును
రాముఁడు మాయామనుష్య రమణీయ హరి
శ్రీమూర్తి యనియు జగదభి
రాముఁ డనియు [5] (మునులు) దత్పరత్వము కలిమిన్. 45

---

42 (1) తా ......నంగినట్లు (వ్రా) తానుపదేశమొసంగినట్లు (ప)
42 (2) బోట్లపొదు. (వ్రా) బోంట్లపొందు (వ)
42 (3) ....తి మచ్చిక. (వ్రా) పతి మచ్చిక (వ)
43 (4) కిన్నెరాండ్లు (వ్రా) కిన్నరాంగనల్ (వ)
45 (5) మునులు. (పూ)

ఉ॥ సీతను నాదిలక్ష్మి యని చిత్తములం బరికించి [1]రాముఁడున్
సీతయు నా గిరీంద్రమునఁ జిత్రజలీలలఁ దేలుచు న్వన
వ్రాతములందు [2]దిక్కుల విరాజిలు రత్నదరీ గృహంబులన్
బ్రీతిఁ జరింప నమ్మునిగరిష్ఠులు [3]గాంచి తలంచి రివ్విధిన్. 46

ఉ॥ పనివడి యీ విధంబునఁ దపం బొనరించెనొ లక్ష్మి యీ సనా
తన సుఖమూర్తి విష్ణుఁ బరతత్త్వముఁగూడి సుఖించుచున్న ద
త్యనుపమలీల లిట్లు మన మందఱ మింతులమై చరింత మా
వనజదళాక్షు రాముని నవశ్యము గూడి రమింత మా రతిన్. 47

క॥ చాలు మునివృత్తి తపములు
చాలున్ మన కేల రామచంద్రుని గరుణా
లోలుని గని మన కోరిక
వాలాయము విన్నవింపవలయు నటంచున్. 48

వ॥ పరమ పావన చరితు లగు భరద్వాజ మహాముని ప్రముఖు లగు విజ్ఞానులు మదనశరపీడితులై రాముని మోహించి వచ్చి తత్పర్ణశాలాంగణంబును జేరి [1]...... (వచన రచన చతుర దివ్య శిల్పాంగనా) నియమిత ప్రదేశంబున నిల్చి (మనోహర సురభిళ) తరులతాంత కల్పిత సమున్నత తల్పంబున. 49

ఉ॥ పువ్వుల తీఁగెలం గెలనఁ బువ్వులు గోసి విలాప రేఖమై
పువ్వుల సొమ్ము లిట్టివని పువ్వుల(దండ లలంకరించినన్)
బువ్వులవిల్తు గెల్చిన విభుండు రఘూద్వహుఁ డక్కజంబుగా
నవ్వనజాక్షికిం బొసఁగ నందఱు సూచిరి కామవిక్రియన్. 50

వ॥ అవ్విధంబునం బరమైకాంతకేళిం గాంతాసమేతుండై యనంత విలాస రస [2] (దంతురితాంతరంగుం డగు)చున్న శ్రీరామచంద్రునిం గన్నులారఁ గాంచి ద్విగుణిత మనోరథంబుల మనంబులు కరంగ కరకమలంబులు మోడ్చి యానంద బాష్పంబులు దొరఁగు నయనంబులతో నందఱు నేమియుం బలుకనేరక యూరకున్న భరద్వాజ మహాముని రామున కిట్లనియె. 51

---

49— (1) మొదటి వ్రాతప్రతియందు ఇట్లే అసమగ్రముగా నడుమనడుమ లుప్తమై యున్నది.
రెండవ వ్రాతయం దీ భాగము వినష్టము.

51— (2) కుండలీకృత భాగము పూరణము.

క॥ దేవుఁడవు బ్రహ్మమయుఁడవు
నా విష్ణుఁడ వీ లతాంగి యా లక్ష్మి జగ
త్పావన నరదంపతులై
యీ విధమున నున్నవా రభీష్ట క్రీడన్. 52

వ॥ అట్టి భవదీయ దివ్యనవ్యక్రీడలు విని మునుల మందఱము నీకు మోహించి (దేహాభి)మానంబులు వాసి యీ దివ్యాంగనతోడం గూడి నిన్ను రమియించి యంగాంగస్పర్శ కైవల్యసుఖం బనుభవింపం గోరితిమి మా తపఃఫలంబులు గైకొని నీరస కఠిన పాషాణంబునకు నారీరూపం బనుగ్రహించిన మీ శ్రీపాద పద్మంబుల రజంబున మాకుం గామినీరూపంబులు కరుణించి నిజాభిమతం బనుగ్రహింపు మనిన వారివలనం బ్రసన్నాంతఃకరణుండై మందస్మితం బడర రామ చంద్రుం డిట్లనియె 53

క॥ ఈ యవతారంబున నన
పాయ మతిం బూని యేకపత్నీవ్రత ని
ష్ఠాయుక్తుఁడనై జానకిఁ
బాయ రతిక్రీడ కానపడ సిరినైనన్. 54

మ॥ భవదీయాభిమతంబు శ్రీమదనగోపాలావతారంబునన్
నవపుష్పాయుధకేళి మీ కొసఁగుదు న్నానావిధ క్రీడ గో
ప వధూమూర్తుల మీరు పుట్టినపు డీ పద్మాక్షి వైదర్భియై
సవరించు న్మిము బోటికత్తియలుగా సత్యాది సంభావనన్. 55

వ॥ అని వరం బిచ్చిన నట్లగుఁగాక యని యానందభరితులై యమ్మహావ్రతులు రాముని వీడ్కొని వచ్చి కృష్ణావతారంబు ప్రతీక్షింపుచు రామధ్యానంబునం దపంబులు సలుపుచుండి రంత భరతుండు రామభద్రుంకు వనవాసంబు వచ్చు సమయంబున శత్రుఘ్నుఁ డునుం దానును మేనమామ పట్టణంబున నున్నవారై యవ్వార్త విని యయోధ్య కతిత్వరితముగా వచ్చి రామవిరహదుఃఖంబున మృతుండైన తండ్రికిం బరలోక క్రియ లొనర్చి తల్లులు న్దానును వసిష్ఠుం దోడ్కొని చిత్ర కూటంబునకు వచ్చి వినయవినమితోత్తమాంగుండై దశరథునితెఱం గెఱింగించి తదుచితకృత్యంబులు నిర్వర్తించిన యగ్రజునిం గ్రమ్మరు మని ప్రార్థించిన నప్విభుండు. 56

ఆ॥వె॥ తల్లిదండ్రు లాజ్ఞఁ దలమోపి పదునాలు
గేఁడు లవనినుండ నేను సత్య
మాడి వచ్చినాఁడ నది దప్ప నేర్తునే
సత్యహాని నపయశంబు గాదె. 57

క॥ అని సత్యవ్రతుఁ డగు నా
జనపతి సాకేతరాజ్య సంరక్షకుసై
తనపాదుక లతఁ డడిగిన
ననుగ్రహము చేసి యనిచె సమ్మదతోడన్. 58

క॥ అనిచిన వెండియు భరతుం
డనియెం బదునాలుగేండ్ల కగు తుది దివసం
బునఁ బదునాలుగు ఘడియకు
ననఘా రాకున్నఁ జత్తు మమ్మలు నేనున్. 59

వ॥ అనినం గరుణార్ద్రహృదయుండై తమ్ముని భక్తికిం బ్రశంసించి యియ్య
కొనియె నంత. 60

క॥ ఏకాంతమున వసిష్ఠుం
డా కాకుత్స్థేంద్రు బ్రహ్మమగు రూప ముప
శ్లోకింపుచుఁ జనె నానం
దాకుల హృదయంబుతో నిజాశ్రమమునకున్. 61

వ॥ అనిన వాలఖిల్యులు రఘుకుల[1]గురుండ నవక యద్దేవుని నెఱింగి సేవించి చనిన
వసిష్ఠమహాముని యుత్తమ జ్ఞానంబున కళినందించి తరువాత కథ నడిగిన
నగస్త్యుం డిట్లనియె. 62

క॥ ఒక వత్సర మాత్రమ చి
త్రకూట గిరినుండివచ్చి [2]ధరణీపతి త
న్నికట వనమున విరాధుని
దెగటార్చెన్ దుష్టదనుజు దివిజులు మెచ్చన్. 63

---

62– (1) గురుండనక. (వ్రా) గురుండననక (ప)
63– (2) ధరపతి. (వ్రా) ధరణీపతి (ప)
(ఈ పద్యము కగలకు ప్రాస కలదు.)

ఉ॥ రూఢ తపోవనాశ్రమ విరోధు విరాధు వధించి విక్రమ
ప్రౌఢిమ వచ్చుచున్న రఘురాముఁ గనుంగొని మౌను లెల్ల దు
ర్గాఢ నిశాచర ప్రవరకల్పిత మాయకు విచ్చనంబునన్
[1]రీఢ మటల్లె నింక నని ప్రీతిఁ దపంబులు సేసి రందఱున్. 64

మ॥ ధృతి లీలావన విస్ఫుర ద్భవదవార్చివ్యాప్తి చల్లార న
ప్రతిమానాప్మదనేక జన్మ సుకృత[2]ప్రావృడ్విలాసాగత
క్షితిజావృష్టిసమేత రాఘవ నృపశ్రేష్ఠామృతాంభోద మూ
ర్జితమై లక్ష్మణ చాతకప్రియము వచ్చెన్ జూడ్కు లింపారఁగన్. 65

మ॥ కరుణాంభోనిధి జానకీరమణు సాక్షాద్బ్రహ్మ తేజోనిధిం
బరమ ప్రీతమతిం దపం బుడిగి లోపాముద్రతోఁ జేరి త
చ్చరణాంభోరుహ యోగజాత శుచితాంచన్మౌళినై తెచ్చి భా
స్వర దర్భాసన భాసితుం డయినఁ బూజ ల్సేసితిన్ భక్తితో. 66

క॥ భూమితనూజను నీ లో
పాముద్రయుఁ బూజచేసి పావనమతి శ్రీ
రామవిభు పుణ్యకాంతన్
హైమవతీ ధ్యానయోగ నాగమ మృగ్యన్. 67

సీ॥ కమనీయ నవ్యమేఘ [3]పతిమాత్మాంశు
నృత్యదాశ్రమవనీ నీలకంఠు
శ్రీశివంకర నేత్ర శితశతపత్రసం
చయ పమాకృష్ట పుష్పద్రుమాళి
మదన సమ్మోహన మహనీయ సౌందర్య
పమ్మోహితానేక సన్మునీంద్రు
శంకర శంకర స్వపవిత్ర తారక
బ్రహ్మ [4]బ్రహ్మార్చితు బ్రహ్మతేజు

గీ॥ జానకీ చంద్రికా చారుచంద్రు మైథి
లీ లసన్మంజరీరమ్యరేఖ శాఖఁ
దత్పరతఁ గొల్చి తత్ప్రసాదంబు వడసి
పంతతానంద ఫలరసాస్వాద మంది. 68

---

64 (1) సీఢ (వ్రా) రీఢ (ప)
65 (2) ప్రా.... ద్విలాసా (వ్రా) ప్రావృడ్విలాసా (ప)
68 (3) ద్రిమదాత్మాంశు (వ్రా) ప్రతిమాత్మాంశు (ప)
68 (4) బ్రహ్మదర్చిత – (వ్రా) బ్రహ్మార్చితు (ప)

భీమ భవానల శాంతికి
రామా యనమో యటంచుఁ బ్రాజ్ఞు లనిశమున్
నీమమునఁ జేయు తప మిది
రామునికథ చేసితి న్నిరంతర బుద్ధిన్. 69

జయ రామాయ నమో యని
నియమంబున దేవభర్త నిత్యంబు జగ
జ్జయమునకుఁ జేయు జప మిది
నయమునఁ జేసితిని రామనరపతి ప్రేమన్. 70

పాయక ఓం రామా యన
మో యని శుకముఖ్యులగు ముముక్షులు భక్తిన్
జేయు జపం బిది చేసితి
ధీయుక్తుఁడ నగుచు రామదేవుని యెదుటన్. 71

రాముని ముందట జయజయ
రామా యనమో యటంచు బ్రహ్మ జపించున్
బ్రేమ న్బ్రహ్మ జ్ఞాన
శ్రీ మహిమకు నదియు జపము చేసితిఁ బ్రీతిన్. 72

శ్రీ రామా యనమో యని
శ్రీరాముని దండ జపముఁ జేసితి శివుఁ డిం
పారఁగఁ గాశీమృతులకు
గారవమున నొడువు తారకబ్రహ్మంబున్. 73

ఆనందంబున నీక్రియ
నే నెంతయు నేను భక్తి నెఱసిన మతి నా
నా నియమంబులు సీతా
జాని శ్రీరాముఁ గొలిచి సమధిక భక్తిన్. 74

మఱియు నా తపఃప్రభావంబున నక్షయ బాణతూణీర దివ్య చాపంబులు నిర్మించి
కాలోచిత యోగ్యపూజకుం దగ నమర్పించిన నన్ను ననుగ్రహించి. 75

క॥ వంచవటిని నుండెను రా
త్రించర సంచార కేసరిప్రముఖ మృగో
[1] దంచత్కోలాహలమై
మించిన కాఱడవి నపరిమిత భుజశక్తిన్. 76

క॥ [2]సూక్ష్మావలగ్నవతి మృగ
లక్ష్మసమానాస్య నా యిలాపుత్రిని రా
మక్ష్మాపతి తోడ్తోడన్
లక్ష్మణుఁడును గొల్చివచ్చు లక్షణ మొప్పన్. 77

మ॥ ధరణీ [3] ధూర్వహ పన్నగేంద్రుడు సుమిత్రానూతి నిద్రాసతీ
విరతిం దల్లిని దండ్రినిం బలెను నుర్వీనందనున్ రాముఁ ద
త్కరుణాపాత్రుఁడు గాచె రేలుపగలున్ గాంతారభూమిన్ ధను
ర్ధరుఁడై యోర్చి తదర్చనాపరత సంత్యక్తాన్నపాన స్థితిన్. 78

క॥ జానకియుఁ దాను రామ
క్ష్మానాథుఁడు గ్రీడ సల్పె నంతవమున ను
ద్యానమునఁ బోలెఁ దద్వని
నా నీతిం దమ్ముఁ దమ్ముఁ డనిశము గొల్వన్. 79

సీ॥ జలరుహోల్లసిత కాసారముల్ గలఁచు కా
సరసమూహముల నోసరిలఁ జేసి
మహితకోటర నాకు [4] మధుభక్షకుల ఋక్ష[5]
ప ప్రకరంబుల బడలుపఱిచి
సమధిక పుష్పకుంజ క్రోడముల నుండు
పుండరీకంబుల పొంక మణఁచి
కమనీయ గిరిదరీ గర్భముల్ చేకొన్న
కంఠీరవంబుల గర్వ ముడిపి
గీ॥ వివిధ ఫలవృక్షశాఖలు విరిచి తిరుగు
కరుల వారించి వనుల నిష్కంటకంబు
చేసె లక్ష్మణుఁ డధిపతి సీతతోడ
వలసినట్లుగఁ గ్రీడింప వలయు నంచు. 80

---

76 (1) పంచ (వ్రా) దంచ (ప)
77 (2) సూక్ష్మావల్లతతం. (వ్రా) సూక్ష్మావలగ్నవతి (ప)
78 (3) దుర్వహ. (వ్రా) ధూర్వహ. (ప)
80 (4) మరివిషువుల (వ్రా) మధుభక్షకుల (ప).
(5) రూక్ష పత్రకరంబుల— ఋక్షప్రకరంబుల (ప)

క॥ దుష్టమృగ రహితమై వి
శిష్టాంతశ్శత్రు మౌని వనమృగ యుతమై
స్పష్టమ్మై రాముని మది
కిష్టంబై వనము నొప్పె నెంతయుఁ జూడన్. 81

క॥ రతి మదన భ్రాంతి[1]కర
క్షితిజా రామక్షితీశ సేవాప్రీతిన్
జతురప్రీతి సహాయుఁడు
హితసహచరుఁడై వసంతుఁ డెదురుగ వచ్చెన్. 82

సీ॥ [2] లజ్జ పురాణ దళస్ఫూర్తిగా జారె
వధర పల్లవ రాగ మతిశయిల్లె
మంజుల వక్షోజ మంజరుల్ రంజిల్లె
లావణ్య మకరంద లవము లలరె
మధుర నిశ్వాస కోమల మారుతము మించె
రమణీయ హాస వరాగ మెసఁగెఁ
జారుతరప్రేమ సౌరభం బేపారె
నాలోల దృగ్విలాసాళు లలరె

ఆ.వె. [3] నవనిజావనీరుహాళి లీలారామ
వైభవంబు లోక వర్ణితముగ
[4] శుకపికాద్యనేక సుభట కోలాహల
మదన వహిత మధువమాగమమున. 83

సీ॥ భామ పూగుత్తులఁ బట్టి కోయంగ దాఁ
గుచములు పట్టుఁబూఁగుత్తు లనుచుఁ
దెలువ పూఁగొమ్మపైఁ [5] దేంట్ల నోడియఁగఁ దా
నలకజాలము తేఁటు లనుచు నొడియుఁ
గొమ్మ పూఁదేనియఁ గ్రోలంగఁ దాఁ బువ్వుఁ
దేనియ యని మోవి తేనె గ్రోలు

82 (1) దంతక్షతిజా (వ్రా) కర క్షితిజా (ప)
83 (2) లజ్జాపూరణ (వ్రా) లజ్జ పురాణ (ప)
83 (3) నవనిజాని వనిరుహాళిలీ రామ (వ్రా) నవనిజావనీరుహాళిలీలారామ
83 (4) శుకరదాన్య (వ్రా) శుకపికాద్యనేక (ప)
84 (5) దెల్లి (వ్రా) దేంట్ల (ప)

నతివ పూఁదావికి [1] నలరుచుసుండఁ దా
నతివ మైతావికి నలరు చుండు

గీ॥ భ్రాంతినో ప్రేమనో రామభద్ర [2] నృపతి
[3]కాంచు విభ్రాంతి ప్రేమచేఁ గాని తత్ప
దార్థము ల్పోల వాసీత యవయవముల
నవ్విభుండును సర్వజ్ఞుఁ డరసి చూడ. 84

ఉ॥ చందనగంధి గంధవహజాత సదాగతి దోఁచ లీలమై
నందెలు ఘల్లుఘల్లు మన నల్లన వల్లభుతోడఁ గూడి యం
దంద చరింపఁ దద్వనజలాశయ [4] హంసిక లెల్లఁ గేరెరుచున్
గ్రందయి వచ్చు సీత వెనుక న్గనకచ్ఛదదీప్తి పర్వఁగన్. 85

చ॥ (5) విధుముఖి యొక్క పువ్వుఁబొద వేడుకఁ జొచ్చి మరంద పూరముల్
మధురతరంబు గ్రోల నిజమంజు ముఖాంబుజ గంధలుబ్ధమై
మధుపము ప్రాలిన న్బెదరి మర్ది బహిస్థలిఁ గౌఁగిలించె న
య్యధిపతి మై గగుర్పొడువ హాటకకుంభనిభ స్తనంబులన్. 86

చ॥ ఉరుఫల మాతులుంగలత యొక్కెడ గాడ్పునఁ దూఁగి యూడఁగా
నరపతి చూచు రాముఁడు ఘనస్తన కుంభభరంబుచేత నో
ధరణిజ లేత నెన్నడుము దా వసియాడఁ గ సంచరించు లా
గిరవుగ నాటమై నభినయించెడు తద్వనలక్ష్మిగా మదిన్. 87

క॥ సరస వకుళ ముకుళ ప్ర
గ్ధర కంఠముతోడఁ గంబుకంఠి తనర్చెన్
బరితః కించిద్దష్టాం
బురుహ మృణాళాస్య యంచపొలఁతుక వోలెన్. 88

---

84 (1) నలరు పూ దావియు మెనిమెనితావికి (వ్రా) నలరుసుచుండఁదా నతివమై తావికి(ప)
(2) ....(వ్రా) నృపతి (పూ)
(3) నామవిభ్రాంతి (వ్రా) కాంచు విభ్రాంతి (ప)
85 (4) పాంబక (వ్రా) హంసిక (ప)
86 ఇందుముఖి (వ్రా) విధుముఖి (ప)

క॥ సిందూరిత కుంభద్వయ
కందర్పద్విపములీలఁ గనకాబ్జ రజ
స్సుందర కుచకుంభంబుల
నిందువదన తిరిగె మదవిశృంఖల వృత్తిన్. 89

గీ॥ పసిఁడి సంపెఁగ పూదండ పద్మగంధి
ధవుని కంఠంబు నందు నందముగ వైచె
నదియు [1]వల్లభ హృదయ గతానురాగ
[2]పాళివల్లీ వశ్రితచ్ఛాయ భంగి నలరె. 90

ఉ॥ ఉయ్యల నూఁచ రామవిభుఁ డొక్క రసాల విలంబి వల్లిక
న్నెయ్యము తియ్యము న్నెరపి నేర్పున నొక్కెడ భూమిపుత్రి నా
తొయ్యలి యప్పటప్పటికి దూరపుటూఁగుల రాక పోకలన్
జయ్యన గుండె ఝల్లు మన సంచలియింపుచుఁ గౌఁగిలింపుచున్. 91

క॥ సౌందర్యేందిందిరభావుక
కందర్పానల్పదర్ప కమలవనీ పూ
ర్ణేందుఁడు రాముఁడు సీత న
నిందితరతి నతిసుఖాంబునిధిఁ దేలించెన్. 92

ఉ॥ ఆమని గాఁగఁ గేళి మధురాధర బింబఫల ద్రవంబు శ్రీ
రామ నరేంద్ర కీరము ధరాతనయార్పిత మర్థిఁ గ్రోలుచున్
హేమ[3]విభాసి తత్తను సమీహిత పంజరవల్లి వ్రేలుచున్
బ్రేముడి రామరామ యని పిల్చు మృదూక్తిని బూను రాగిణిన్. 93

క॥ రమణి నును మోవి నవ్విభుఁ
డమృతము కదుఁగ్రోలఁ గ్రోల నదియును నుబ్బున్
సమధికమై పుణ్యాత్ముల
కమృతస్థితి కలిమి కక్షయంబుగఁ గాదే. 94

---

90 (1) అదితదీయహృదయానురాగ (వ్రా) అదియు వల్లభ హృదయగతానురాగ (వ)
90 (2) పాళవల్లీ· (వ్రా) పాళివల్లీ (వ) 90
93 (3) విభాద్య (వ్రా) విభాసి (వ) 93

చ॥ [1]బహుతరుమూల కుంజకృత పల్లవ పుష్పమనోజ్ఞ శయ్యలన్
బహురతిబంధమర్మముల భావజకేళి సుఖాబ్ధిఁ దేల్చె న
మ్మహిపతి జానకీరమణి మంజుకుచద్వయ చక్రదంపతుల్
మహిత నఖాంక నూతన హిమద్యుతిచేఁ గడు నేర్పుచుండఁగన్. 95

క॥ రాముని [2]యురమొత్తెడు నిది
యేమిటికని హంస పతక మేలించి రతిన్
బ్రేమమునఁ గౌఁగిలించిన
భామ కుచములకు మయూర పతకము కలిగెన్. 96

క॥ సుందరితో లఘు గురువుల
చందమున నఖాంక యుగళి చాలఁగ నొప్పెన్
గందర్ప ద్విపకుంభము
లం దూడిన సూత్రికరకయగు సృణి కరణిన్. 97

క॥ పతి కౌఁగిట నొక్కటియై
సతి రతి తుద లేచివచ్చె జలజాప్తుని సం
గతి నింపుక యెడబాసిన
ప్రతిపచ్ఛశిరేఖవలె దరస్మిత దీప్తిన్. 98

సీ॥ మల్లికానవపుష్పమయవేది విశ్రమ
హేతువు గావించి యింపొనర్చె
మాధవి పూఁగ్రోవి మకరంద పూరంబు
చిలికి శైత్యంబునఁ జెందఁ జేసె
గదళిక రాపున మెదిపిన కర్పూర
చూర్ణంబు పైఁ జల్లి సొంపొనర్చె
లవలీసపుష్పపల్లవ తాళవృంతంబు
వీచి యానందంబు విస్తరించె

గీ॥ రతి పరిశ్రమ శాంతికి రాజదంప
తులకు నా జానకీరాఘవులకు నెపుడు
మంద పవన ప్రసరణ సంభ్రమ వశమున
నమఁగు పరిచారకులవలె నవ్వనమున. 99

---

95 (1) బహు తర (వ్రా) బహుతరు (ప)
96 (2) యురమె త్తెడు (వ్రా) యురమొత్తెడు (ప)

వ॥ అంతఁ జిరకాలోపలాలనాభూన్య కఠిన భావంబున వశవర్తికాక నిలిచి చంచ ప్రకృతి వారనారీ సమాకృష్యద్ధమ్మిల్ల వల్లికానమ్ర ప్రియవల్లవుండునుబోలె నల్లసిల్లి పూలెక్కుడించి వంచాస్త్రుండు [1] పంకరుహంబు వీడి చిగురు వాలు కేల ఝళిపించుచుండె నవ్విధంబున రామచంద్రుండు జానకీచంద్రి కాభిరామమూర్తి నానంద సుధాధురంధర హృదయంబున సదృశవస్తుతులా ప్రమాణ సమరాత్ర దివంబులగు మధుమాధవ దినంబులుడిపి సీతావంశవద మనోరథ లతలకై వడి దీర్ఘ దీర్ఘంబులై నిగుడు దివసంబులుంగల నిదాఘాగేహంబున శిశిర జలాశయ వారివిహారంబులవలనఁ గురువకొమ్మ మాలికలఁ బ్రాఁకి ప్రబ్బికొనిన గురువెంద పందిరుల క్రింద నికటపాటల ప్రసవామోద మేదుర తపోవన సంచార గరదవిరళ మకరంద బిందుపంసిక్త స్థలారవింద సుందరోపధాన కర్పూరగర్భ పలాశకోమల శయ్యాతల సులభ సులభ సుఖనిద్రలవలవను సమీప పుష్పచాప ప్రకంపిత మండలాగ్ర ద్యుతి శంకానుకారి చపలావిలాసంబులుగల నభోనభస్యంబుల నీరంధ్ర పర్ణపూర్ణ విస్తీర్ణ పర్ణశాలాంతరాళంబున ఘనఘనాఘన శబ్దగ్రహణ గ్రాహ్య గంభీర ఘుమఘుమధ్వానకృత శిఖండి తాండవాడంబరాలోకన సముద్దీపిత మదనోద్దీ పన నిరూఢ పరస్పర గాఢాలింగనబంధ బంధురక్రీడలవలవను మైథిలీ హృదయ వదన విలోచన విలాస భాసమాన విమలజల వికచకమల తరళ శఫర నదనదీ సముదయంబులుంగల శరత్కాలంబున జీవంజీవజీవాతుమేదుర ప్రసాద కౌముదీరస స్వచ్ఛ పులిన దేశంబునఁ జంద్రబింబకళంక ప్రతిబింబం బనందగు నిందీవర తల్పంబున భూపుత్రీమణి నూపురంబులంగల యడుగుం గెంజిగురాకులును బవిండి నిగనిగలు నిగుడు మసుందొడలును మదనమందిర దీపాయమాన మాణిక్య మధ్యమ మేఖలా వలయిత నితంబంబును జిగిబిగులు గల్గిన యున్నతస్తనంబులును సురతసూచక దరస్మిత వదన చంద్రమండ లంబును జంపక వకుళ పుష్పమాలికాలంకృత శిరఃపురోభాగ రచిత ధమ్మిల్ల బంధంబును మోహబంధంబులై హృదయంబు కరంగింపఁ బునఃపునరాలోకన స్పర్శన చుంబన పరిరంభణంబు లొనర్చుచు సంభోగించుచు సారస్యంబుల వలన శృంగార సాత్త్వికోదయంబున నాది ప్రియాగమవంబునుంబోలె శరీ

100 (1) కరుహా వాడి (వ్రా) పంకరుహంబువీడి (వ) 100
(2) చైత్రి సఖేగారకభవరుండు (వ్రా) చైత్రిసఖ ప్రివరుండు (పా)

రంబు పణఁకంజేయు సహస్రహస్యంబుల గిరిమణిదరీగర్భంబుల నగరు నిశ్వాసపరిమళ మిశితమై దేహీ నఖంపచోష్ణంబగు గుత్తంపుఁజన్నుగవ యొత్తున హృత్తి పవ్వళింపుటలవలన నాత్మ లజ్జాభిమాన ధనాపహరణ ప్రవీణ [2]చైత్ర సఖప్రివరుండు చల్లిన చొక్కుఁ బూఁదేనియ యనం దొరఁగు పాలేయ కణ పరంపరలు గల శిశిరర్తువున నవిరళ దళకాండ విటప వటతరుపరివృత కాశ్మీర లతాగృహంబునం గుంకుమ రజోవిరాజిత జనకతనయా సమున్నత స్తనాంక పాళి సమ్మేళనంబున నుండుటవలన సాకేత సామ్రాజ్యలక్ష్మీ విలాసానుభవ పారస్యంబు నిరాకరించి సకలభోగంబులు సీతాసంభోగంబునంద యనుభవించుచు వైకుంఠ దివ్యభవనవిశేష పర్యంకలక్ష్మీ సమేతుండై యుండు నాఁటికంటె పరమానందంబునం గ్రీడింపుచు నా దండకారణ్యంబునం బంచవటిఁడేం డ్లుండె నప్పుడు. 100

చ॥ తలఁచిరి వాసవాది విబుధ ప్రవరు ల్రఘురామ మేదినీ
తలపతి జానకీ సురత తంత్ర సుఖాంబుధి మగ్నుఁ డయ్యె ని
వ్వలి పనియింక నెట్లగు నవార్య బలాఢ్యుఁడు రావణాసురుం
డిలుగుట యెట్లు ప్రాణులకు నెట్లు సుఖం బగు నంచు నందఱున్. 101

క॥ ధాతృ పురారి ప్రముఖులు
నాతుర మతి లోకబాధ లన్నియుఁ జెప్పన్
ప్రీతి నభయ మిచ్చె మహా
ఖ్యాతిగ రావణు వధింతు నని హరి కరుణన్. 102

శా॥ ఆ విశ్వప్రభుఁ డర్కవంశమున మాయామానవాకారుఁడై
యావిర్భావమునొంది ప్రాకృతుని యట్లయ్యె విభుం డా రమా
దేవీ దివ్యకళాంశజ న్జనకపుత్రిం గూడి క్రీడించుచుం
బూవిల్కానికిఁ జిక్కెఁ దక్కిన జను ల్పాష్పాయుధుం గెల్తురే. 103

వ॥ అని బృహస్పతి యిట్లనియె. 104

క॥ మారున కగపడక కులా
చారాదులు నిర్వహించు సుతులుం బతులున్
లేరు జగంబునఁ బుట్టని
వారు స్నేహంబు లేనివారుం దక్కన్. 105

సీ॥ ఉత్తమ యోగీశ్వరోర్ధ్వగ రేతో ర
సంబు క్రిందికి డించు చతురిమంబు
బ్రహ్మచర్య వ్రతపరుని దెబ్బడియేండ్ల
వానిఁ బెండ్లాడించు మానుషంబు

చర్మాస్థి శేష కృశ ప్రతికునిఁ దప
స్విని రతోల్బణకాయుఁ జేయు బలము
వనిత వే తెఱఁగని వనవాసిమునిఁ బర
స్త్రీలోల హృదయుగాఁ జేయు మహిమ

గీ॥ శిష్యుఁ డాచార్య పత్ని నాసింప భూమి
సురుఁడు చండాలి నాసింప సుతుఁడు గన్న
తల్లి నాసింపఁ జేయు [1] పంతంబు గలుగు
వాఁడు వలరాజు వాని నెవ్వాఁడు గెలుచు. 106

సీ॥ పతిదేవతాగణ్య పరమతపస్వినిఁ
బరపురుషున కాన పడఁగఁ జేయు
రాణివాసపు టసూర్యంపశ్య జారవాం
ఛాసక్తిఁ [2] బలు తిరుగాడఁ జేయు
నధ్వరాది మహాప్రతాచార్య వతి నల్ప
జాతి విటప్రీతి జరుగఁ జేయు
నుత్తమ స్త్రీనైన నొంటి నెవ్వని నైనఁ
బైఁబడి రతికాంక్షఁ బట్టఁ జేయు

గీ॥ నెగ్గు మానంబు గలదాని [3] నెద్దెఁ జేసి
తండ్రి తోఁబుట్టుగుల నిజధవుని మామఁ
జుట్టముల నొక్క తృణముగాఁ జూడఁ జేయు
మరునిచేఁ దూలి[4] (పడనట్టి మగువ)గలదె. 107

వ॥ అన నద్దేవేంద్రుండు తలయూఁచి యట్లయో నిట్టి ప్రభావంబు మదనుని కెట్లు గలిగె వీఁ డ[5]ధర్మ కర్మంబున కెట్లు పాలువడియె వీని జన్మ ప్రకారంబు నెట్లనిన బృహస్పతి బ్రహ్మముఖంబున నెఱింగిన నారదుని వలన నే వినిన క్రమంబు చెప్పెద నాకర్ణింపుము. 108

---

106 (1) తపంబు (వ్రా) ఇందుయతిభంగము-పంతంబు. (ప)

107 (2) బలిదిరిగాడఁజేయు. (వ్రా) బలుతిరుగాడఁజేయు (ప)

107 (3) ....జేసి (వ్రా). (నెద్దెఁజేసి) (పూ)

107 (4) (........) (వ్రా). (పడనట్టిమగువ)(పూ)

108 (5) ........ (వ్రా) (ధర్మ) పూ.

సీ॥ ఆదికాలమున నారాయణుండు విశుద్ధ
భాస్వర తేజో విభాసితుండు
తన నాభి బ్రహ్మ నుత్పాదించె నాబ్రహ్మ
ఫాలభాగంబున భవుఁడు పుట్టెఁ
బుట్టిన వారల భువనముల్ నిర్మించి
భువనాధిపతులరై వివిధ గతుల
వర్తింపుఁ డాత్మ దివ్యశుభావతారైక
సంక్రీడలకు సహచరత పూని

గీ॥ యనిన [1] భువనైక నిర్మాణమునకు [2] బుద్ధి
చాలకుండిన వారల చంద మెఱిఁగి
యపుడు స్త్రీపురుషవ్యక్తి ప్రాణిగణము
ప్రభవ మొందింపఁ దలఁచి యా ప్రభువరుండు. 109

ఉ॥ సన్నిధి నీడయుం బలెనె సర్వజగజ్జనయిత్రి మాయ దా
నున్న ధరాస్య దృష్టి యిడు చొక్కుట నా సతి దెచ్చె మువ్వుర
న్గన్నెల మోహనాకృతులఁ గాంచన మౌక్తిక నీలవర్ణల
న్వెన్నుని సమ్ముఖంబునకు విస్మిత దివ్య ఫలేక్షణార్థమై. 110

వ॥ ఆ మువ్వురు కన్యలందును గాఁచన వర్ణయగు శుభలక్షణకు లక్ష్మి నామంబు నిర్దేశించి శ్రీమన్నారాయణుండు తన యక్కునం జేర్చుకొని యమితానందం బనుభవించి భానుకోటి ప్రభారాముండును మనోహర రూప యౌవన లీలా వికాసుండునుగా మానసంబున నొక్క పుత్త్రునిం గాంచి మదన నామంబు నిర్దేశించి సన్నిధి నిడుకొని మౌక్తిక వర్ణ వర్ణనీయ నలివేణికి వాణి యను నామంబు నిర్దేశించి శివునకు నిచ్చి పద్మసంభవునకు జగన్నిర్మాణవిద్య దయచేసెఁ దత్ప్రీతిభావంతుండగు నాప్రజాపతి వాణీసమేతుం డగుచుండ మహత్తు పుట్టె నా మహత్తువలన నహంకారంబు పుట్టె నహంకారంబువలనఁ బంచతన్మాత్రలు పుట్టె నా పంచతన్మాత్రల వలన మహాభూతంబులు పుట్టె నందుఁ బ్రథమంబున నాకాశంబు నాకాశంబువలన వాయువు వాయువువలన నగ్నియు నగ్నివలన జలంబు జలంబువలన పృథివియుఁబుట్టె వానికి శబ్ద స్పర్శ రూప రస గంధంబులు పుట్టె.

---

109 (1) భవునైనక (వ్రా) భువనైక(వ)
(2) బుట్టి (వ్రా) బుద్ధి (వ)

వీనినెల్ల నొక్కపొదువుచేసి లీలావిభూతి మూర్తియగు మహాప్రభుండు నారాయణుండు బ్రహ్మంబుగాఁ జేసి యందుఁ జతుర్దశ లోకంబులు నిర్మించి యీ లోకంబులు వేల్పులు మొదలు కీటకంబులు తుదిగాఁ బ్రాణిగణంబుల స్త్రీపురుష రూపంబుల నుద్భవింప జేసి శైల తరు గుల్మ లతాది రూపంబున స్థావరంబులు నిల్పి నీ చరాచరంబులు పూర్వకర్మానురూపంబు[లుగా సృష్టిఁ]జేసి 111

క॥ [1] రూపముచే మానవులై
చూపట్టెడు ప్రాణులందు సుభగుని మదనున్
దీపింపఁగఁ జేసెను [2] [సం
తాపము స్త్రీ పురుషులందు దరికొల్పంగన్]. 112

గీ॥ కాముఁడును జిత్తజుఁడును శృంగార యోని
యును స్మరుండును గా [3] నొప్పి యొనర జంతు
[4] [దంపతులు ప్రేమతోడఁ] జరింప మదనుఁ
డఖిల జీవులయందు నాహ్లాద మొసఁగ. 113

సీ॥ సకల జీవులకును సకల వస్తువులందు
నభిలాష రూపియై యడరు చునికిఁ
గాముఁడై పరగుఁ దత్కామ బాణములు క్రో
ధంబు లోభంబు మోహంబు మదము
మాత్సర్యమును నయ్యె మఱి చిత్తమున సుర
తాపేక్షయై తాన యంకురించుఁ
జిత్తజుం డయ్యె నా చిత్తజాశుగములు
ప్రహ్లాద మోహ విభ్రాంతు లితర

గీ॥ విషయ వైరాత్మ పీడలు వినుము యోగ్య
మానినీ స్మృతిమూర్తియై స్మరుఁడు తనరు
శరము లతనికి సంకల్ప సంస్కృతులును
హర్ష సంభ్రమ మూర్ఛలు నమరనాథ. 114

---

112 (1) మానుషరూపమునగడు అని వ్రాత ప్రతిలో నున్నది. ప్రాసభంగము కనుక ప్రథమ పాదము పూరింపబడినది.
112 (2) "సంతాపము స్త్రీ పురుషులందు దరికొల్పంగన్." లుప్తపూరణము
113 (3) గాఁజేసి (వ్రా) గానొప్పి (ప)
113 (4) (దంపతుల ప్రేమతోడఁ) పూరణము.

కం॥ నారీనర సముచిత శృం
గార రసాభరణచయ వికస్వర గతికిన్
గారణమై మదనుఁడు పొం
పారున్ శృంగార యోనియై లోకములన్. 115

వ॥ వానికి నున్మదన మదనమోహన వశీకరణ సంతాపకరంబులు సరవిందా శోకచూత నవమల్లికా నీలోత్పలంబులు శరంబులుగా నమరెఁ దత్ప్రియాంగన రతియయ్యె వసంతుఁడు సహచరుండయ్యె నళిపరంపర నారిగా నిక్షుఖండంబు కోదండం బయ్యెఁ జిలుక రథంబును, జిగురు టల్లియు మీను టెక్కెంబును గలకంఠ జయకాహళంబును నతనికి నమరె నివ్విధంబున సర్వమోహనుండగు మదనుండు నారాయణుని యాజ్ఞా ప్రమాణంబున నద్దేవుజడు మొదలుగాఁగల స్త్రీ పురుషులకు నన్యోన్య గాఢానురాగంబులు కల్పించి సంభోగింపఁజేయుచు రూప యౌవన లావణ్యాదులును భావ హావ హేలాదులును స్రక్చందనాభరణాదులును వన జల క్రీడార్తవోత్సాదులు నగు చతుర్విధోద్దీపనంబులవలన స్త్రీలకు నత్యుత్కట విషయంబగు పురుషునియందును బురుషులకు నత్యుత్కట విషయంబగు స్త్రీలయందును నతిమోహంబు పుట్టించి తత్సమాగమంబులకుఁ జేయరాని యకృత్యంబు లెల్లఁ జేయింపుచుఁ గులాచార వ్యవహార తపస్స్వాధ్యాయ యజ్ఞాదిక్రియా కలాపంబులు బ్రహ్మజ్ఞానంబును విడిపించి పాపిణంబుల కంటెను రతిసౌఖ్యంబే ప్రియంబు గావించి జగదేక విజయుండై బ్రహ్మయోగీంద్రులకు నసాధ్యుండై ప్రవర్తింపుచు. 116

కం॥ ఈ రీతిని మాయా సం
సారంబునఁ దిరుగునట్టి జనులకు శ్రీమ
న్నారాయణ ముఖ్యులకు
న్మారుని గెలువంగఁ దరమె మర్త్యాధీశా. 117

కం॥ హరిమూర్తిభేద మగుటన్
హరికాసన వర్తియగుట నమ్మదనునకున్
దురితము లే దెట్లును స్త్రీ
పురుష వ్రతహానివలన భువనము లందున్. 118

---

116 వ. ప్రణామంబున (ప్రా) పరిమాణంబున (ప)

క॥ శృంగార యోని యగు న
య్యంగజుఁడు భవన్నిమిత్త మవమాంబక ద
గ్ధాంగుండై క్రమ్మఱ న
ర్ధాంగునిగాఁ జేసెఁ గంటె యా ముక్కంటిన్. 119

సీ॥ ఆదిలక్ష్మికిఁ బంకజాక్షునకు జనించి
యాదిగర్భేశ్వరుఁడైన వాఁడు
మగలకు మగఁడైన మగఁటిమి గలవాఁడు
భువనైక విభ్రమ స్ఫూర్తి వాఁడు
తాపసులకు గుండె తల్లడం బగువాఁడు
జ్ఞానలతా ధాత్రి యైన వాఁడు
మోదాంబునిధికిఁ జంద్రోదయం బగువాఁడు
జగదేకవీరుఁడై నెగడు వాఁడు

తే॥ రతి పయోధరయుగ పరిరంభ సుఖమె
సుఖముగాఁ జొక్కుఁ జూపులఁ జూచు వాఁడు
సంతతానంద నిధి పుష్ప సాయకుండు
వాని కెవ్వాఁడు వశవర్తి గానివాఁడు. 120

వ॥ అట్లగుటం జేసి 121

మ॥ విద్యుద్దృగ్జలము న్విలాపసరణి [1] స్వేరుద్ధ్రుమోర్వీజ సం
పద్ద్యోగంబు పసుత్వదాత్మమహిమ న్మహ్యాత్మజా యుత్తుఁడై
హృద్యత్క్రీడల దండకావనమునం దీరీతి శ్రీరాఘవుం
డాద్యుం డచ్యుతుఁ డున్నవాఁడు క్షేమదనాయత్తాత్ముఁడై [2] మత్తుఁడై. 122

మ॥ మన మేకైవడి నైన జానకిని రామక్ష్మాపతిం బాపి యి
వ్వని కా దేవుని నియ్యకొల్పవలయు న్బ్రార్థించి యా భూమిజన్
దనుజేంద్రుండు హరింపఁగావలయు నానాభంగులన్ లంకకున్
గొనిపోవ న్వలయు న్మదాంధుఁ డయి యా క్రూరుండు కామార్థతన్. 123

---

122 (1) స్వేరుదృదుర్వీజ (వ్రా) స్వేరుద్ధ్రుమోర్వీజ (ప)

122 (2) తమ్ముఁడై (వ్రా) మత్తుఁడై (వ)

క॥ ప్రాణము ప్రాణం బగు నా
యేణాక్షి స్సీత దనుజుఁ డెత్తుక చనినన్
క్షోణీపతి వేగమ త
త్ప్రాణములకు నలుగు నపుడు బ్రతుకు జగంబుల్. 124

క॥ మన దేవమాయ పంపున
దనుజేంద్రుఁడు రావణుండు ధరణీతనయన్
వినుకలి కనుకలి మరుల
న్గొని పోవఁగ వలయు నర్కకుల మొఱగ వడిన్. 125

క॥ శ్రీ లీలావిగ్రహ మా
బాలిక భూపుత్రి యిట్టి పనికి న్మదిలోఁ
జాలఁగ సంక్షోభించు
న్దాలిమి చెడి మనల శాపదగ్ధులఁ జేయున్. 126

ఆ.వె. ప్రాణవిభుని బాపి సంతాపమును బొంది
సురలఁ గ్రోధదృష్టిఁ జూడ కుండ
నఖిల జనని లక్ష్మి నభయంబు వేడెద
మేతదర్థసిద్ధి కిపుడు మనము. 127

మ॥ అనుకంపామతి నా జగజ్జనని కార్యం బెంచి దేవ ప్రయో
జన మాత్మీయ మటంచు రామధరణీశగ్రామణీ విప్రయో
గ నితాంతవ్యథ లంక నుండినఁ దదుగ్రక్రోధదావాగ్నిచే
దనుజాధీశుఁ దపోర్జితాభ్యుదయ కాంతారంబు భస్మంబుగన్. 128

ఉ॥ కృత్త శిరోంబుజంబుల నసృగ్జలధౌత శివాంఘ్రి పద్మముల్
సత్తుగఁ బూజ చేసి బహుసంపదల న్బెనుపొందు రావణుం
డుత్తమ సాధ్వి సీత యటులుండఁగఁ దద్విభవంబుతో మహో
ద్వృత్తి యణంగి కూలునె ధరిత్రి సగోత్రము గాఁగ వృత్రహా. 129

క॥ మన చేసిన కార్యమునకుఁ
దన మది నలుగఁడు విభుండు తగుపూనిక వ
చ్చిన పని కిదియు నుపాయం
బని మన కభయం బొసంగు నసురుండును మున్. 130

వ॥ అని పలికిన యాచార్యుని మహోపాయంబునకు నింద్రాది దేవనికాయం బభి
నుతించెఁ దదనంతరంబ. 131

మ॥ ఉరుయోగస్థిత శూద్రకంఠ దళనప్రోక్షిప్త కౌక్షేయకా!
ధరణీదేవ[1] సుతాసు దానకలనా!తత్త్వజ్ఞ చూడామణీ!
శరణార్థిప్రకరప్రసాద సుముఖా! సత్య ప్రతాపోన్నతా!
పరమర్షి ప్రతిప త్తిదృశ్య సుమహద్బ్రహ్మప్రభా మండలా! 132

క॥ రసిక గుణో త్తర శబరీ
రసవత్ఫల మధురసజ్ఞ! రవిసుత కృత స
త్య సఖిత్వ! పవనసుత హృ
ద్బిసరుహ ఖరకిరణ! హిత విభీషణ వరదా! 133

ఉత్సాహము. శైశవ ప్రమోదితాంబ! స్వ రవివంశదేశికా
భ్యాస లబ్ధ వేదశాస్త్ర పరమ నీతి కోవిదా!
కౌశికోద్వరారివీరఘన సమీర ఖండనా!
శ్రీశచాపదండ ఖండకృత మహీసుతాశయా! 134

గద్యము. ఇతి శ్రీ మదనగోపాల చరణకమల సేవాధురీణ నత్కళాపారీణ
కృష్ణభట్టారకపౌత్ర చింతలపూడి కామయప్రభుసుపుత్ర శుద్ధ
సారస్వతవిభవ రాధామాధవ ప్రణీతం బయిన తారకబ్రహ్మ
రాజం బను మహాప్రబంధంబు నందు తృతీయాశ్వాసము.

శ్రీసీతారామార్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ

# తారకబ్రహ్మరాజీయము

## చతుర్థాశ్వాసము

క॥ శ్రీనిత్య సత్యసంధ చి
దానందమయాత్మపూర్ణ! అవ్యయ భవ్య
జ్ఞాన స్వరూప! వాణీ
శాన మనః పద్మధామ! జయ రఘురామా! 1

వ॥ దేవా! విన నవధరింపుము. పరాశర మహాముని శ్రేష్ఠుండు వసిష్ఠ శిష్యుండైన
వామదేవునకుఁ దరువాతికథ వినుమని యిట్లనియె, 2

చ. అమరులు సంతసింపఁగ బృహస్పతి పావన చిత్తవృత్తి దోః
కమలయుగంబు ఫాలఫలకంబునఁ జేర్చి పయఃపయోధి మ
ధ్యమున[1] సమా(ధి) లోఁ గనక హర్మ్యమునన్ ఫణిరాజు శయ్యపై
నమరు మురారి వక్షము మృగాక్షిని నక్షవివేకఁ జూచుచున్. 3

క॥ హాటక పీతాంబర కటి
కోటి న్నసమానమూర్తిఁ గురువింద మణీ
కోటీరహీర విస్ఫుట
శాటంక న్శంఖ చక్ర ధర సిరిఁ దలఁతున్. 4

చ॥ వికచ ముఖారవింద మరవింద విరోధి నధఃకరింప హ
ల్లక మొక విభ్రమమభ్రమర లాలన మొప్పఁగ లీలఁ ద్రిప్పుచున్
చకిత మృగీ విలోకముల సన్నని నవ్వులఁ జేరి పుష్ప సా
యక గురునిం గరంచు కమలాక్షికి లక్ష్మి కొనర్తు నంజలుల్. 5

శా॥ అక్షుల్విప్పిన లోకముల్వెలుఁగు మూయన్మాయు నే దేవిచే
దాక్షిణ్యంబున నాశ్రితావళికి నిత్యప్రాజ్యసామ్రాజ్య తే
జోఽక్షీణాక్షణ లక్ష్మి లే జనని నెయ్యంబారఁగా నిచ్చుచున్
రక్షించుం దగ నా శరణ్యచరణం బ్రార్థింతు శ్రీదేవతన్. 6

సీ॥ సకల దివ్యాంగనా జన పూజితోల్లస
త్కల్పక ప్రసవాంఘ్రి కమలఁ గొల్తు
దివ్యాభరణ రత్న దీప్తి నీరాజనా
ధగధగత్తనుధాళధళ్యఁ గొల్తు

---

3 (1) నెయో....(వ్రా) సమా(ధి) – (ప)

నభయ ముద్రాపద్మ హాటక భాజన
మాతులుంగ కరాంబుజాతఁ గొల్తుఁ
గరుణారసాపూర్ణ దరహసిత కటాక్ష
సంరక్షితాశ్రితజాలఁ గొల్తుఁ

గీ॥ ప్రాణవల్లభ వక్షోవిభాగ కౌస్తు
భాగ్ర పీఠికఁ గొలువుండు నఖిల జనని
నఖిల కల్యాణ కారిణి నర్థిఁ గొలుతు
శ్రీమహాలక్ష్మి నభిమత సిద్ధికొఱకు. 7

మ॥ అని ప్రార్థించిన సర్వమంగళ త్రిలోకారాధ్య దుగ్ధాబ్ధి నం
దన మందార తరుప్రసూన రుచిరోద్యత్పుష్పకారూఢయై
కనుపట్టెం దరుణారుణ ప్రభ కటాక్షశ్రీస్మితజ్యోత్స్న యా
నన పూర్ణేందుని గ్రోవ నాభరణ రత్నచ్ఛాయ లుపొంగఁగన్. 8

సీ॥ పార్శ్వ దేశంబులఁ బ్రాంజలులై గిరి
రాజ పుత్రియున్ భారతియుఁ గొలువ
ధవళాత పత్రంబు ధరియించి దగ్గరి
దేవేంద్రు పట్టపుదేవి యుండ
ననలాది దిక్పాల కాంగనల్ కెలఁకుల
సోలుపై నిల్చి వీచోపు లిడఁగ
గంధర్వ కిన్నర కామినుల్ వేణు వీ
ణానాద మధుర గానములఁ జెలఁగ

గీ॥ సిద్ధ విద్యాధరస్త్రీలు చేరి కనక
వేత్రములతోడ హుంకృతుల్ విస్తరింప
కరుణ సాక్షాత్కరించిన కమల నాభు
దేవి కందఱు మ్రొక్కిరి దివిజ వరులు. 9

క॥ జీవుఁడు వెండియుఁ ద్రిభువన
జీవ కళామూర్తి నుతులు చేసె న్భక్తిన్
భావజు తల్లిని దీనై
కావన కల్పద్రుమాభ వంచిత లీలన్. 10

దండకము. శ్రీమన్మహామంగళాకార శృంగారలీలావతారా గుణోదార నారాయణీ పుణ్య
సంచారిణీ శంఖ చక్రాంకితా బ్జోభయోన్నిద్ర ముద్రా సుధాపూర్ణ సౌవర్ణ
శుద్ధోజ్జ్వల న్మాతులుంగ స్ఫురద్బాహు పద్మా మహాపద్మ పద్మాది నానావిధా
నేశ్వరీ సర్వభూతేశ్వరీ శాశ్వతైశ్వర్య సంపత్ప్రదా భద్రసద్రత్న భూషా
ప్రభాభూషితా శేష [1]లోకావనాలోకనాశు ప్రసారంబు భాగ్యైక సారంబు నీ దివ్య
తేజోలవం బర్క బింబంబు నీ చారు శారీరశోభా ప్రభావంబులై సోయగం బాత
పంబై [2]తమం బెల్ల నీ నీలధమ్మిల్ల వల్లీ ప్రతిచ్ఛాయ నీ మందహాసామృత
స్యంద లేశంబు దుగ్ధాబ్ధి [3]నీ గంధవన్మంద నిశ్వాస మీ గంధవాహుండు
నీవల్ల భాయల్లకస్మార సంతాప వైశ్వానరం బగ్ని నీ పాద పద్మంబులో రేణు
లేశంబు సర్వంసహా మండలం బెల్ల నాకాశ తత్వంబు నీ నాభి మధ్యావకాశంబు
లోకంబు లోకైకమాతా గుణాతీత నీ మేలు లేకున్న లోకంబు నిర్లోకమౌఁ
గాదె యాది న్విరూపాక్షుఁ డక్షుద్రతేజస్వి దాక్షాయణీ విప్రయోగంబునం గుంది
ప్రాలేయ శైలంబులన్దా పసత్వంబునన్నుండఁ దన్నుం దదద్రి ప్రజం గూర్పఁగా
వచ్చిన న్మెచ్చి శామింగెఁ గ్రోధాగ్ని నీ పుత్రునిం జైత్రమిత్రు న్వడిం దెచ్చె
నీ వత్కృపా దృష్టికిం దప్పి సన్మంగళాచార దూర్వాకృతిన్ భూత[4]కోలాహ
లోగ్ర శ్మశానంబున న్బాడిదన్ ద్రుంగుచుం గూడునుం గోకయు న్లేక బ్రహ్మ
ఘ్నుఁడై కొంతకాలంబు వర్తించి నీ పాదముల్భక్తిఁ జింతించి నిన్జేరి నీ చేతి
భిక్ష న్మహాహత్యకుం బాసి శుద్ధాత్ముఁడై గౌరియుం దాను త్వన్నేత్ర పద్మాంచలో
జ్జాత చేతోజసన్మాన్యుఁడై యుండె నా పుండరీకాయతాక్షుండు దేవీ నినుం
బెండ్లియాడంగ శృంగార లీలార్థి నీలీల లైనట్టి యా కన్యకా............
తత్తండము లమండనాగ్రేసరంబు ల్మహామృత్యుభీత్యుగ్ర పీడాహరంబు ల్నిజాం
గంబుల న్మంగళార్థంబు దాల్పంగ మేలంచు సద్భక్తి సేవించి చంచత్తదే
కాంగ్రిమశంభ న్నశౌశిం దగ న్యంబుఁ డొం దౌదలం దాల్చి ఖండేందురేఖాయలిం
దాను మృత్యుంజయత్వంబు తోడన్ విభూత్యష్టకం బిష్టదంబై వశంబయ్యె
నయ్యంబికాదేవియు న్వేడ్కతో నుండి తాఁదాల్చి ప్రాణేశు నీశుం గరంగించి
విఘ్నేశ సేనానులం బుత్రులం గాంచె విఘ్నేశ్వరుం డొండె తాఁదాల్చి విఘ్న

11 — (1) లోకార్వదాలోక. (వ్రా) లోకావనాలోక (ప)
(2) తపంబెల్ల (వ్రా.) తమంబెల్ల (ప)
(3) నింగందకస్తంభ (వ్రా) నీగంధవన్మంద (ప)
(4) లోకాహలోగ్ర (వ్రా) కోలాహలోగ్ర (ప్ర)

ప్రహారత్వముబొంది సర్వార్థసంపూజ్యుఁడై యుండె నాఖ్యే వుండొండ తాఁదాల్చి
శ్రీసిద్ధయోగీంద్రుఁడై సిద్ధవిద్యాధరాదుల్ తమం గొల్వఁగా నుండె బ్రహ్మాణియుం
గేలిమై నొండఁ దాఁదాల్చి వాగ్దేవియై మించె నేకాంబ్రసి చీవ్యన్నఖాళి స్మరారాతి
యుం బ్రీతి లీలా వరాహావతారంబునన్ దంష్ట్రిగా నుండి తాఁదాల్చి భూమం
డలం బెత్తె నాఖండలుం దొండ తాఁ దత్ప్రసాదంబునం దాల్చి తత్స్వర్గ
సామ్రాజ్య లక్ష్మీవినోదంబునన్ రాజమీరంగ నైరావణేభేంద్ర శిక్షార్థ మేపార
హీరాంకుశ శ్రీ వహించెన్ సరోజాసనుం డొండ బ్రహ్మాస్త్రి మర్దేంద
వక్త్రంబుగా నిచ్చి తాఁదాల్చి ఖండద్వయిన్ జాతిగాంగీతము(?) గెల్వ మధ్య
ప్రదేశంబునం బెట్టి సాంద్రంబుగా చంద్రబింబంబు గావించి లోకత్రయీనేత్ర
మోదంబు గైకొల్పె లీలారవిందాగ్రపాణీ మహాసైకతశ్రోణి గీర్వాణ గంధర్వ
సిద్ధాప్సరస్త్రీలు సన్గొల్త్రి పుణ్యాత్మలుం గొల్త్రి దాసీజనంబుల్ ప్రవాళా
రుణాక్షి ప్రతిష్ఠాను......మహాశౌర్య తేజోమయంబుల్ త్రిలోకీ వశీకారవిద్యా
మహామంత్ర తంత్రౌషధీరూప లీలా విలాసంబులున్ దత్ప్రభావంబు నీ భావ
నంగాక చేకూరునే యన్య సంసేవనా నిష్ఫలన్ వమ్మునిశ్రేష్ఠ యోగీంద్ర
హృద్ధ్యాన యోగ్యా మహావేద సిద్ధాంత వాఙ్మృగ్య తద్బ్రహ్మ చైతన్య మధ్యం
జనీ దివ్యలీలా కళాంకంబుగా నంశుమత్కోటి తుల్యప్రకాశా విశాలాక్షి బ్రహ్మైక
మూర్తీ సహస్రార పత్రోల్లసచ్చక్ర పద్మస్థలీకేళి చిద్వర్తినీ దేవి శ్రీతారక
బ్రహ్మ మంత్రైక విద్యా మహావేద్య సద్యస్స్వభక్తార్తి సంతాప శాంతి ప్రవ
త్పుణ్య కారుణ్యవీక్షా సుధాధార శృంగార వారాంనిధీ నీదు సౌందర్యలీల
న్నుతింపంగ బ్రహ్మాదులు స్సేర రెంతైన నీ కాంతుఁ డత్యంత తేజోమయ
బ్రహ్మమై యున్నచో నీవు విద్యాస్వరూపం బవై పూరుషుండైన చోట న్ప్రకృ
త్యాఖ్యవై విష్ణునామంబు గైకొన్నచో మాయవై సృష్టయై యున్నచో వాణివై
రుద్రుఁడై యున్నచో దుర్గవై వేయిపాదంబులున్ వేయిమస్తంబులున్ వేయి
హస్తంబులున్ వేయినేత్రంబులుం దాల్చి బ్రహ్మాండము ల్దాల్చుచో శక్తివై
కాలమై యుండుచోటన్ దివారాత్రి మాపాది మర్యాదవై చంద్రుతోఁ గాంతి
భాస్వంతుతో దీప్తి సప్తార్చితో జ్వాల పుష్పంబుతో గంధసామగ్రి [1]శబ్దంబుతో
వర్థసంపత్తి [2]బ్రహ్మవబోధంబుతో సంతతానంద సంపూర్తి ధర్మంబుతోఁ గీర్తి
వర్తించు చందంబునన్ దల్లి యెల్లప్పుడు న్వేడ్క గ్రీడింతుగా సంతతత్వత్పద
ధ్యాయికింగామధుగ్ధేను చింతామణీ [3]లక్షలన్ లక్ష్యమేనీ కటాక్షాంచలంబొక్కటే

---

(1) శ....బు (వ్రా) శబ్దంబు (ప)
(2) బం....నందసంపూర్తి (వ్రా.) బ్రహ్మవబోధంబుతో సంతతానంద సంపూర్తి (ప)
(3) అక్షులం. (వ్రా) లక్షలున్ (ప)

కాక లోకేశ్వరీ బ్రహ్మలోకత్రయీ పావనం బైన నీ పాదతీర్థంబు సంధ్యాది కర్మార్థ మాత్మీయ సౌవర్ణ పాత్రంబునం బట్టి త్రైవిక్రమైకాంఘ్రిపద్మాభిషేకంబు సేయంగ గంగాభిధానంబునం బారి గౌరీశ సమ్యగ్జటాజూట దుష్పంక సంక్షాళన ప్రౌఢి శోభిల్లుటన్ విన్న ధన్యుండు సర్వాఘ నిర్వాపకుండౌ జగత్పూర్ణ యుష్మత్పదాబ్జ ద్వయోద్యన్నఖాళీ శరచ్చంద్ర చంద్రాతపశ్రీకి నానారదాదుల్ చకోరత్వ మాళింతు రా చందమందంబుగా నాత్మఁ జింతించినన్ మోహ సంసార శారీర ఘోరాది దుర్వ్యాధి సంతాప దుఃఖంబులెల్లన్ శమించున్ భవత్కేళి సంచార లీలారణోత్సాహ మాణిక్య మంజీర మంజుధ్వనుల్ వీనులన్ సోకినన్ సత్కవి స్వామి వాఙ్మంజరుల్ సార సాహిత్య ధారామరందంబునుం బుణ్య గంధంబునుం గల్గి విద్వద్ద్విరేఫావళీ లీలలంజాలసొంపారఁగాఁ జారురేఖాంచి(?)కాంచీసముద్యత్కటీగుచ్ఛ పత్కాంతిరేఖా మరందాదృతి ప్రాప్త మత్తాళి పంక్తి భ్రమాపాది రోమాళి గల్గంగ దృష్టిప్రదేశంబు లేకుండఁగా నస్తినాస్తీతి [1]వాదానవద్యంబు హృద్యంబు నైనట్టి నీ మధ్యభాగంబు భావించు యోగీశ్వరుం డాత్మ నిస్సంశయ జ్ఞానముం గాంచి నింజేరుఁ కారుణ్య పాథోధి దివ్యాంగనా పూజితానేక నాకద్రుపుష్పావళీ రేణుసంకీర్ణ శోణత్వదీయాంఘ్రి పీఠాంతికక్షోణి దండప్రణామంబులం జేయుచున్ బ్రహ్మ తద్రాగ యోగంబునన్ హేమ గర్భత్వముం గాంచె నా నీ మహా రాజసంబైన పేరోలగం బాత్మ నీక్షించు మర్త్యుండు గండస్థలీ దానధారాభ్రమద్భృంగ సంగీత మాతంగ శృంగారిత ప్రాంగణంబైన మాణిక్య సౌధంబునన్ వేణు వీణా వినోదంబులన్ వేద వేదాంత వాదంబులన్ మోదముం బొంది యిందీవరాక్షీ సహస్రంబు వింజామరల్ వీవఁ గొల్వుండు ఖండేందు శోభాలికా[3]దేలిచేకూఁకు కాంద్రోపన్యస్తంబుపై నుండు. శ్రీపాద పంకేజ మాత్మాంక దేశంబు నందుండు శ్రీపాద పద్మంబు నింపొందగా నుంచి కెందమ్మి పీఠంబునం గేలిమై నుండి వాణీవధూ పాణి నీరేజకీరాంగనా రామరామేతి వర్ణామృతాపూర్ణ భర్తృస్తుతుల్ సేయ విస్రస్త నీవీకమూలంబు నుత్కీర్ణవేణీకమున్ వేపమానాంగవల్లీకమున్ [4]గంటకాంకూర చారుస్తనద్వంద్వ సన్మంజరీకంబు ఘర్మాంబు సంసిక్త గండస్థలీకంబు లీలాదళత్తారకానేకసుశ్రీకముంగా మనోజాత శృంగార చేష్టావిలాసంబు భాసిల్లఁగాఁ జేయు వాల్లభ్య మబ్బించు నీ యౌవనారంభ సౌరభ్య మేప్రొద్దు బుద్ధిం బ్రతీక్షించు ధీరుండు

---

(1) పాదానవద్యలబు. (వా) వాదానవద్యంబు (ప)
(2) ద్వపుష్పావళీ. (ప్రా) ద్రుపుష్పావళీ (ప)
(3) ఇచ్చట సాధుపాఠము అనూహ్యముగానున్నది.
(4) గంధకాంకూర. (ప్రా) గంటకాంకూర. (ప)

వేఱొండు వాంఛల్ విసర్జించు నత్యూర్జితబ్రహ్మ చిద్రూప సంవిద్ర
తిన్ బారవశ్యంబు సంధించు సందేహ మిం దేమియున్ లేదు మోదాత్మకా నీవె
సర్వైక సంసేవ్యవున్ భవ్యవున్ లక్ష్మి రక్షింపు మోవిష్ణుపత్నీ నమస్తే
నమస్తే నమః .

క॥ అని యిటు లానందాశ్రులు
కనుఁగొనలం దొఱఁగ నింద్రగురుఁడు నుతింపన్
విని కరుణావరుణాలయ
వనజాలయ దంతకాంతి [1]వఱలఁగఁ బలికెన్. 12

క॥ దేవత లెల్లను వినుఁడీ
దేవాచార్యోక్త మస్మదీయ స్తోత్రం
బే విమలాత్ముఁడు చదివినఁ
బావన మతి నిత్తు సకల భాగ్యోన్నతులన్. 13

ఉ॥ యోగ్య కులంబు నిత్తు వకలోర్వియు నేలఁగ నిత్తు నాయు రా
రోగ్యము లిత్తు వాగ్విభవరూప నవీన వయోవిలాస సౌ
భాగ్యము లిత్తు కీర్తి జయ పౌరుష తేజము లిత్తు నాత్త వా
ఙ్మృగ్య మదీయ దివ్యరుచి మేళన మిత్తు నిజాశ్రితాళికిన్. 14

ఉ॥ పాడియుఁ బంటయుం దగిన బంధులు భృత్యులు మంచి సొమ్ములున్
వేడియుఁ జల్ది బాలురకు వెన్నయుఁ బాలు పసిండి గిన్నెలున్
బైడి సిరిండ్లలోఁ దిరుగుఁ బచ్చని పంటపొలంతి పండు నే
నాఁడు జయంబునుం గలుగు నా కృప గల్గిన భాగ్య శాలికిన్. 15

మ॥ అధినాధుం డగు విష్ణు నాన వినుఁ డీ యర్థంబు సత్యంబె యీ
మధురస్తోత్రముచేత నెప్పు డయిన న్మత్ప్రీతి గావించు వాఁ
డధముం డేని ఘనుం డగు న్ధరణి రాజ్యశ్రీ సమేతుం డగున్
నిధులన్ స్వర్గము నేలి యెక్కుఁ బిదప న్నీరేజ పీఠాగ్రమున్. 16

వ॥ ఈ వేదతుల్య స్తోత్రంబువలనఁ బ్రసన్న హృదయ నైతి మీ యభిమత
వరంబులు వేడికొం డిచ్చెద నని బృహస్పతి పునఃపునః ప్రణామంబు లాచరించి
యిట్లనియె. 17

---

(12) 1వనరగ (బ్రా) వఱలఁగ (వ)

శా॥ దారిద్ర్యాగ్ని సమేత దుర్విష మనస్తాపంబు చల్లార్పఁగాఁ
బారావారజలంబు చాలదు సుమీ పాథోధిరాట్పుత్రి నీ
కారుణ్యామృతబిందువందు శతభాగం బట్లు సంతాన చిం
తారత్నామరధేనుకోటి సహ[1]యుద్యన్నేత్ర పద్మాంచలా ! 18

వ॥ విన నవధరింపుము. 19

ఉ॥ రావణ బాధలం బడి సురప్రవరుల్ నిజలోక వైభవ
శ్రీవిరహార్తులై కడుఁగృశించి చరింపుచునున్నవారు నా
నా వసుధాధరంబుల వనంబుల వానికి నోడియోడి రా
జీవదళాక్షి యొక్క దరిఁ జేర్పుము దుఃఖపయోధి మగ్నులన్. 20

క॥ నరభోజను తపమునకున్
హరుఁడు విధాతయును గూడి యభిమత వరముల్
కరుణించి చెఱచి రమరులఁ
దరుణీ !మా పాటి వచ్చెఁ దమకుం బిదపన్. 21

క॥ నెఱబిరుదై కైలాసము
పెఱికిన రావణుని జూచి పెంపఱి మదిలో
నెఱుఁగక వర మిచ్చితి నని
కఱకంఠుఁడు పడ్డపాటు కథగాఁ జెప్పన్. 22

ఉ॥ ఓడక పంక్తికంఠుఁడు భుజోన్నతి నా రజతాచలేంద్రమున్
వేడుక నెత్తఁగా గగనవీధి మహావృషభధ్వజంబు ల
ల్లాడఁగఁ జాడ నొప్పెడు శివాలయ రత్నశిరోగృహంబులన్
మేడలు గూలె నద్రిసుత మేను చలింపఁగ నేమి చెప్పుదున్. 23

చ॥ పలుమరు రావణాసురుఁడు పంచిన కింకరు దబ్జసంభవున్
జలరుహపీఠమధ్యగతు సర్వజగత్పతిఁ గొంగు వట్టి వి
చ్చలవిడిఁ [2]ద్రోసె నా విభుని సన్నిధికిం జనుదెమ్మటంచు వే
ల్పుల దెసఁ జెప్పనేల యిఁక లోలవిలోచన చెప్ప మాటలన్. 24

---

18 (1) దుదయన్నిద్ర పద్మాంచలా (వ్రా). యుద్యన్నేత్ర పద్మాంచలా ! (ప)
24 (2) దీసు. (వ్రా) ద్రోసె (ప)

చ॥ పటుభుజుఁడై న రావణుని బాయక కొల్వఁగ లంక కేఁగి న
ప్పటి దెస యేమి చెప్పుదుము బ్రహ్మయు రుద్రుఁడుఁ జూచుచుండఁగాఁ
జటులు చఁటేల్లున న్దివిజసంఘము వ్రేతురు వేత్రపాణు లు
త్కట తపనీయ దండముల ద్వారముల న్మకుటంబు లూడఁగన్. 25

చ॥ అమరసరోజలోచన లహర్నిశము న్మణిదీప మాలికా
సమితి నివాళు లిత్తురు కుచ స్రవ దశ్రులతోడ హ స్త కం
ప మిళిత హేమపాత్రికల పార్శ్వ భయంకర [1]సౌవిదల్ల వే
త్రములు నటింప నంతిపురిఁ దన్నరభోజన రాజమౌళికిన్. 26

క॥ ధీయుతులు దాగి క్రతువులు
సేయఁగ నట నసురు లేఁగి చేకొం డ్రగ్నిన్
బాయక నింద్రాయ స్వా
హా యను నాలోన నైంద్ర మైన హవిస్సున్. 27

సీ॥ అడవి దిగంబరులై నిష్ఠఁ గడలని
మునినాయకుల మ్రానిమొరడు లనియు
నొడలు దూలఁగ వినిశ్చల యోగరూఢి ని
ల్చిన తపస్వుల వింతచెట్లనియును
భూరిజలాశయంబులఁ దపంబులు సల్పు
పారికాంక్షుల నీరుపాప లనియు
నొడలు బూడిద బ్రుంగి బడుగులై తిరుగు [2]వా
చంయములను బిశాచంబు లనియు

గీ॥ [3]గాసిఁ బెట్టక విడువరు గాక యాశ్ర
మస్థు లగు సంయమీంద్రుల మనికి చెఱచి
క్రతువు లుడిగించి బ్రహ్మయోగములు మాన్చి
క్లేశపఱుపుదు రాదశగ్రీవ భటులు. 28

---

26. (1) (...చ్చదల్ల) (వ్రా) సౌవిదల్ల (ప)
28. (2) రాసయ్యములను (వ్రా) వాచంయములను (ప)-
(3) గాసిఁబెట్టఁగ విడుతురు (వ్రా) గాసిఁబెట్టక విడువరు (ప)

చ॥ నిజ మని చిత్తగించు తరుణీ![1] ధరణీసుర బాల వృద్ధ గో
వ్రజములఁ గోసి[2] పొల్పు దిన వాని కళాసము లెల్ల నిండి తీ
ర్థ జలము నుత్తమస్థలులు దైవత భూములు రోఁత లాయెఁ ద
ద్రజనిచరేంద్రభృత్యతతి రాయిడి యెంతకు నోర్తు మీ గతిన్. 29

క॥ ఎన్నింటి కెన్ని చెప్పుదు
మన్నిచుఁడు సేయు బాధ లంటా[3]జగదే
కోన్నతులు నీవు విష్ణుఁడు
నెన్నండును గనరు గాక యీ లోకములన్. 30

వ॥ దేవీ యివ్విధంబున నీకు విన్నవించి నట్లు మాపాట్లెల్ల విన్నవించిన నీవిభుండగు విష్ణుండు శ్రీరామావతారంబున రావణుని వధియించెద నని మాకు నభయం బిచ్చి వచ్చి యిప్పుడు నీ మూర్తి భేదం బగు మేదినీపుత్రిం గూడి దండ కారణ్యంబునం గ్రీడింపుచు మదనోన్మాదంబునఁ గార్యంబు విడిచి యున్న వాఁడు దానికి మాయాబలంబుల రావణుం బ్రేరేపించి కామాకులత్వంబున నా పరమపతివ్రతను సీత నెత్తుకొనిపోయి లంకాపురంబున బందిఁబెట్టు నట్లు చేసి తత్త్రోధంబున వాని తపఃప్రభావాభిరామ తేజోజయ బలసంపదలు హరింపఁ జేసి సీతా వియోగంబున నోర్వక రామచంద్రుండు శీఘ్రంబున వాని నుగ్ర సంగ్రామ ముఖంబునం జంపు నట్లు తలంచితి మీ కార్యంబునకు నీ వంగీ కరించి రామచంద్రుండును మావలన విముఖుండు గాకుండ నుపాయం బాన తీయవలయు నిది మాకు నిచ్చ నభిమతం బనిన శ్రీమహాలక్ష్మి యిట్లనియె. 31

క॥ ఈ కార్యము మంచిదె మి
మ్మాకోమలి దూఱ దాత్మ నది నే నగుటన్
గాకుత్స్థుఁడు నలుగఁ డిఁకన్
శ్రీకరముగఁ దక్షపంబు సేయుఁడు భక్తిన్. 32

---

29. (1) ధణీసుర. (వ్రా) ధరణీసుర (ప)
(2) తినవానికుబాదులు నిండి... తీ (వ్రా) పొల్పుదిన వాని కళాసము లెల్ల(ప)

30. (3) జగదేకొన్నంతులు (వ్రా) జగదేకోన్నతులు (ప)

వ॥ అని యింద్రప్రముఖులకు జయశబ్ద పూర్వకంబుగా శ్రీరామ తారక బ్రహ్మ మంత్రం బుపదేశించి భయంబు వారించి సకల సంపదల నొసంగి శీఘ్రంబున మీకు జయం బయ్యెడు నని యద్దేవి వైకుంఠంబునకుం జనియె నంత. 33

ఉ॥ కాళిక వోలె నీల తనుకాంతులు పర్వఁ గపోల కుండల
శ్రీలు కపోలపాళికలఁ జిందులు ద్రొక్కఁగ నప్సరోంగనా
జాలము మ్రొక్కఁగా నపుడు స్వర్గపురీ నృపవీథి వచ్చె లీ
లాలసభంగి శూర్పణఖ యా సుర లందఱుఁ జూచుచుండఁగన్. 34

క॥ అచ్చరలు వెంట రాఁగా
వచ్చెఁగా సుర భూజపుష్ప వాసన దివ్వఁగా
జెచ్చెరఁ దద్వనమునకు వి
యచ్చరవరు లున్న కడకు నలరులు ముదువఁగా. *35

ఆ.వె॥ ఇంద్రుఁ డాదిగాఁగ నెల్ల వేల్పులు దాని
నెదురుకొనిరి యదియు నేఁగుదెంచి
పారిజాత మూల భర్మవేదిని సమా
సీన యైనఁ జూచి జీవుఁ డపుడు. 36

క॥ క్రూరుం డగు రావణు నా
జ్ఞా రూపం బిదియ దీనిఁ జక్కఁగ మును దా
శ్రీరాముఁడు వీక్షించిన
నా రాక్షసి మానభంగ మగు జగ మలరన్. 37

క॥ దీని వెడలింపవలయుఁగా
జానకి సొబగెల్లఁ జూడ జనపతి కడ క
చ్చో నిది రాముని ముందటఁ
దానయి తన యెమ్మెచూపు దర్పము కలిమిఁగా. 38

---

* 35 ప. నుండి 42వ పద్యము వఱకు ఆం. ప్ర. ప్రా. లి. గ్రం. వారి వ్రాత ప్రతిలో లేవు. one leaf missing అని వ్రాయబడినది. ఈ లుప్తభాగము శిథిలమైన తాళపత్ర గ్రంథసాహాయ్యముతోను మొదటి వ్రాతప్రతి సాహాయ్యముతోను వ్రాయఁ బడినది.

వ॥ దీని దుర్వికారంబుల కోర్వక రామవిభుండు దండించు నతనిచేత దండింపం బడె నేని పగగొని యోపినంతయుం జేయు దీని మూలంబున రామ రావణులకుం గలహం బగు మాతలంపు సఫలం బయ్యెడు నిప్పుడు బహుమానించి పంపవలయు నని పుష్పఫలాదులు దేవేంద్రునిచేత నిప్పించి యిట్లనియె. 39

క॥ నీ రూప యౌవనములకు
నీ రాజసవిభవములకు నీ కెనసేయన్
లే రే చక్కని పొలఁతులు
నీరజభవ శంకరాది నిలయము లందుఁ. 40

వ॥ అనిన నది యిట్లనియె. 41

శా॥ ఔ నీ వాడిన యట్లు నకు సరి పద్మాక్షిన్ త్రిలోకంబులఁ
గాన న్నామది కొక్కచే వెలితి నా కన్నిచ్చకు న్వచ్చువాఁ
డేనాఁడు న్గన రాఁడు నూతన వయో హేలా విలాసంబులఁ
మీనాంక క్రియల న్మనంబు గరఁగఁ నెయ్యంబు పుట్టింపఁగఁ. 42

వ॥ అనిన విని బృహస్పతి యిట్లనియె. 43

క॥ ఈ విధములు గల పురుషుం
డీవేళను రామభద్రుఁడే ధారుణిలో
భావింప నతఁడు సీతకుఁ
దా వశ్యం డయ్యెఁ గాని దైత్యతనూజా! 44

వ॥ రామభద్రుం డెవ్వఁ డఁటివేని భూలోకంబున నయోధ్యానగరం బేలెడు సూర్యవంశంబురాజు దశరథేశ్వరుని పెద్దకొడుకు. (1) (అతని) పినతల్లి మగనికిం గూర్చినదై (తన) కొడుకు భరతుం డను వాని పట్టంబు గట్టుటకై రాముని రాజ్యంబు వెడలింప — మగని నొప్పించె. ఇప్పు డా గుణోత్తముండు దండకవనంబున జానకీనామ భార్యాసమేతుండై వనవాసంబు సేయుచున్నవాఁడు. నిన్ను జూచెనేని చేయంగల బహుమానం బెల్లం జేసి తన కార్యం బెల్లం దీర్చుకొను ననిన నుత్సహించి. 45

---

45 (1)........(వ్రా). అతని, తన (పూ)

ఉ॥ జానకి మ్రింగి రాఘవునిఁ జయ్యన లంకకుఁ గొంచుఁ బోయి నా
మానిత సౌధదేశమున మన్మథకేళి సుఖింపుచుండెదన్
దా నని చుప్పనాతి ప్రమదంబున వేల్పులనిల్పి దండకా
కానన సీమకుం జనియెఁ గాలబలాహక ఖండముం బలెన్. 46

క॥ ఆ నెలవున నిజరూపము
మాని రతిప్రతిమ మనుజ మానినియై యా
కానఁ జనుదెంచె రఘుపతి
గానం గల్పద్రు పుష్పగంధముతోడన్. 47

క॥ దూరమున నుండి చూచెన్
శ్రీరామ క్షోణిరమణు సీతారామున్
[1]శ్రీరమణీయాత్మని గ
న్నారన్ సాక్షాన్మనోభవాకృతి సుకృతిన్. 48

వ॥ చూచి నిజాంతర్గతంబున 49

ఉ॥ చూచితి నిందుశేఖరునిఁ జూచితిఁ గాంచన గర్భు నింద్రునిం
జూచితి నింద్రనందనుని జూచితిఁ జూచితిఁ జంద్రు మన్మథున్
జూచితి నిట్లు రామవిభుఁ జూచినకైవడి నెన్నడైన నా
లోచన పంకజాతములు లోలము లయ్యెనె తద్గుణంబులన్. 50

వ॥ అని పర్ణశాలా ప్రాంగణంబున నవ్విభునిఁ గలికి సయ్యాటంబులఁ దేనె లొలుకు మాటల నొయ్యారంపు నడకల గయ్యాళింతల బిగువుకౌఁగిలింతల మైత్రి నెరపు భూపుత్రిం జూచి. 51

క॥ ఈ జలజాక్షియె జానకి
ఈ జానకి కేల వలవఁ డీ రాఘవుఁ డీ
రాజ నిభాననఁ బోలన్
రాజ నిభాననలు గలరె త్రైలోక్యమునన్. 52

48 ప. (1) శ్రీరామారమణీయాత్మని (వ్రా) శ్రీరమణీయాత్మని (ప)

సీ॥ కనకగర్భుఁడు గాన కనకంబు మేనుగా
  నిలిపి మై నిగనిగ నిలిపినాఁడు
పద్మాసనుఁడు గానఁ బద్మంబు మొగమున
  నిలిపి సౌరభ్యంబు నిలిపినాఁడు
వాణీశ్వరుఁడు గాన వాణిఁ గంఠంబున
  నిలిపి వీణెను జేత నిలిపినాఁడు
హంసవాహుఁడు గాన హంసేంద్రయానంబు
  నిలిపి యొయ్యారంబు నిలిపినాఁడు

గీ॥ గాక స్రష్టకు నింకఁ దక్కొ-నకైక
గుణము లున్నవె జానకీ కుచ నితంబ
కచ నఖాంకుర మృదులోరుకాండ ముఖ శు
భాంగ సౌభాగ్య విభవంబు లలరఁ జేయ. 53

క॥ [1]అని యెంచుచు నా దానవి
కనక కనద్భూషణముల కమనీయ రుచుల్
వనమున నెవ్వ న్నె పెట్టఁగఁ
జనుదెంచెన్ రామచంద్ర సన్నిధి కెలమిన్. 54

వ॥ చని తన వైభవంబునకు జానకియుం దాను నరుదుపడుచుం జూచు రామ
చంద్రుని పురోభాగంబున నిలిచి 55

ఉ॥ గుంజదళీంద్రబృందముల కోరిక లీరిక లెత్తఁ జేయు లే
మంజుల పారిజాత నవమంజరి కానుక వెట్టి యేను మృ
త్యుంజయ శైలరాజ తులనోత్కట బాహుబలుండు గోత్ర భి
ద్భంజనుఁ డల్ల రావణుఁడు తత్ప్రియసోదరిఁ గామరూపిణిన్. 56

క॥ [2]నా కెనవచ్చెడి పతి యే
లోకంబుల లేఁడు మనుజలోకములోనన్
నీ కథఁ గఁ జెప్ప విని సుర
తా కాంక్ష న్వచ్చితి న్మహా మోహమునన్. 57

---

54 ప. (1) అనుచు దానవి. (వ్రా) అనియెంచుచు నాదానవి. (ప)
57 ప. (2) నా కెన గూడియపతియే (వ్రా) నా కెన వచ్చెడిపతియే. (ప)

ఉ॥ కోరిక మీఱ నన్ను గవగూడి మదీశుఁడ వైన నిన్ను నీ
ఘోరవనంబులన్ వనటఁ గ్రుమ్మరఁ జేసిన కైకఁ బుత్త్రితో
దారుణ భంగి మ్రింగి వసుధాతల మంతయు నీకు నిచ్చి దే
వారికిఁ బంక్తికంఠునకు నాప్తుని జేయుదుఁ బెక్కు భంగులన్. 58

చ॥ (1) అనవుడు రాఘవుండు దరహాస రసోల్లస దాస్య పద్ముఁడై
యనియె దశాననుండు ఘనుఁ డట్టులె నీవును నట్టిదానవే
నిను గవగూడి పేర్కు వపనీతల మేలుట మంచిదౌఁ దలం
చిన వ్రత మేకదార రతిశీలము నా కది మాన వచ్చునే. 59

వ॥ అనిన నది యిట్లనియె. 60

క॥ ఆ విధమేనియుఁ దగ నం
భావింపుము రామ యేకపత్నీ వ్రతమున్
గావింపుటకు స్త్రీని మ
హీ వల్లభ విడువు మనిన నినకులుఁ డనియెన్. 61

గీ॥ వ్రత నిరూఢియె కాదు నా ప్రాణ పదము
దీని నెడఁబాయఁ జాల నేఁ దీఁగెబోణి
నా సహోదరుఁ డున్నాఁడు నాతి లేదు
వాని యచటికిఁ బొమ్మ నీ వాంఛ దీర్చు. 62

క॥ నావుడు కానిమ్మని యా
[1] భావజ సంతప్త హృదయవతి యా దనుజ
స్త్రీ వచ్చె లక్ష్మణుని కడ
కా వెలఁదిం జూచి నవ్వి యా గుణనిధియున్. 63

---

57 వ (1) భావజ సంతప్త దేహమతిచెడి (ప్రా) ఇచట యతిభంగము
భావజసంతప్త హృదయవతి. (ప)

క॥ మును చక్కనివాఁ డని రా
మిని కడ కేఁగితివి కామ మోహితమతి నా
మనుజపతి రోసి విడిచిన
నిను గూడుట సిగ్గటంచు నిరసించుటయున్. 64

క॥ పెంపువ దశరథ సూనుల
యింత పెఱుఁగక దనుజకాంత యేపుడిగి వృథా
లంపటమున నిహపర సుఖ
సంపదలం బాసి పాపజాతియు వోలెన్. 65

క॥ కనువేదురు గొని వచ్చిన
పని వృథయై పోవ మానభంగం బగుటన్
దన శూర్పణఖా నామం
బునకుం దగు ఘోరరూపమున నిల్చి వడిన్. 66

క॥ ఆ సురవిద్వేషిణి వసు
ధాసుత దట్టింప విభుఁడు తమ్ముని తోడన్
హాసోచిత నాసా శి
[1]ఖా సంవిదితాత్మఁ జేయనగు నని నవ్వెన్. 67

మ॥ అని రామానుజుఁ డాత్మవాక్సరణి మాయాపాద విద్యోగ్ర రా
క్షసి ముక్కొప్పఁగఁ గోసెఁ బ్రాజ్ఞులు చెలంగన్ మీఁద నీ రీతి నా
రసి రామానుజుఁ డాత్తవాక్సరణి మాయావాద విద్యోగ్ర రా
క్షసి ముక్కొప్పఁగఁ గోయుఁ బ్రాజ్ఞులు చెలంగంగా నటించుం దగన్. 68

వ॥ ఇవ్విధంబున ముక్కు గోసిన నా రక్కసి కలంగి యచ్చోటు తొలంగి నింగి
కెగసి సిగ్గులేక హుంకరించి లంకకుం బోవుచున్నదాన రావణునకుం జెప్పి
యిప్పగ నీఁ గెద ననిన లక్ష్మణుం డిట్లనియె. 69

క॥ నా వచనము పొందుగ నిది
గో విను నిను బట్టి ముక్కు గోయుట గా దా
రావణుని ముక్కు గోయుట
గా వగవుము పొమ్మ వాని కడ కీ మూర్తిన్. 70

67 ఖాసం....ది (ప్రా) శిఖా సంవిదితాత్మ (పూ)

క॥ అనవుడు సీతాంగన న
వ్వీన నది వినువీథి వంక వ్రేలున గాని
మ్మని పగఁ జాటుచుఁ బోయెన్
దన (కోసిన) ముక్కు రక్తధారల తోడన్. 71

క॥ అది ఖరముఖ్యులఁ దెచ్చెన్
పదునాలుగుకోటులను సువర్వారుల నా
పదునాలుగు కోటులఁ ఖతి
పదునాలుగు శరము లేసి పాటుగఁ గూల్చెన్. 72

శా॥ ఆ రామప్రభు వీరరేఖ గని దేహం బెల్లఁ గంపింపఁగా
నా రక్షోంగన యంగభంగమున నెట్లాలంకకుం బోదు నా
వారెల్ల న్నను నవ్వరే యనక దేవవ్రాతముల్ నవ్వఁగా
వారాశీంద్రము దాటి లంక కరిగెన్ వైహాయసాధ్వంబునన్. 73

క॥ కొంగు ముడి వేసికొంచుఁ జె
లంగుచు నింద్రాది సురలు లంకకు పీ ర
క్షోంగనయె మృత్యు వయ్యెన్
ద్రుంగె న్రావణుఁడు నేఁటితోడ నటంచున్. 74

వ॥ ఇవ్విధంబున నికృత్తఘ్రాణ శూర్పణఖ రక్తపంక పంకిల ముఖంబుతో లంకా పురవాసు లాతంకంబునం బొంద దెందంబునం గొగులుచు నుడువీథి నగరు సొచ్చి ప్రతిద్వార పాలకవేత్రహస్త[1] (నిరుద్ధవిద్యాధర కిన్నర కింపురుషగంధర్వ గీర్వాణ మండలంబును పార్శ్వభాగ నిటలతల ఘటిత కరకమలముకుళన పర భాగప్రశస్తప్రహస్త)ప్రకంపన మహాకంపన పార్శ్వమహాపార్శ్వ కుంభనికుంభ దేవాంతక నరాంతక వృశ్చికరోమ శర్పరోమ విద్యుజ్జిహ్వాగ్నివర్ణ ధూమ్రవర్ణ ప్రభృతి వీరదానవలోక భీకరంబును సమీప సౌవర్ణ పీఠాగ్ర సమగ్ర[2] తేజోవిభూషణ విభీషణ మేఘనాద ప్రముఖ సహోదర పుత్రకాది బంధుసందోహ రమణీయంబును సురరాజ ప్రేరిత రంభాద్యప్సరః ప్రదర్శిత నృత్తావధాన సంధాన సంధానిత సకలలోకంబును మానవతీజన వీజ్యమాన చామీకర

---

75 (1) కుండలీకృతఖాగము అం. ప్ర. ప్ర. ప్రా.లి.గ్రం. వారి వ్రాతప్రతిలో లేదు.)

75 (2) "రథావళ్ళధావళ ధాళ్య ప్రకాశిత సభామంటపంబును" అని అం. ప్ర. ప్ర. ప్రా లి. గ్రం. వారి ప్రతి.

[1]చామర ధాళధళ్య ప్రభాప్రకాశిత సభామంటపంబును నగు పెద్ద కొలువున సింహాసనస్థుండై సముద్దండ బాహుదండ మండలాగ్ర ముఖ్య మహోగ్ర సాధన ముఖ్య దేదీప్యమాన రేఖాయుతుండును దశదిశాదిదేశ ద్విసంఖ్యాహీన భానుబింబ ప్రతిబింబ జనక కనక మాణిక్య కిరీట పటల సూచిత త్రిలోకైక మూర్ధాభిషిక్త ప్రభావుండునై శోభిల్లుచున్న యన్నకు మ్రొక్కి తనవృత్తాంతం బంతయు నెఱింగించి యిట్లనియె. 75

క॥ నా యవమానం బా రఘు
వాయకు సతి నతి విలక్షణను సీదు నిజో
పాయంబునఁ గొని వచ్చినఁ
బాయు న్లేకున్నఁ బాయుఁ బ్రాణము లెల్లన్. 76

ఉ॥ నీవు సమస్త లోకముల నీరజనేత్రల రూప యౌవన
శ్రీ విభవంబు విభ్రమము చిత్తము రంజిలఁ జూచి నాఁడవే
యీ వసుధాతనూజ సరియింతులు గల్గుదురే జగంబులన్
భావజురాణి యా తరుణి పాదనఖద్యుతిఁ బోల దన్నచో. 77

వ॥ అవిన నా దానవేంద్రుండు దాని నూరడించి పంచశర శరాకీలిత హృదయుం డగుచుఁ గాలంబు ప్రేరేప నెవ్వరిచేత నాపంబడక పుష్పకారూఢుండై పంచవటికి వచ్చి యదృశ్య రూపంబున నా రూపవతి సీతను జూచి చూపు త్రిప్ప లేక మోహించి రాముని తేజంబు తన తేజంబుకంటె వెక్కసంబయి యుంట బలిమి విడిచి మారీచుని మాయామృగంబుఁ జేసి రామ లక్ష్మణుల వశీకరింపం జేసి తద్వియుక్త నయ్యుత్తమ సాధ్వి నెత్తుకొని వచ్చి లంకాపురంబునం బ్రమదోద్యానంబునం దవకుం జేరిక యగుదాక బందిఁ బెట్టె నప్పుడు. 78

సీ॥ భీకర ధ్వనితోడఁ బృథివిపైఁ బడియె న
ద్భుతముగాఁ బెద్దగోపురము విఱిగి
తలలు గన్పడని సీడలు దోఁచె గోడల
నా తపచ్ఛాయల నలరుచున్న

75 1 చామీకరచామర ధాళధళ్య (పూ)

బిలములోఁ బడ్డట్లు బిమ్మిటి గుడిచిరి
వీరదానవు లెల్ల విస్మితముగ
మిన్ను పైఁబడ్డట్లు మిన్నక దివి చూచి
దానవస్త్రీ లెల్లఁ దల్ల డిలిరి

గీ॥ జనకపుత్రిక లంకఁ జొచ్చినది మొదలు
గాఁగ నేఁటాది తుదనెల కడదినమునఁ
జచ్చు రావణుఁ డని జగజ్జాల మెల్ల
వినఁగ నశరీరవాణి యా వేళఁ బలికె. 79

క॥ శ్రీవనిత యనుమతంబున
రావణుఁ బ్రేరేచి యీ ధరాపుత్రిని గొం
పోవఁగఁ జేసనఁ బటు మా
యా విభ్రమ కల్పనమున నమరు లటంచున్. 80

క॥ అంతర్ధానంబున శ్రీ
కాంతుఁడు రాఘవుఁడు క్రూరకాండంబున నా
వింత మెకపు రక్కసునిఁ గృ
తాంతునిపురి కనిచి వచ్చి యాశ్రమ భూమిన్. 81

మ॥ పటురోషంబున నిల్చి దానవపతిన్ బ్రహ్మాస్త్ర లూనాస్యుఁ జే
యుటకుం గారుడబాణ వైఖరిని నయ్యుర్వీతనూజాతఁ దె
చ్చుటకుం జిత్తము వెట్టి యిట్టి పని యిచ్చో నేల లీలామహో
త్కట సంగ్రామ మొనర్చి కాక యనుచుం గాంతా వియోగంబునన్. 82

క॥ మదిఁ గప్పిన మోహంబునఁ
దుది నేమియుఁ దోఁప కపుడు దోర్బల లీలా
పదన మదన శరజాలక
విదళిత ధృతి యగుచు రామవిభుఁ డిట్లనియెన్. 83

మ॥ ధరణీనందన యెందు దాగెనొకదా తా నాటకై వంచనన్
దరుషండంబుల దండఁ గైకొనియెనో తానేకదా నన్ను నీ
హరిణార్థం బిటు పంపెఁ గాదె హరిణాక్ష్యాలోకన ప్రీతిచేఁ
దిరుగం బూని యనూయచేఁ గన వినన్ ద్రృష్టింపఁగా నొల్లదో. 84

చ॥ [1]నెమలి కడంకఁ బంచవటి నీడలఁ [2]బాదులు మున్నుగాఁగ వృ
క్షముల నికుంజ పుంజములఁ గాంతయు నేను రమించు నట్టి దే
శముల నటించుఁ గ్రమ్మఱి విశాల విలోచనఁ గానలేక యా
శ్రమతల పర్ణశాల కడ సంచరియించుచు నశ్రు లొల్కెడుఁన్. 85

చ॥ పవడపుమోవి నీ నగవు పల్లవ బాగ తుషార వారి బిం
దువుగతి నున్ననీ యరిది తోరపు ముత్తెపు ముద్దు ముంగరన్
దివియఁగ నీ ప్రకోష్ఠ రుచి నింపుచు నచ్చిఁతపండటంటివే
భవదుచితోక్తి సత్క్రియలు పాయవు నా మది తోయజేక్షణా! 86

ఉ॥ కీరము రామ రామ యని కేరుచుఁ బిల్చిన భంగి నీవు నిం
పారఁగఁ బిల్చి నన్ను బ్రియమారఁగఁ గీరము పిల్చె నంచు నేఁ
గీరము ముద్దుసేయఁ దిలకించుడు నిప్పుడు నిన్ను బిల్చె నీ
కరము ముద్దుసేయు మని క్రీడ యొనర్చితివా తలోదరీ! 87

చ॥ బిగియఁగఁ గౌఁగిలించుకొని బింకపుఁ జన్నులు క్రుంగ నొక్కుచున్
జిగిబిగి చూత మంచు నను జేరి కవుంగిటఁ జేర్చి యేను నా
బిగువున నొక్కి క్రుంగ నివి విల్లును మెల్లన నొంచె నన్న నీ
మగతన మింతెపో యనిన మాటకు నవ్వితిఁగా విలాసినీ! 88

క॥ ఇది యెందని బ్రమసితినా
యిది గాదే సీత నన్ను నెలయింపుచు ను
న్నది యని పూగుత్తులతోఁ
గదలెదు నునుఁదీఁగ విభుఁడు కౌఁగిటఁ జేర్చెన్. 89

---

85 (1) నెమనికగాక (వ్రా) నెమలి కడంక (ప) (2) నిందెలు (వ్రా) బాదులు (ప)
86వ పద్యముతరువాతి గ్రంథము హైదరాబాదు ప్రా. లి. గ్రం. ప్రతి యందులేదు.
తరువాతి భాగము మొదటి వ్రాతప్రతినుండియు తాళపత్రప్రతినుండియు గ్రహింపబడినది.

వ॥ ఇవ్విధంబునం గొంత ప్రొద్దు రామచంద్రుండు జగద్విమోహనార్థంబు సుమశరకృత విరహవికార నాట్యక్రీడ నభినయించి లక్ష్మణుండును దానును పంచవటి వాసి జటాయువు ననుగ్రహించి శబరి పూజను గైకొని పంపాసరోవరంబు గాంచి హనుమంతుని నాత్మభృత్యునిగా నంగీకరించి సుగ్రీవుని మైత్రి చేసికొని వాలిని గూల్చి సుగ్రీవుని గిష్కింధా నగరంబునఁ గపిరాజ్యంబునకు నధిపతిం గావించి వర్షకాలంబు ఋష్యమూకంబున నిల్చి సీతాన్వేషణం బొనర్చి రమ్మని తన మణిముద్రికను పవనతనయు చేతికి నిచ్చి చెప్పంగల మాటలు చెప్పి పంప నవ్వీరశేఖరుండు సముద్ర తీరంబునకు వచ్చి లంకాభిముఖుండై దాట నుద్యోగించి. 90

క॥ తన చేతి ముద్ర యాకస
ముననె గెగయఁగవైచి యవల ముదమున నది గై
కొనియెద నని యంభోనిధి
హనుమంతుఁడు దాట నెంచె నద్దరి నంతన్. 91

చ॥ అది జనలోక మందుకొన నందుఁ బ్రజాపతి కొల్వు దీర్చి తా
నిది రఘురాము ముద్ర యిట కే క్రియ వచ్చెనొ యంచుఁ జూడ న
య్యదనునఁ బారుదెంచి పవనాత్మజుఁ డుండఁగ ముద్ర యుండెఁ ద
త్పదమున బ్రహ్మదేవుని సభావిభవంబును జూచె వేడుకన్. 92

సీ॥ బ్రహ్మ సమానులు బ్రహ్మ మునీంద్రులుఁ
పరమ యోగీంద్రులు భాసురాగ్ని
వైవస్వతాసుర వరుణ మరుద్యక్ష
నాయకేశానులు నలిన సఖుఁడుఁ
జంద్రుండు మంగళ సౌమ్య సురాసురా
చార్య తమఃకేతు శనులు మఱి హ
రిశ్చంద్ర ముఖ సుచరిత్ర భూపాలురు
నశ్వమేధాది యాగాధిపతులు

గీ॥ నన్నదానవ్రతులు నన్నృతాత్ములును స
భాభిరాముని దను గొల్వ నలరు బ్రహ్మఁ
బ్రమదమునఁ జూచి చింతించి బ్రహ్మ యితఁడె
బ్రహ్మ పద మిది యని యెంచెఁ బవనసుతుఁడు. 93

క॥ హనుమంతుని తేజంబును
ఘన జవరేఖయును గాంచి ఘనముగ నపు డా
వనజాతాసనుఁడును నా
తని కొలువున నున్నవారుఁ దాముం బొగడెన్. 94

చ॥ పవనతనూజుఁడుం దిరిగి బాహుబలంబున లంకఁ జొచ్చి య
య్యవనిజఁ గాంచి రామవిభుఁ డంపినఁ దన్మణిముద్ర యిచ్చి త
ద్యువతిమణీ శిరోమణి సముజ్జ్వల తేజముతోడ నవ్వనం
[1](బవిహతలీలమైఁ జెఱిచి యక్షయుఁ జంపి దహించె లంకఁ దాన్) 95

క॥ సీతాచూడారత్నము
వాతూల తనూజుఁ డిచ్చి వసుధా పతికిన్
జేతోముద మొనరించిన
నాతనిఁ దన యక్కుఁజేర్చి యధిపతి యనియెన్. 96

క॥ ఉంగరము చేతి కిచ్చిన
యంఁగన నిను జూచి యేమి యనియెను మును పె
న్బెంగి వగ గ్రుంగి యున్నది
సంగతముగఁ జెప్ప వయ్య సత్య చరిత్రా! 97

ఉ॥ నావుడు వాయునందనుఁడు నా ఘను నిట్లను దేవదేవ! నీ
దేవి మహోగ్ర నాగసుదతిం బురుణించుచు బందె నున్న దా
దేవ విరోధి చెంత వనదేశమునందు నశోకమూలమం
దే విహతస్థలిం దొరఁగు దృగ్జలధారలు గ్రమ్ముచుండఁగన్. 98

క॥ ఏను హనుమంతుఁ డనియెడు
వానరుఁడన్ రాము బంట వనితా యిది యా
భూనాథు ముద్ర గొమ్మని
నీ నచ్చిన యానవాళ్ళు నేఁ దెల్పుటయున్. 99

---

95 ప — (1) కుండలీకృత భాగము లుప్తపూరణము.

ఆ॥వె॥ నమ్మి యుంగరంబు నలినాక్షి చూచి శ్రీ
రామభద్ర యున్నఁ బ్రేమ నంది
శిరము నుంచి యక్కు సేర్చి మహాప్రభో
పాహి పాహి రామభద్ర యనియె. 100

క॥ లీలానిల వశమున పై
రాలిన [1](వకుళప్రసూన) రజ మశ్రువులన్
మేళనము చేసి కుచమ
ధ్యాలంకారముగ ముద్ర నచ్చొత్తెఁ దగన్. 101

క॥ శ్రీరామ రామ యని మన
మారఁగ నారామభూమి నా రామ జపం
బారూఢిఁ జేయుచున్నది
కోరి భవత్పదము చేరఁ గువలయ నాథా! 102

వ॥ అనినం బరమ హర్షంబునుం బొంది రఘునందనుండు రవినందన ప్రభృతి కపిసేనలతోఁ దోయధి తీరంబున విడిసె న[2](ంత సీతను రామున కర్పించి లంకాపురిని గాపాడు కొను మని హితము నుపదేశించిన విభీషణుని రావణుఁ డవమానించె విభీషణుండు రావణుని విడిచి వచ్చి) శ్రీరాముని శరణు సొచ్చిన శ్రీరాముండు సముద్ర తీరంబుననే యతనిని లంకారాజ్యంబున నభిషిక్తుం జేసి తనకుం ద్రోవ యీని సముద్రుం జూచి. 103

చ॥ ధరణిజ క్రోధ దృష్టి తుద దానవలోక చిరాయురబ్ధి దు
స్తరత యడంగి సూక్ష్మ తృణసంగత శీకర మట్టు లున్న దా
సరణిని నీవు నుండు మని బాణ ముఖంబున మౌక్తికాకృతిన్
శరనిధి నిల్పె రాఘవుఁడు సర్వ జగన్నయనాద్భుతంబుగన్. 104

---

101 (1) కుండలీకృత భాగము పూరణము.

103 (2) లుప్త పూరణము.

క॥ పుడిసిలి బట్టితి నే న
ప్పుడు శరధి నటన్న నా తపో గర్వం బి
ప్పుడు విడిచి సిగ్గు వడితిన్
గడలి రఘూద్వహుని శరముఖంబున నున్నన్. 105

చ॥ వనధి ననుగ్రహించి ఘనబాహుఁడు సేయఁగ నాజ్ఞ వాయు నం
దనుఁ డొక కొండఁ దెచ్చి సముదగ్ర భుజోన్నతి లీల వైచెఁ దే
ల్చిన నది సేతుబంధ మయి సింధువునం దనరారె నూఱు యో
జనములు పాదయానమునఁ జయ్యన దాటుచు లంక కేఁగఁగన్. 106

క॥ (1) (వడకఁగ నడుగులచే భువి
కదలిఁ గడచి) కట్టమీద గగనము ముట్టన్
వడి నార్చుచు లంకాపురి
గడగడ వడకంగఁ గపులు గములై పెక్కుల్. 107

ఉ॥ కూల్చిరి లంకపై కురికి గోపుర పంక్తులు కోటగోడలున్
(2) (వేల్చిరి రాక్షస ప్రముఖ వీరుల నాహవ యజ్ఞకుండికన్)
(3) (వాల్చిరి ఘోరరాక్షసుల వక్షము లుగ్రనఖాళిఁ జీల్చుచున్)
దేల్చిరి మోదవార్నిధిని ధీరుని రాముని వానరోత్తముల్. 108

చ॥ అసమున నింగినుండియు మహాచలసన్నిభు లాహవంబునన్
బ్రసభముగాఁగఁ బోరుచును వ్రాలిరి నేలకు నుగ్రరాక్షసుల్
(4) సనివితవోని రామవిభు శాతశరంబుల రావణేశ్వరో
ల్లసిత జగత్త్రయైక జయలక్ష్మి లిఖించిన భూజముల్ బలెన్. 109

---

107 వ. (1) కుండలీకృత భాగము లుత్తపూరణము.
108 (2) (3) కుండలీకృభాగములు లుప్తపూరణములు.
109 (4) అపదృశపీం (ప్రా) యతిభంగాదులు; సనివితవోని (ప)

మ॥ అతికాయుండును నింద్రజిత్తును భుజాహంకార లీలా విని
ర్జిత వై వస్వత వాసవుల్ (మడిసి రాజిన్ వీర) సౌమిత్రి సం
శ్రుత వై వస్వత వాసవాస్త్రములచే బృందారకాదీంద్ర సం
చిత నానా భువనైక వర్ణిత యశస్తేజంబు లబ్బో యనన్. 110

మ॥ దశకంఠుండు సమాన విక్రమునం దా నిల్చె సంగ్రామ వీ
థి శివ బ్రహ్మ కరప్రభావ మహితోద్దీప్తోగ్ర దివ్యాస్త్రుఁడై
కుశలుండై భుజవింశతి స్ఫురణచే క్రూరాయుధోదగ్రుఁడై
దశదిక్కీర్ణ కిరీట రత్నరుచియై దావానలాకారుఁడై. 111

చ॥ పోరిరి రామరావణులు భూరిభుజాబల మొప్ప నిద్దఱున్
సారస సంభవాది దివిజ ప్రకరంబులు మింటఁ జూడ ది
క్పూరిత దివ్య బాణమణి పుంఖ రుచి ప్రచయంబుతో నసృ
గ్ధారలతోఁ గటాక్షముల దారుణ వీక్షలు జేవుఱింపఁగన్ 112

ఉ॥ రాత్రి చరేంద్రుతోడ రఘురామ నృపాలుఁడు పోరె నేఁడహో
రాత్రము లంత ఘోర సమర స్థితుఁడై పదినూరుమారు లా
క్షాత్రపుశక్తిఁ ద్రుంచె దనుజప్రభు మస్తకపంక్తి వానిచే
ధాత్రి తనర్చె నెంతయును దమ్మికొలంకును బోలెఁ జూడఁగన్. 113

చ॥ రణ విజయాభిరామ రఘురామ శిలీముఖ సంహతుండు రా
వణుఁ డని జీవ మేద నవవారి మహామృత సన్మరంద పా
రణ సుఖ కేళిఁ దేలిచె [2](సురప్రతతుల్ ముదమందు నట్లు) మా
ర్గణ మొక టా మహాదనుజరాజు జగంబు నుతించె నెంతయున్. 114

చ॥ చిర విరహానలంబునఁ గృశించిన భూమితనూజ లోక భీ
కర శిఖి మేను క్రాఁగఁ ద్రిజగజ్జయలక్ష్మియుఁ బోలె నున్న సొం
పరుదుగఁ బుష్పవృష్టి గురియన్ గమలాసన శంకరాది ని
ర్జర జయ నాదముల్ చెలఁగ రాముఁడు చేకొనెఁ గౌతుకంబునన్. 115

---

110ప. (1) కుండలీకృతభాగము లుప్తపూరణము.
114 – (2) కుండలీకృత భాగము లుప్తపూరణము.

క॥ జయశీలుఁడైన రాముఁడు
జయజయ రామా యటన్న జనులకు నెల్లన్
జయ మిత్తు ననియె నప్పుడు
జయ జయయని పల్కె విబుధ సంఘము తోడన్. 116

వ॥ ఇవ్విధంబున జగదేకవీరుఁడైన రావణుని వధించి విజయ రామవిభుండు విభీష ణుండు తెచ్చిన కుబేర పుష్పకంబున సీతాసమేతుండై యెక్కి లక్ష్మణ విభీషణ సుగ్రీవాంగద హనుమజ్జాంబవన్నల నీల గజగవయ గంధమాదన సుషేణ బలి ముఖ ప్రముఖ సేనలన్నియును దనతోన పుష్పకం బెక్కి సేవింప నిలింపాళి రామం బగు నభంబుననె నిల్పి వనస్థుఁ డయి సేతుబంధనంబునకు వచ్చి శివ ప్రతిష్ఠా పూజాదులు ఘటికాత్రయంబున నొనర్చి ఘటికాద్వయంబు భరద్వాజా శ్రమంబున విందారగింప నిలిచి పదునాల్గవ యేఁడు తుదిదినంబు పదునాల్గవ ఘడియను నందిగ్రామంబున భరతుని యనల ప్రవేశంబు మాన్పి యతని ననుగ్రహించి వసిష్ఠ కౌసల్యాదులకుం దమ వార్తను దెల్ప ముందర వాయు నందను నంపె నప్పుడు. 117

క॥ భరతుఁడు రామనృపాలుని
కరుణానిధి సీతతోడఁ గై సేసె మనో
హర పూజ లొనర నందఱు
స్థిరముగఁ బూజించె సంతసించిరి వారల్. 118

మ॥ హనుమంతుండు నిమేష మాత్రము నయోధ్యా రాజధానీ మణిన్
ఘన వైహాయస వీధి నేఁగి కనె జాగ్రత్స్వర్ణ మాణిక్య కే
తన లీలానట సన్నివేశ హృత కాదంబాది హృన్నిదళా
టన శూన్యాంబురుహా........................................మదిన్. 119

క॥ పురలక్ష్మి రామధరణీ
వరు రాకకుఁ (దపము సల్పు వడువునఁ) బుర గో
పుర మణిమందిరఁ దినకర
కర (దీపిత యగుచుఁదాను) గానఁగ నయ్యెన్. 120

---

120 ప. కుండలీకృత భాగములు లుప్తపూరణములు.

వ॥ అని చేరంబోయి తత్పుర దక్షిణద్వార పరిసర ప్రదేశంబునందుఁ బౌరజన పరంపరలుఁ గౌసల్యా కైకేయీ సుమిత్రలును హా హా కారంబులు సేయ భరతుండు శ్రీరామచంద్రుండు రాలేదని యనల ప్రవేశంబునకుం బూనుకొనిన. వసిష్ఠ మహామునియు శత్రుఘ్నుండును గౌసల్యా సుమిత్రాది స్త్రీజనంబులును దన్ననుసరింప భరతుండు చితిని వెలిగింపఁ బోవుచున్న సమయంబునఁ జుక్క తెగి పడ్డట్లు మహాద్భుతంబుగా నచ్చోటికి హనుమంతుండు దిగి వారితో నిట్లనియె. 121

క॥ రామ నృపాలుఁడు సీతా
సౌమిత్రులతోడఁ గూడి చనుదెంచె జయో
ద్దాముండై యదె నంది
గ్రామంబున నుండి యనిచెఁ గరుణా బుద్ధిన్. 122

వ॥ నేను హనుమంతుం డను వానరుండ నిందు రఘుకుల గురుం డగు వసిష్ఠ మహాముని యెవ్వరు? నా స్వామి యగు రఘురాముని గన్నతల్లి జానకీదేవియత్త కౌసల్య యెవ్వరు? రఘువీరుని వనవాసంబున కనిచి త్రైలోక్య కంటకుం డగు రావణాసురుని వధింపఁజేసి లోకంబుల సంరక్షించిన భరతుని తల్లి యగు కైక యెవ్వరు? శ్రీరామచంద్రునకుం గడపటి తమ్ముండును గుణాఢ్యుండైన శత్రుఘ్నుం డెవ్వ రని యడిగి యందఱ నెఱింగి వారికిం గ్రమంబునం బ్రణ శ్రీరామచంద్రుని సమస్త వృత్తాంతంబునుం జెప్పి యిప్పుడే పుష్పకంబున శ్రీరాముండు వచ్చుచున్నవాఁ డని సకలజనుల నానంద వార్ధిం దేల్చి యందఱం బురంబు ప్రవేశింపం జేసినఁ బురజను లెల్ల నగరి వారితోడం గూడి హనుమంతుని బూజించి పురంబు కైసేసి ప్రాకార గోపుర సౌధ వీథులఁ [1](తోరణ పతాకలతోడ) నలంకరించి పుష్పకంబున కెదురు చూచు చుండిరి. శత్రుఘ్నుండును సుమంత్రాది మంత్రులతోఁ జతురంగ బలంబుల నాయత్తంబు చేసికొని[2] (సమలంకృతం బైన సాకేత) పుర ద్వారంబున మహావైభవంబున నుండె నంత. 123

---

123 (1) కుండలీకృత భాగము లుప్త పూరణము.
(2) కుండలీకృత భాగము లుప్త పూరణము.

శా॥ వచ్చెం బుష్పక మభ్ర మార్గమున భాస్వద్భాను సంకాశమై
ప్రోచ్చండధ్వని ఘంటికావళులతోఁ బ్రోద్యద్ధ్వజ శ్రేణితో
మెచ్చు ల్పుట్ట రహించు (కాంతితతితో) మింట న్విలోకించి య
త్యుచ్చైర్నాద జనైక సంస్తుతుల సంయోజించి రాశావశిన్. 124

చ॥ అగచరకోటి సూచె మణి(హాటక సౌధ విశేష) వేష్టితం
బగు రఘురాము వీడు భువనైక మనోజ్ఞము నయ్యయోధ్యపై
(నెఱెడి కేతనంబులను హృద్యము చంద్రశిలా మనోజ్ఞమై)
ధగధగ మంచు సౌధమణిధామము వ్యోమము ధిక్కరింపఁగన్. 125

చ॥ అహిమకరాంశుహీన కమలాసన లోక నివాసు లందఱున్
బ్రహత తమస్తతుల్ ప్రకట భానుకులేశ్వర చంద్రచంద్రికా
నిహత సరోజరాగ మణినిర్మల నిత్యనిరంతర ప్రభా
వహనముచేత భోగపతి పల్కు తెఱుంగ రశక్తి పెంపునన్. 126

చ॥ అగడిత లక్షసంఖ్యఁ దనరారు మహోద్యుతిచేఁ బురంబునం
(దగణిత హేమరత్నమయ హర్మ్యసహస్ర సహస్రభాను లా)
గగన తలంబు సేయు మణికాంచన దీప్తి[1] (నగేంద్ర) కామినీ
నిగనిగవత్తనుద్యుతిని నీరద చంచలలౌ దిశావళుల్. 127

క॥ పరిఘాజలవిస్ఫుట వి
స్ఫురిత ప్రతిబింబములను బుష్కర పద్మా
కర మధ్య దేశ వాసవ
పుర(మో యన నొప్పుదానిఁ) బొగడఁగ వశమే. 128

వ॥ ఇవ్విధంబున సకల సౌభాగ్య యోగ్యం బగు నయోధ్యా నగరంబు సేరవచ్చి
పురద్వారంబునఁ బుష్పకంబు భూమికి డిగె నప్పుడు సకలజన కరకమల

---

124ప. కుండలీకృతభాగము పూరణము.
125ప. కుండలీకృతభాగములు లుప్త పూరణములు.
127ప. కుండలీకృతభాగములు లుప్తపూరణములు. (1) గజేంద్ర. (ప్రా)
128ప. కుండలీకృతభాగము లుప్త పూరణము.

ముకుళితత్వంబున రామచంద్రత్వంబును ముఖకమల వికసనత్వంబునఁ గమలాప్త కులత్వంబును సార్థకంబులుగా రామవిభుండు దనర శత్రుఘ్నుండును సుమంత్రాది ప్రధానాష్టకంబు తోడ శ్రీరామవిభుని పాదపద్మంబులకుఁ జాగిలి మ్రొక్కిరి [1](సీతాదేవిని లక్ష్మణుని సుగ్రీవ హనుమద్విభీషణాదుల నుచిత రీతిని సంభావించి) రాసమయంబున సర్వాభరణ భూషితంబగు పట్టపు చేపంగునందు దేవియుం దానును శ్రీరామ నృపాలుం డెక్కి యిరుగడల నేనుంగుల నెక్కి సుగ్రీవ విభీషణులు ముక్తాతపత్రంబులు ధరియింప భరత లక్ష్మణులు వింజామరలు వీవ నంగదుండును జాంబవంతుండును నుభయ పార్శ్వంబులం బాదపద్మంబులకడ నిలిచి రథాగ్రంబున హనుమంతుం డానందంబున నృత్యంబు సేయుచుం జనుదేర నమ్ముందట శత్రుఘ్నుండు మంగళ వాద్యంబులు మొరయుచుండ వేదవిదు లగు విప్రుల స్వస్తి మంత్ర పఠనంబుల తోడఁ గదలుచుండ వానర దనుజ మనుజ పరంపరలు బరాబరులు సేయుచు నడచుచుండ మేడలపై నిలిచి ముత్తైదువులు కనకాక్షతంబులు ముక్తా ఫలంబులు పుష్పంబులు కంకణ ఝణఝణత్కారంబు లొలయఁ జల్లుచుండ మహావైభవంబునంబురంబు ప్రవేశించి [2](యెల్లరఁ గటాక్ష వీక్షణంబులం గరుణించుచు నేనుంగు డిగ్గి రత్ననీరాజన విరాజిత భూషణ మణిప్రభాభిరామ మూర్తియై శ్రీరామమూర్తి వసిష్ఠాది మహామునులకును గౌసల్యా కైకేయీ సుమిత్రలకును విప్రసహస్రంబులకును నమస్కరించి వారి దీవనల నందియంతఃపురంబున నుండె సుగ్రీవ విభీషణాదులును సుమంత్రాదులును దత్తదుచితస్థలంబుల నుండిరి తదనంతరంబు. 129

ఆశ్వాసాంత పద్యము

మ॥ అంభోరాశి గభీర! మేరునగ ధైర్యా! సూర్య చంద్రాగ్ని తే
జోంభోరాశి !రవి ప్రతాప! దివిజస్తోమార్చిత ప్రాభవా!
దంభాచార విదూర [3](శాత్రవ భుజాదర్పోద్ధతి) స్తంభజా!
సంభూతాంగజభామినీ విమల చంచత్పంచబాణక్రియా! 130

గద్యము

ఇది శ్రీమదన గోపాల చరణకమలసేవా ధురీణ సత్కవితా పారీణ కృష్ణ భట్టారక పౌత్ర చింతలపూడి కామయ్యప్రభు పుత్ర శుద్ధసారస్వత విభవ రాధా మాధవ ప్రణీతం బైన తారక బ్రహ్మరాజీయం బను మహాప్రబంధంబు నందుఁ జతుర్థాశ్వాసము.

---

129 (1) — (2) కుండలీకృత భాగములు పూరణములు
130 — కుండలీకృతము పూరితము.

# తారకబ్రహ్మరాజీయము

## పంచమాశ్వాసము

క॥ శ్రీకర శుభకర వరకరు
ణాకర బాణాగమోక్తికాయిత*ఘన నీ
రాకర తేజోవిజిత ది
వాకర భయనాశ రామ వసుధాధీశా. 1

వ॥ దేవా! విన నవధరింపుము పరాశర మహామునిశ్రేష్ఠుండు వసిష్ఠశిష్యుండైన వామదేవునకుం దరువాతి కథ విను మని యిట్లనియె. 2

క॥ పురము ప్రవేశించిన రఘు
వరునకుఁ బట్టాభిషేక వైభవ మే వై
ఖరి నయ్యె ననిన మునిఖర
కిరణుఁ డగస్త్యుండు వాలఖిల్యుల కనియెన్. 3

సీ॥ అర్కవంశమునకు నాచార్యుఁ డైన వ
సిష్ఠుఁడు రాఘవక్షితిపతీంద్రు
నకు శుభతిథి వార నక్షత్ర యోగ క
రణ నవగ్రహ ముహూర్తమున నెల్లి
యభిజిత్తునందుఁ బట్టాభిషేకం బని
చెప్పిన భరతుండు చెంగలించి
యా క్షణంబున సుమంత్రాదుల కెఱిఁగించి
పురము గైసేయించి పుణ్య వస్తు

గీ॥ సముదయంబులు దెప్పించి సకల భువన
ములను (గలవారి కాహ్వానములను బంపి)
(వారిఁ గొనితేర సర్వదిగ్వా) హనులకు
నబ్ధులకుఁ దీర్థముల కంపె నగచరులను. 4

---

1. *పరమక (ప్రా) ఛందోభంగాదులు; ఘన నీ (ప)
4. కుండలీకృత భాగములు లుప్త పూరణములు.

కం॥ పాతాళ లోకమున ధా
త్రీ తలమున మింటఁ గలుగు తీర్థములకు సం
ప్రీతిఁ జను వనచరుల క
త్యాతత గతి నెదురు కొనిరి తద్దేవతలుఁ. 5

ఉ॥ చాటిరి రేపు రామనృపచం దుని పట్ట మటంచు వేడ్క న
ప్పాటఁ బ్రతిధ్వనుల్ సెలఁగె పీనులవిందుగ నభ్రవాణియున్
(జాటె జగంబు లుల్లసిల శంఖువిధీంద్రులు నాదిగా మరు
త్కోటులు రా దివిఁగలయ ఘూర్ణిలె దివ్యమృదంగ నాదముల్. 6

ఉ॥ ఇందుశిఖావతంసుఁడు నగేంద్రసుతాయుతుఁ దర్థి వచ్చుచో
నంది చెలంగి దాట గగనంబున శాంభవ మౌళి గాంగఁ ని
ష్యంది తుషార పుంజము లజస్రము రాలుచునుండ భూప్రజల్
నందితులై కనుంగొని రనావృతమేఘము వర్షహేతువుఁ.) 7

కం॥ వనలక్ష్మలు పుష్పాదులు
గొని కపినాయకుల నెదురుకొని రెల్లెడ రా
ముని కడ కరుదెంచెద మని
యనుచున్ మన మందు పొంగు నానందముతోన్. 8

కం॥ ఆ చక్రవాళ గిరి ధర
ణీ చక్రేశ్వరులు కామినీయుతులై భూ
షా చయములు కానుక గొని
వే చనుదెంచిరి తదీయ విభవము మీఱన్. 9

వ॥ ఇవ్విధంబున హరి విరించి సురేంద్ర ప్రముఖ దేవ మునికోటులు శేషవాసుకి తక్షక ఐరావతాది నాగనాయక నికాయంబును నద నదీ సముద్ర సరోవర వనశైల పరంపరలును సకల ధరణీమండలేశ్వర సహస్రంబులును సుగ్రీవాది వనచర వీరులును(దిక్పతులును వేల్పులును విభీషణాది రాక్షస లక్షలును పౌర జానపద సమూహంబులును శ్రీరామ పట్టాభిషేకంబునకు వచ్చి సాకేతపురంబునందలి రమ్య హర్మ్యస్థలంబులఁ దత్తదుచిత నివేశనంబుల విడిసి శ్రీరామ పట్టాభిషేక ముహూర్తంబు నిరీక్షించుచుండి రప్పుడు. 10

6వ ప. 3,4 పాదములు లుప్త పూరణములు.

7వ ప. 3,4 పాదములు లుప్త పూరణములు.

క॥ ఈ మై నయోధ్య [1](రఘుకుల
సోముని యభిషేక మహము చూచెడు వేడ్కన్
భూమీధవు లరుదేరఁగ
సామజ హయభట నినాద సంభ్రమ మొలసెన్.) 11

వ॥ నవరత్నఖచితం బగు కనకసింహాసనంబు దండఁ గల్పతరుపల్లవ పుష్ప కలితంబై యఖిలనద నదీ సాగర పుణ్యజలంబులతో నిండిన కనక కలశము వసిష్ఠ మహామునీంద్ర కరకీలితంబై యొప్పారె. వివిధ మంగళ తూర్య రావంబులును, దివ్య మునీంద్రుల మంత్ర నాదంబులును, పుణ్య పురంధ్రీ జనాశీర్వాదంబులును సమస్త పౌరజన జయజయ నినాదంబులును మిన్నొరయుచుండ దివ్యమంగళ విగ్రహం డగు శ్రీరామచంద్రుని రత్నసింహాసనంబున నుపవిష్టుంజేసి వసిష్ఠ మహాముని విశ్వామిత్ర వామదేవ జాబాలి కశ్యపాది మహర్షులతోడం గూడి శ్రీరామచంద్రుని మూర్ధంబున సమస్తనదీ సాగర జలంబులను గనక కలశంబులతో నభిషేకించెఁ. జిత్రపటీస్రగ్విభాసితంబును గర్పూర చందన మాలికారంజితంబును, రత్నదీపాంకుర రాజితంబును, సూర్యప్రభా భాసమానాగ్ర రత్నసింహాసనంబును విప్ర మునిగణ పఠితోరువివిధ శాస్త్ర మంత్ర ఘోషంబును నగుచు శ్రీసీతారామ పట్టాభిషేక మహోత్సవంబు తనరారె. 12

క॥ అచ్చట హరుఁడు విధాత వి
యచ్చర నరనాథ ఫణివరాదులతోడన్
వచ్చి సభ వేడ్క నుండిరి
యచ్చర పూబోణు లాడు నాటలఁ గనుచున్. 13

శా॥ శ్రీరామప్రభుఁ డేఁగుదెంచె నపు డుర్వీపుత్రియుం దాను భూ
షా రమ్యాకృతి నంగరాగ నవపుష్పవ్రాతమాలారుచి
శ్రీ రంజిల్ల మనోజ్ఞ గంధవహ సంతృప్తాఖిలాశాంతుఁడై
చేరెం గొల్వును విప్రులున్ సతులు నాశీరావముల్ సేయఁగన్. 14

సీ॥ మనుచక్రవర్తికి నినుఁ డొసంగిన పద్మ
రాగకిరీటంబు రమణఁ బూని
యనిమిషపతి కకుత్స్థునకు నిచ్చిన యింద్ర
నీలకుండలములు నెమ్మిఁ దాల్చి

11 పద్యములో మూడుపాదములు లుప్త పూరణము.

భరతుఁ డిన్నాళ్లు సద్భక్తితోఁ బూజించి
తొడుగ నొసఁగిన పాదుకలు తొడిగి
[1] (యీశుండు ప్రేమతో నిడినట్టి మౌక్తిక
కంఠమాలను కౌతుకమునఁ దాల్చి)

గీ॥ కనక పీతాంబరప్రభల్ గడలు కొనుచుఁ
గోమలోత్పల తనుకాంతిఁ గూడి మెఱయ
వచ్చు శ్రీరామచంద్ర భూవరుని జూచి
రఖిల జను లును సంతోష మావహిల్ల. 15

క॥ చనుదెంచి రత్నసింహా
సనమునఁ గూర్చుండి రామచంద్రుఁడు సీతా
వనితా సమేతుఁ డగుచున్
గనకాద్రి న్మెఱపుతోడి ఘనముం బోలెన్. 16

వ॥ అప్పుడు దేవేంద్రప్రముఖు లగు ముప్పదిమూఁడుకోట్లవేల్పు లుభయ పార్శ్వంబులఁ బ్రాపై నిల్చిరి. పార్వతీదేవియు భారతియు నరుంధతియు ననసూయయు లోపాముద్రయు నాదిగాఁగల దివ్యమునికాంతలును బురసుందరులును వసుంధరాపుత్రి దండ నుండి కనకరత్నసింహాసనాసీను లైన సీతారామచంద్రులపైఁ బుష్పంబుల నక్షతలను దీవనలతోఁ జల్లుచుండిరి. బ్రహ్మదేవునితోడ వసిష్ఠ వామదేవ కాశ్యప జాబాల్యాది మునులును నారదాది మహాభక్తులును యాజ్ఞవల్క్య ప్రభృతులును వేదమంత్రంబులు పఠించుచు నవరత్నకీలిత కనక సింహాసనంబున సీతారామభద్రుల నాసీనులం జేసి సకలసముద్ర నదనదీజలంబులతో నభిషేకించి వసిష్ఠుండు శ్రీరాముని ఫాలంబునం బట్టంబు గట్టె. పవాళ సురభిళ సుమమాలికలతోడను గుసుమాగరు కర్పూర చందనాదులతోడను దివ్యాంబర దివ్యగంధ దివ్యాభరణంబుల తోడను వెండియు శ్రీసీతారాములనలంకరించిరి. భరతశత్రుఘ్నులు తాళవృంతంబుల సేవించిరి. లక్ష్మణుండు శ్వేతచ్ఛత్రంబుపట్టె. హనుమంతుండు తాంబూలంబునఁ గర్పూర ఖండంబులిడి యొసంగుచుండె. జాంబవన్నలనీలాదులు కొందఱు బిరుదధ్వజంబులు దాల్చిరి. (సుమతి) ధర్మపాల దృష్టి జయంత విజయ సురాష్ట్రి రాష్ట్రివర్ధన సుమంత్రు

---

15 వ. (1) సీసములో నాల్గవ పాదము పూరణము.

లనుమంత్రు లెనమంత్రులును దేవ నర వానర నాగేంద్రాదులు సమర్పించిన కానుకల నందుకొనుచుండిరి. సురలు పుష్పవర్షంబు కురిపించిరి. దివ్యగంధంబుతోడ గంధవహుండు ప్రసరించెఁ దుంబుర చిత్రసేనాదులు పాడి రివ్విధంబునం ద్రిభువనోత్సవంబై శ్రీరామ పట్టాభిషేకంబు సకలజన నయనానంద కరంబుగా వర్తిల్లె. 17

శా॥ ఆనందాశ్రులు గారఁ గంటకిత దేహత్వంబుతో భారతీ
[1](జానీంద్రాది సురప్రముఖ్యులను హర్షస్వాంతులం జేయ నా)
ర్యానాథుండు పరిశ్రస్తుతాండవ [2](చణుండై యాడుచు న్గద్గద)
ధ్వానం బొప్ప నుతింపఁగాఁ దొడఁగె నాధాత్రీశు శ్రీరామునిన్. 18

గీ॥ సంతతానంద! అవ్యయ! సత్యనిత్య
[3](శుద్ధ బుద్ధ స్వరూప! విశుద్ధ నామ
సర్వజగదభిరామ ! దాశరథీ! రామ!)
రమ్యగుణసాంద్ర! తే నమో రామచంద్ర! 19

సీ॥ విశ్వసంరక్షకా! విశ్వమోహనరూప !
త్రిగుణాత్మకుఁడ వైన దివ్యపురుష!
భూమిజ ప్రకృతిగాఁ బురుషుండవై జగ
త్పితృ భావమున నున్న నుతచరిత్ర!
జనకనందిని ప్రపంచ స్వరూపిణి గాఁగ
ద్రష్టవై యొప్పెడి సర్వవిభవ!
మైథిలి వైష్ణవ మాయగాఁ దన్మాయ
కాధార మైన యనంతరూప!

గీ॥ నిర్గుణోపాధి చిద్రూప! నిర్మలాత్మ!
బ్రహ్మయోగీంద్ర హృద్ధ్యేయ! భవ్యతేజ!
శుద్ధ చైతన్య పరిపూర్ణ! శుభ విధాన!
[4](ఓ మహామహ! తే నమో రామచంద్ర!) 20

---

18ప. 1, 2 కుండలీకృత భాగములు లుప్తపూరణములు
2,3 పాదములు లుప్తపూరణములు.
20 ప. (4) పాదము లుప్తపూరణము.

ఆ.వె॥ సీత లక్ష్మి నీవు శ్రీమహావిష్ణువ
వగజ సీత యైన హరుఁడ వీవు
సీత వాణి పద్మజాతుఁడ వీవును
సృష్టి సీత నీవు స్రష్ట వధిప! 21

గీ॥ కాంత పద్మినిగా నుష్ణకరుఁడ వీవు
1(పడఁతి రతియైనచో మనోభవుఁడ వీవు
చాన కుముదిని యైనచో శశివి నీవు)
సాధ్వి సంహారకారిణి జముఁడ వీవు. 22

గీ॥ యామవతి వసు2(మతిసుత యహము నీవు
స్త్రీ విలాసంబు సకలంబు సీత, నీవు
పుం విలాసంబు సకలంబు పుణ్యపురుష!)
భద్రమూర్తులు శ్రీరామభద్ర మీరు. 23

వ॥ అని పెక్కుమార్లు వలగొని నుతులు గావించె. 24

(గ్రంథ మింతవఱకే యుపలబ్ధము
తక్కిన భాగము లుప్తము)

---

22 ప. (1) 2, 3 పాదములు లుప్త పూరణములు.

23 ప. (2) కుండలీకృతభాగము లుప్త పూరణము.

# తారకబ్రహ్మరాజీయము
# ఛందస్సూచిక

| పద్యనామము | 1వ ఆశ్వా | 2వ ఆ | 3వ ఆ | 4వ ఆ | 5వ ఆ | మొత్తము |
|---|---|---|---|---|---|---|
| కందము | 55 | 76 | 52 | 47 | 8 | 238 |
| ఉత్పలమాల | 13 | 10 | 12 | 16 | 1 | 52 |
| చంపకమాల | 15 | 14 | 9 | 21 | 1 | 60 |
| మత్తేభము | 3 | 7 | 7 | 8 | – | 25 |
| శార్దూలము | 8 | 3 | 4 | 6 | 2 | 23 |
| సీసము | 19 | 9 | 15 | 6 | 3 | 52 |
| ఆటవెలది | 2 | 8 | 5 | 2 | 1 | 18 |
| తేటగీతి | 15 | 18 | 6 | 1 | 3 | 43 |
| స్రగ్ధర | | 1 | | | | 1 |
| ఉత్సాహము | | | 1 | | | 1 |
| తోటకము | 1 | | | | | 1 |
| దండకము | | | | 1 | | 1 |
| మాలిని | | 1 | | | | 1 |
| పద్యములు మొత్తము | 131 | 147 | 111 | 108 | 19 | 516 |
| వచనము | 25 | 37 | 23 | 22 | 5 | 112 |
| మొత్తము గద్యపద్య సంఖ్య | 156 | 184 | 134 | 130 | 24 | 628 |

# తారకబ్రహ్మరాజీయము

## గద్య పద్యానుక్రమణిక

| | ఛందస్సు | పుట | ఆశ్వాసము | గ.ప.సంఖ్య |
|---|---|---|---|---|
| ధ్యాన యోగంబు బడిగి | తే.గీ | 18 | 1 | 80 |
| నంజరునయ్య మంత్రికుల | ఉ | 9 | 1 | 35 |
| నడురే యయ్యె మహీసుర | మ | 58 | 2 | 126 |
| నను బదు నాలుగేఁడులు | చ | 70 | 3 | 10 |
| నన్ను బలెను జూచు | ఆ.వె | 63 | 2 | 153 |
| నభమునఁ బుష్పవృష్టి | చ | 37 | 2 | 12 |
| నమ్మి యుంగరంబు | ఆ.వె | 117 | 4 | 100 |
| నరక మని చదివి చెప్పిన | క | 47 | 2 | 61 |
| నరభోజను తపమునకున్ | క | 102 | 4 | 21 |
| నవరత్నఖచితం బగు | వ | 126 | 5 | 12 |
| నాకెన వచ్చెడి పతియె | క | 108 | 4 | 59 |
| నా గురుండు వసిష్ఠుండు | తే.గీ | 13 | 1 | 57 |
| నా నిండు జవ్వనమునకు | క | 53 | 2 | 95 |
| నా మాట చేయకుండదు | క | 62 | 2 | 149 |
| నాయకుఁడయ్యెన్ | క | 7 | 1 | 26 |
| నా యవమానం బా రఘు | క | 112 | 4 | 76 |
| నారద యిమ్మును లొనరుదు | క | 20 | 1 | 68 |
| నారదుఁడు దివ్యముని | తే.గీ | 28 | 1 | 127 |
| నారీనర సముచిత | క | 92 | 3 | 115 |
| నా వచనము పొందుగ | క | 110 | 4 | 70 |
| నావుడు కాని మ్మని యా | క | 109 | 4 | 63 |
| నావుడు నీకు సంకిత | ఉ | 7 | 1 | 25 |
| నావుడు వాయునందనుఁడు | ఉ | 116 | 4 | 98 |
| నాళీక లోచనుండును | క | 40 | 2 | 29 |
| నిఖిల మృగ వ్రజగ్రసన | చ | 36 | 2 | 6 |
| నిజ మని చిత్తగించు | చ | 104 | 4 | 29 |
| నిను బతిష్ఠించిన | సీ | 39 | 2 | 21 |